:: ఫాహియాన ::

# భారతవర్షయాత్ర



ఫాహియాన్

గ్రంథకర్త:

వేలూరి సత్యనారాయణగారు

బి. ఏ., బి. యల్.

విజ్ఞానచంద్రికాగ్రంథమాల 35.

# ఫాహియాన్ భారతవర్షయాత్ర

బౌద్ధమహాయుగమునకు
అనుబంధగ్రంథము.



గ్రంథకర్త:
శ్రీయుత వేలూరి సత్యనారాయణగారు, బి. ఏ., బి.యల్.



ద్వితీయముద్రణము.




ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల,
బెజవాడ.

1936.

 [వెల రు 1—4—0.

III

# కృతిసమర్పణము

మదీయమిత్రులు ఆంధ్రభాషాసేవాభిరతులు శ్రీ జయంతిపురసంస్థానాధిపతులు శ్రీ వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాదరాయ బహద్దరు సుధీమణికి ఈ గ్రంథమును సమర్పించితిని.

గ్రంథకర్త.

# తొలిపలుకు

ఇప్పటికి పదునైదు శతాబ్దముల క్రిందట ఫాహియాను అను చీనా యాత్రికుడు నాటి బౌద్ధమతవైభవమును హైందవనాగరికతను వర్ణించుచు వ్రాసిన యాత్రగ్రంథ మింతవరకును తెనుగుభాషయందు లేకుండు టెంతయు సంతాపకరము. ఈకొదువ దీర్చుటకే నే నీ గ్రంథమును వ్రాయబూనితిని. మఱియు మనయాంధ్రభాషయందు నవలలు, నాటకములు, శతకములు, ప్రబంధములు కుప్పతెప్పలుగ కలవుగాని చరిత్రగ్రంథము లంత విశేషముగ గన్పింపవు. అది యేమిదౌర్భాగ్యమోగాని మన యాంధ్రయువకులకు నవలలపైగల యభిమానము నాటకరచనలయందుగల యభిలాష వీనిపై లేకున్నది. జగద్విఖ్యాతమై వరలిన భారతజాతి నేడు కాలవశమున అధఃపతనమై ప్రాచీనవైభవమును గోల్పడిఅత్యంతదైన్యస్థితియందు పొర్లాడుచున్నది. పరాధీనతయే యీ దుర్గతికి కారణము. ఈ మహాదుస్థితిని తొలగించుటకు మన ప్రాచీన నాగరికతల వర్ణింపగల చరిత్రగ్రంథములు మిగులతోడ్పడగలవు. ఈ కారణముగూడ నన్నీ కార్యమునకు ప్రేరేపించినది.

ఇంక గ్రంథవిషయము: ఇది యేగ్రంథమునకును అనువాదము కాదు. జైల్సు, వెగ్గీ మున్నగు సుప్రసిద్ధ చరిత్రకారుల గ్రంథముల ననుకరించి వ్రాయబడిన యొక స్వాతంత్ర్యగ్రంథము. ఇందు స్వకపోలకల్పన లణుమాత్రమైన లేవు. ఫాహియాను వ్రాసిన యంశములనెల్ల యున్నవియున్నట్లు ఎట్టిమార్పులనుజేయకయె యథాతథముగ తెనుగుభాషయందు వివరింప ప్రయత్నించితిని. ఈతని యాత్రవృత్తాంతము చదువరులకు సులభముగ గ్రాహ్యమగుటకై అచ్చట వ్యాఖ్యల జేర్చితిని. వీనిని పెక్కు గ్రంథముల పరిశోధించి వ్రాసితిని. ఫాహియాను వివరించిన రాజ్యము లిప్పుడు చాలవరకు కాలవాహినిలో గలసిపోవుటచే అవి పూర్వమెచ్చట విలసిల్లినవో గుర్తింప ప్రయత్నించితిని. ఫాహియానుజీవితసంగ్రహమునుగూడ ఇందు జేర్చితిని.

బౌద్ధమతవ్యాప్తికై కట్టబడి భారత శిల్పసౌందర్యముల వెదజల్లు శిలాస్తంభములు, స్తూపములు, విహారములు, చైత్యములు మున్నగు ప్రాచీన

కట్టడముల యాకార మెట్లుండునో సూచించుటకు కొన్ని చిత్రపటముల నిందు జేర్చితిని. అతడుపోయినమార్గమును దెల్పు భూగోళపటముగూడ ఇందుగలదు. ఇంకను జేర్చవలసిన చిత్తరువు లెన్నియో గలవు గాని గ్రంథ మూల్యము పెరిగిపోవునను భీతిచే జేర్పలేదు.

నన్నీ గ్రంథరచనకు పురికొల్పినది అత్యంత ఉదారస్వభావులును, సరస్వతీపత్రికాసంపాదకులును, శ్రీ జయంతిపురసంస్థానాధిపతులు నగు శ్రీవాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాదరావు బహద్దరు జమీందారువారు. ఇదివర కెన్నడును ఇట్టి గ్రంథమును వ్రాయవలెనను సంకల్పము నాకు జనింపలేదు. పుణ్యవశమున శ్రీవారితో నాకు పరిచయము గల్గుట సంభవించినది. ప్రసంగవశమున నొకనాడు శ్రీవాయ ప్రాచీనహైందవనాగరికతాసౌభాగ్యముల వర్ణింపగల గ్రంథమును దేనినైన వ్రాయరాదా యని నన్ను హెచ్చరించిరి. అప్పుడు ఫాహియాను హ్యూయానిత్సాంగు మెగస్తనీసుల గ్రంథములు నామదికి స్ఫురించినవి. అప్పటినుండియే నే నీగ్రంథమును వ్రాయసాగితిని. శ్రీవారు బెజవాడ దయచేసినపుడెల్ల నాగ్రంథమును జూచిపోవుచు నాకు పలుతెఱంగుల ప్రోత్సాహ మొనరించిరి. హ్యూయానిత్సాంగు మెగస్తనీసుల గ్రంథములగూడ వ్రాసి ఆంధ్రలోకమునకు సమర్పింపవలెననియున్నది. ఈశ్వరానుగ్రహమువలన నివియు శీఘ్రకాలముననే పూర్తి చేయగలనను నమ్మకము గలదు.

ఈగ్రంథమును నేనడుగకుండగనే విజ్ఞానచంద్రికా గ్రంథమండలిలో నొక యనుబంధగ్రంథముగ ప్రకటించుట కియ్యకొనినందులకు తన్మండలి సంపాదకులగు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుపంతులుగారికి నాకృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను. ఈగ్రంథరచనకు నన్ను ప్రోత్సహించిన శ్రీజయంతిపురసంస్థానాధిపతులకు నేనెంతయు కృతజ్ఞుడను.

విజయవాడ,
4—2—25.

వేలూరి సత్యనారాయణ.


బంగాళాఖాతము
సింహళము
హిందూమహాసముద్రము
ఫాహియాన్
భారతవర్షయాత్ర
---- అతడుపోయినమార్గము
V.V.R.S.

ఫాహియాన్ భారతవర్షయాత్ర

# విషయానుక్రమణిక



సారనాథ్ యందలి బౌద్ధస్తూపము.

# ఫాహియాన్ భారతవర్షయాత్ర

## మొదటి ప్రకరణము

### ప్రయాణము

ఫాహియాను ఛంగన్నగర* నివాసియగు నొక బౌద్ధ సన్యాసి. ఈతడుచీనాసామ్రాజ్యమునందలిబౌద్ధశిక్షణ(సూత్ర) గ్రంథముల జీర్ణావస్థకాంచి మిగులచింతనొంది యాకొరత దీర్చుటకై యార్యావర్తమునకుబోవ సంసిద్ధు డయ్యెను.

---

(*) ఛంగన్నగరము ప్రాచీన చైనాసామ్రాజ్యమున ప్రసిద్ధిగాంచినయొక గొప్పనగరరాజము. పురాతనకాలమునచైనాదేశమున విలసిల్లిన "హన్ను" 'సూయి' సామ్రాజ్యముల కిదియే రాజధాని. మన పాంథుడగు ఫాహియాన్ జీవించిన కాలమున నీపట్టణము 'సిన్ను' రాజ్యత్రయములోని ప్రధాన రాజ్యమునకు రాజధానియయ్యెను. ఈ నామమున బరగుజిల్లా యొక్కటి 'షేన్సే' మండలమున నిప్పటికిని గలదు.

'వాంగ్ ఛే' ♦ శక 'కేహే' నామసంవత్సరమున నీతడు తనమిత్రులగు హ్యూయింగ్, హ్యూవై, హ్యూకింగ్, టోచింగ్ *ల వెంటగొని సూత్రగ్రంథముల ‡ నరసి తెచ్చుటకై భారత వర్షమునకు బయలు దేరినాడు.

మన యాత్రికు లట్లు ఛంగన్నగరమునుండి బయలు

---

♦ వాంగ్ ఛే ఇది యొకశక నామము. ఈశకము క్రీ. శ. 399వ స॥న ప్రారంభమై 414 వ సంవత్సరమున నంతమైనది. కావున ఫాహియాను క్రీ. శ. 399వ సంవత్సరమున చైనారాజ్యమునుండి బయలుదేరెనని నిర్ణయింపవచ్చును. పై నుదహరింపబడిన 'కేహే' సంవత్సరమును 399 వ సంవత్సరమునకు సరియగును. 'కేహే' ప్రభవ, విభవ, మున్నగువానివలె చైనాభాషలో నొక సంవత్సరనామము. "విఖ్యాతసన్యాసుల జీవితముల" రచించిన గ్రంథకారుడు తనగ్రంథమున ఫాహియాను భారతవర్షయాత్రకై 'లంగన్' శక తృతీయవత్సరమున చైనాదేశమునుండి బయలువెడలెనని వివరించియున్నాడు. లంగన్ శక తృతీయవత్సరమును 399 వ సంవత్సరమే యగును. "లంగన్" యిదియును నొకశకనామమే. ఈశకము "తూర్పుసిన్ను" వంశపు రాజులచే ప్రారంభింపబడినది.

* ఈ నామము లన్నియు 'ఫాహియా'నను నామము వలెనే, చైనా దేశమున బౌద్ధసన్యాసుల కొసగబడు బిరుదనామావళి.

‡ శిక్షణగ్రంథములు. సూత్ర, వినయ, అభిధర్మపీఠికలు మున్నగు గ్రంథములకు శిక్షణగ్రంథము లనిపేరు. బౌద్ధవాఙ్మయమున నివి ప్రసిద్ధి గాంచిన గ్రంథరాజములు.

వెడలి లంగు ¶ రాజ్యమును నిర్గమించి కొన్ని దినములకు కీన్వోయి* నృపాలుని రాజ్యము జేరిరి. అంతలో వర్షఋతువు ప్రారంభ మయ్యెను. వర్షకాలమున బౌద్ధసన్యాసులు ప్రయాణము సలుపరాదు •. మన పాంథు లందుచే వర్షకాలము గతించువరకు నిందేయుండి పిమ్మట బయనమై నొటాను‡ భూవరుని రాజ్యమును సమీపించి యాప్రాంతముననున్న 'యాంగ్'లో పర్వతావళులదాటి 'ఛాంగ్ యా'కి బోయిరి. ఈతరుణమున నీరాష్ట్రమంతయు నరాజకమై కల్లోలభూయిష్ఠమైయుండుట వలన మన బాటసారు లీరాజ్యమున బ్రయాణ మొనర్చుటయే గష్ట మయ్యెను. బాటలన్నియు చోరులకును, దురాచారులగు దుండగీడులకును శరణ్యములై రక్షణశూన్యములై యపాయకరములై యుండెను. అదృష్టవశమున నీదేశమును బాలించు రాజుమాత్రము దయాశీలుడు. ఈతడు మన పథికులకు దనరాజ

---

¶ లంగు - ప్రాచీన చైనా సామ్రాజ్యమునందలి యొక క్షుద్ర రాజ్యము.

* కీన్వోయినృపాలుడు, పశ్చిమ సిన్నువంశపు రాజులలో రెండవ వాడు. సిన్నువంశము ప్రాచీనచైనాసామ్రాజ్యమున ప్రసిద్ధిగాంచిన రాజవంశము.

• ప్రార్థనాది కృత్యము లొనర్చుచు బౌద్ధభిక్షువు లేదేని నొక బౌద్ధ మఠమున వర్షకాల మంతయు గడుపవలయును. బౌద్ధ మతమున నిదియొక యాచారము.

‡ నొటాను భూవరుడు చైనాసామ్రాజ్యమునందలి పశ్చిమ ప్రాంతమున రాజ్యపాలన మొనర్చు యొకానొక నృపాలుడు.

ధానిపట్టణమున నాశ్రియ మిచ్చి, వేయిభంగుల వారి నాదరించి వలయు సౌకర్యముల నొనగూర్చి 'దానపతి' § యను బిరుదనామమునకు బూజ్యత నార్జించుకొనెను.

ఇచ్చటనే మన తెరువరులు చేయన్, యూకిన్, సాంగ్ షో, హోయన్, సాంకింగు‡ మున్నగు మరికొందర చైనాయాత్రికుల దారసిల్లిరి. వీరును చైనా రాజ్యమునుండి యాత్రార్థమై భారత ఖండమునకు బోవుచుండిరి. ఉభయులకును గమ్యస్థాన మొక్కటియే యగుటచే వార లచ్చట గలసికొనినందుల కెంతయు సంతసింపుచు, మార్గమున నొండొరు లారసినవింతల జెప్పుకొని యానందించుచుసంతోషమున వర్షకాలమంతయు నిచ్చటనే గడపిరి.

వర్షఋతువు గతించినంతనే మనపాంథు లిచ్చటనుండి పయనమై కొన్ని దినములకు చైనాసామ్రాజ్యమునకు పశ్చిమసరిహద్దులలోనున్న 'టన్హ్వాంగు' పట్టణమునుజేరి యొక్కమాస మిచ్చటనుండి మార్గశ్రమం బుడిపికొనిరి. ఇటనుండి మనయాత్రికులు రెండుతెగలుగ జీలిపోయిరి. ఫాహియానును, నాతని నల్వురుమిత్రులును 'పాయూను' మున్నగువారల నీపట్టణమున

---

§ బౌద్ధమత నిర్మాణ పోషణాది ధర్మకార్యము లొనర్చుచు బౌద్ధమతవ్యాపనకై తోడ్పడు రాజన్యుల కొసగబడు బిరుదనామము.

‡ వీరును భారతభూమిని దర్శించుటకై బయలువెడలిన చైనాయాత్రికులె. వీరిలో "హోయన్" మిగుల ప్రసిద్ధి నొందినవాడు. ఇతడు భారతవర్షమునుండి దన మాతృదేశమునకు తిరిగి వచ్చినపిదప పెక్కు సంస్కృత గ్రంధముల దన మాతృభాషలోనికి ననువదించెను.

విడచి మున్నుగాబయలుదేరి, యొకానొక రాయబారి ¶ నను గమించి ముందునకు సాగిపోయిరి.

టన్హ్వాంగుపట్టణమును వీడి కొంతదూర మరుగుసరికి మన యాత్రికుల కొక మహాయెడారి గాన్పించెను. ఇదియె భయానకమగు 'గోబీ'యెడారి*. మనపాంథు లీసైకతపారావారమును దాటిపోవలయు. మార్గసౌకర్యము లంతగాలేని యా పురాతన కాలమున యెడారులదాటుట మిగుల గష్టసాధ్యముగ నుండెను. ఇదియునుగాక గోబీ యత్యంతభయంకరమగు నెడారి. ఇదిదుష్టపిశాచగణముల కావాసభూమి. భీకరమగు వేడిగాడ్పు లిందు తరుచుగ వీచుచుండును. పాంథు డెవ్వడేని దౌర్భాగ్యవశమున నీయుష్ణవాయువులవాత బడినచో వా డింక జావక బ్రతుకుట కల్ల. ఈయెడారియం దెంత వెదకినను జీవరాసు లెవ్వియు గానరావు. గగనపథమున సంచరించు విహంగములుగాని, పృథ్వీతలమునదిరుగు మృగసంతతులుగాని కనుచూపు మేరదూరమున నెచ్చటను మచ్చునకైన గాన్పింపవు. మృగ,పక్షి,క్రిమి,

¶ ఈరాయబారి యెవ్వరో, యేదేశమునుండి యెచ్చటికి బోవుచుండెనో తెలియుటలేదు. ఫాహియానుని వ్రాతలలో దెలిసికొనుట కెట్టి యాధారములును గానరావు.

*గోబీయెడారి.— "కోబీ" యనికూడ దీనికి నామాంతరముగలదు. ఇది మంగోలియారాజ్య పరిసరములనుండి టర్కీస్థానము వరకును రెండువేల మైళ్ళ పొడవున వ్యాపించియుండు మహాయెడారి. అంతయు నిర్జీవ నిర్జల ప్రదేశము. అప్పుడప్పు డీయెడారిలో ప్రళయభీకరమగు గాలిదుమారములు రేగి యాత్రికులనుగూడ గప్పివేయుచుండును. ఒక్కమా రుపద్రవకరమగు ఝంఝామారుతములేచి యొక్కనాటిలో మున్నూటయిరువదిమహానగరముల నిసుకలో బూడ్చివైచెనట!

కీటకశూన్యమై నిర్మానుష్యమై యీయెడారి యెంతయు భీతి గొల్పుచుండును. ఎంతదూర మరసినను యీమహాయెడారిలో మార్గము గానరాదు. మనుజులేగినపదచిహ్నములైనగన్పింపవు. అచ్చటచ్చట బడియుండు విగతజీవుల శల్యాఖండములు దక్క నీయెడారిభూమియం దెచ్చటను ప్రాణిసంచారమే కానబడదు.

టన్వాంగుపురాధీశ్వరు డగు లేహాో* మిగులదయార్ద్ర హృదయుడు. ఇతడు మన చైనాయాత్రికుల కీయెడారి దాటుటకు వలయు ప్రయాణసాధనముల సమకూర్చి పున్నెముగట్టుకొనెను.

---

# రెండవప్రకరణము.

## 'షెన్షన్' 'ఖోటను' రాష్ట్రముల దర్శించుట

మనపాంథులెట్లో యీమహాయెడారినిదాటి యటుపిమ్మట పదునే డహోరాత్రములు ప్రయాణ మొనర్చి నూటయేబది క్రోశములదూర మరిగి, యెట్టకేలకు షెన్ష♦న్నను రాజ్యమును

---

* లేహాో;— టన్వాంగు పట్టణాధిపుడు, ఉదారచరితుడు, విద్యా సంపన్నుడు, సుగుణరాశి, సుపరిపాలనచే దన ప్రజల సౌఖ్యమునదేల్చి కీర్తి సాందుడయ్యెను ఇతని కృపావిశేషముననే దుర్గమభూమియగు గోబీ యెడారిని మన పాంథులు దాటగల్గిరి.

♦ ఈ రాజ్య మెచ్చట విలసిల్లెనో సరిగా జెప్పుటకు వీలులేకున్నను లాబ్ సరస్సున కనతిదూరమున నుండెనని మాత్రము చెప్పుటకు దెక్కు నిదర్శనములు గలవు. ఇది టన్వాంగు పట్టణమునకు మున్నూరుమైళ్ళ దూరమున నుండెనని ఫాహియాను యాత్రికుడే తెల్పుచున్నాడు. ఈ రాజ్యమును జేరుటకు బదునేడు దినములు పట్టె గావున మన తెరువరులు రోజునకు బదునెనిమిది మైళ్ళకంటె నెక్కువదూరము ప్రయాణము చేసియుండవలెను.

జేరిరి. ఈ రాష్ట్రము పాషాణభూయిష్ఠమగు పర్వతప్రాంతము. భూమియంతయు నిస్సారమగు కటికనేల. ఇందు నివసించు జన సామాన్యము మోటుదుస్తుల ధరింతురు.

'హన్ను' + సామ్రాజ్యమందలి ప్రజాళివలెనే యిచ్చటను గొందరుజనులు సన్ననిరోమవస్త్రముల దాల్చెదరు. ఈ రాజ్యమేలు నృపవరుడు బౌద్ధమతావలంబుడు. ఇచ్చట నాల్గు వేల బౌద్ధసన్న్యాసులుగలరు. వీరందరును హీనయానులు. §

---

\+ చీనా సామ్రాజ్యమునకు వేరొకనామము. ఫాహియాను తన మాతృ భూమియగు చీనాసామ్రాజ్యమును తన యాత్రావృత్తాంతమున నీ నామముననె సర్వదా పేర్కొను చుండును. హన్ను వంశజులచే బాలింపబడిన రాజ్యము గావున దీనికి హన్నుసామ్రాజ్యమని పేరుగల్గెను.

§ హీనయానము యానత్రయములలో మొట్టమొదటిది. బౌద్ధమతమున సంసారజలధిని దాటి నిర్వాణతీరమును జేరుటకు హీనయాన, మధ్యమయాన, మహాయానము లనబడు మూడుమార్గములు గలవు. వీనినే బౌద్ధమత గ్రంథములందు "యానత్రయ"మందురు. బౌద్ధమతముజీర్ణమైక్షీణదశ నొంది భిన్న శాఖలుగ జీలిపోయినపిమ్మట నొక్కొక్కశాఖ కొక్కొక్క సిద్ధాంతము బయలు వెడలినది. ఈ సిద్ధాంతవిభేదములకే హీనయానము మున్నగు నామములుగలిగినవి. "హీనయానము" నిర్వాణసాధనప్రియమున గడపటి సాధనము. బ్రహ్మచర్యవైరాగ్యాది సన్న్యాసవిధు లందిమిడి యున్నవి. ఇందు మనుజుడు నిర్వాణతీరము జేరుటకు సంసారసుఖముల త్యజించి విరాగియై వినియసుత్త అభిధర్మ పీఠికల పఠింపుచు జ్ఞాని కావలయును. మహాయానమున కైవల్యమునొందుటకు వైరాగ్యాది నియమము లనావశ్యకములు. సంసారి యైనను భక్తితో బుద్ధునారాధించిన ముముక్షియగును.

ఈ రాష్ట్రమందును, నీ పరిసరరాజ్యములందు నివసించు ప్రజాళియు శ్రమణకులును * భారతవర్షమున ప్రబలుచుండెడి బౌద్ధమతాచారముల ననుసరించుచుండిరి. హైందవులు వీరికంటె నెక్కు డక్షరయుక్తముగను, విధివిధానముగను వీని ననుష్ఠించెదరు. మతానుష్ఠానములందు భారతప్రజకును వీరికిని నింతియె తారతమ్యము. ఇచ్చోటనుండి పశ్చిమముగ బ్రయాణమొనర్చుచు మన పాంథులు దర్శించిన రాష్ట్రములందలి ప్రజలెల్లరు నిట్లే భారతదేశమున ప్రబలుచుండిన బౌద్ధ నియమములనే పాటించుచుండిరి. కాని వీరు మన తెరువరులకు దురవగాహమైన కర్ణకఠోరమగు♦ నొక యడవిభాషను మాట్లాడుచుండిరి. సంసారముల త్యజించి సన్న్యాసదీక్ష గైకొనిన బౌద్ధ భిక్షువులుమాత్రము హైందవగ్రంథముల బఠింపుచు హైందవ భాష నుచ్చరించుచుండిరి. ఇచ్చట మన యాత్రికు లొక్క మాసముండి పిమ్మట నీరాజ్యమునువీడి పశ్చిమోత్తరముగ జని పదునైదు దినములకు వ్రూయి + యను దేశమును సమీపించిరి. ఇదియును బౌద్ధరాజ్యమే. ఇందు నివసించు బౌద్ధసన్న్యా

* బౌద్ధసన్న్యాసులకు శ్రమణకులని పేరు.

♦ మంగోలియా తార్తారుభాషలై యుండనోపు.

+ ఈ దేశమెచ్చట నున్నదో యింతవరకును గుర్తింపబడలేదు. ఇందు నాలుగువేలబౌద్ధసన్న్యాసు లుండిరని వర్ణించుటచే నిది యొకగొప్ప రాజ్యమై యుండనోపునని యూహింపకలసియున్నది. ఇది "కుత్సక" "కరస్కారు"ల మధ్య నుండియుండునని కొందరు చరిత్రకారు లూహించుచున్నారు.

సులు నాల్గువేలకు బైగానుండురు. వీరందరును హీనయానులు. తమ గ్రంథమున జెప్పబడిన విధమున వీసమైన దప్పకుండ వీరు బౌద్ధనియమముల నాచరింతురు. సిన్ను (చైనా) రాష్ట్రము నుండి చనుదెంచుచుండిన మన యాత్రికులు నియమాను ష్ఠానములయందు వీరితో తులదూగలేకపోయిరి. ఇచ్చటి బౌద్ధమతమున కుద్దేశికుడగు (మఠాధిపతి) ఫూకంగుసను♦ యనుమతివేడి మనపాంథులీభిక్షుకాలయమున రెండుమాసము లుండి విశ్రాంతిగొనిరి. ఇచ్చటనే పాయూమును నాతని మిత్రులును మరల వీరిని గలిసికొనిరి.

బౌద్ధమతావలంబులైనను యీ 'వూయీ' రాజ్యమున నివసించు ప్రజలు మిగుల కూరస్వభావులు. అతిథిమర్యాదల నెరుగని మూఢులు. దూరదేశమునుండి వచ్చుచుండిన మన పాంథులకు వీరుచితమర్యాదలనొసగి యాదరింపరైరి. గృహస్థ ధర్మముల నిట్లు మంటగలిపిరి. తూష్ణీంభావమున మెలంగుటచే మనబాటసాగు లాశాభంగులై విసుగుజెంగిరి. చేయుక్, యూకీ, హ్యూవై లింక నీదేశమున నుండనొల్లక వెనుకకు మరలి తమ యాత్రాసాఫల్యమునకై వలయు ధనమును సమకూర్చు కొనుటకై కోసాంగు* రాజ్యమునకు బయనమైపోయిరి. ఫాహి

♦ఫూకంగుసను;— "వూయీ" రాజ్యమున నీత డొకమఠాధిపతి. మఠాధిపతులకు బౌద్ధగ్రంథములందు "ఉద్దేశిక" లని పేరు. ఈతని నామములోని "ఫూ" యనునది యీతని యుద్యోగనామమును, కంగ్సను ఈతని నిజనామము నయి యుండనోపు. ఈతని పేరునుబట్టి ఈత డొకసామంత మండలాధీశ్వరునిసంతతిలోనివాడని తోచుచున్నది.

* ప్రకృత 'టాంగూట్' జిల్లాసమీపమున విలసిల్లిన చిన్నరాజ్యము.

యానును ఆతని యనుచరులును మాత్రము ఫూకంగ్సను దయావిశేషమున ముందునకు సాగిపోవ గలిగిరి. తిన్నగ వీరు నైఋతిదిశాభిముఖులై నడచిపోయిరి. ఆప్రాంత మంతయు జనశూన్యమై భీతిగొల్పుచుండెను. మార్గమున వీరి కొదవిన కష్టపరంపరలు కడు విషాదకరములు. మహావేగమున బారు కొండవాగుల దాటునపుడు వీరు పడిన యిడుమల వర్ణింప నలవిగాదు. మున్నెవ్వరు నిట్టికష్టముల ననుభవించియెరుగరు. ఇట్లెన్నియో శ్రమలబడుచు ముప్పదియైదుదినములు దీర్ఘ ప్రయాణ మొనర్చి యెట్టకేలకు మన తెరువరులు 'ఖోటను' రాజ్యమును ♦ జేరుకొనిరి.

---

# మూడవ ప్రకరణము

## కుస్తానము

కుస్తానరాజ్యము మిగుల సౌఖ్యవంతమైనది. జనసంకీర్ణమై సౌభాగ్యసీమయై కలకలలాడుచున్నది. ఇందలి ప్రజలు సుఖులై యైశ్వర్యమున నోలలాడుచుండిరి. బౌద్ధమత మిచ్చట మిగుల వ్యాప్తినొందినది. ఇందు నివసించు జను లెల్లరు బౌద్ధమతావలంబులు. వీ రెల్లెడల భజనలు సల్పుచు, గానకళావినోదముల బ్రొద్దులు పుచ్చుచుందురు. ఈరాజ్యమున

---

♦ దీనికి సంస్కృతమున 'కుస్తాన'మని పేరు. ఇది 'గోబీ' యెడారికి నైఋతిభాగమున 'క్విన్ లన్' పర్వతపంక్తులనంటి తూర్పుపడమరలుగా మున్నూరుమైళ్ళవరకును వ్యాపించియుండు నొకచిన్నరాజ్యము.

బౌద్ధభిక్షువు లమితసంఖ్యాకులు గలరు. వీరెల్లరును మహాయానశాఖకు జెందినవారు. సన్యాసులకు భోజనాదు లొసగు ధర్మసత్రము లనేకము లిచ్చటగలవు. ఈదేశమందలి గృహము లొకదానిసరసనొకటి యుండక, గగనమండలమున మెరయు నక్షత్రరాశివలె దూరదూరమున చెదరియున్నవి. ప్రతియింటి ముంగిటను ముద్దులొల్కెడు చిన్నిచిన్ని స్తూపములు* నిర్మింపబడియున్నవి. ఈస్తూపము లన్నిటిలోన మిగుల జిన్నది యిరువదియడుగులయెత్తున నుండును. దేశాటన మొనర్చుచు, అన్యప్రాంతములనుండి యరుదేరు బౌద్ధభిక్షువుల విశ్రాంతికై మఠములందు గదులు నిర్మింపబడియున్నవి. బాటసారులై పరివ్రాజకు లెవ్వరైన వచ్చినచో వారి నిందుండ నియమించి కోరినదెల్ల యొసంగుచు నతిథిపూజ లొనర్తురు.

కుస్తానరాజ్యమును బాలించురాజు ధర్మనిరతుడు. సుగుణశీలుడు. మనబాటసారులకు "గోమతి"♦యను సంఘారామమున ×నాశ్రయ మిచ్చి బలుతెరగుల నాదరించెను. గోమతి మహాయానశాఖకు జెందిన గొప్ప బౌద్ధమఠము. ఇందు మూడువేలమంది బౌద్ధసన్యాసులు నివసించుచుండిరి. వీరిచే ననుకరింపబడు నియమము లతివిచిత్రముగ నున్నవి. ఘంటా

---

* ఘంటాకృతిగలిగి అత్యున్నతములగు రాతికట్టడములు. శాక్యసింహుని యావాస పర్యటనాదులచే పవిత్రవంతములై దర్శనీయములైన చోటులను సూచించుటకు గట్టబడినవి.

♦ కుస్తానరాజ్యమున ప్రసిద్ధిగాంచిన యొకానొక బౌద్ధమఠము.

× బౌద్ధమఠమునకు సంస్కృతనామము.

నినాదములు+ వినవచ్చినంతనే వీరు భోజన మొనరింప భోజన శాలకేగెదరు. ఇవి "భోజనమునకు వేళయయ్యె, భోజనమును సిద్ధమయ్యె. ఆలసింపక వేవేగ భోజన మొనరింప రం"డని సన్న్యాసుల బిలుచుటకై గావింపబడు ఘంటారావములు. ఘంటాధ్వానము లట్లుమారుమోగుచుండ, భిక్షువు లందరును బిలబిలలాడుచు భోజనమందిరమునుజొచ్చి, నిశ్శబ్దముగ నొకరి వెంటనొకరు తమకై యమర్చియుంచబడిన పీఠములపై నాసీనులయ్యెదరు. భోజనశాలయందు వీరిచర్య లత్యంతగంభీరములై ప్రశాంతములై యొప్పారుచుండును. భోజనగృహమున నడుగు పెట్టినదాది వీరు మౌనము వహింతురు. భుజించునప్పుడైనను నోరెత్తి యెవ్వరిని బల్కరింపరు. నిశ్శబ్దముగ భోజనాదికృత్యములు జరిగిపోవుచుండును. కక్షపాల, కమండలములనుండియైన యెట్టిధ్వనులును వినరావు. ఈ విమలవర్తనుల కేదియేని భోజన పదార్థము గావలసినపుడు కంఠమెత్తి యడుగరు. అచ్చట వీరికి బరిచర్యలొనర్చు సేవకులకు హస్తములతో సంజ్ఞల గావింతురు.

"హ్యాకింగు,* "టోచింగు,* "హ్యాటా"*మున్నగుయాత్రికులిచ్చటనుండి యందరికంటెమున్నుగాబయనమై "కీచా"♦

---

+ ఈ మఠమున ఘంటారావములచే భిక్షువుల భోజనమునకు బిలుచుట యొక యాచారము.

* ఈతడెవ్వరో క్రొత్తయాత్రికుడైనగావలయు. లేనియెడల యీ పేరు యాత్రికులలో నొక్కని నామాంతరమైన గావలయు.

♦ ,కీచా, రాజ్యమేదియైనదియు సరిగా గుర్తించుటకు దగిన యాధారము లెవ్వియు గానరాకున్నవి. 'కాశ్మీర' మని కొందరును, 'కాశ్గా' యని కొందరును పలువురు చరిత్రకారులు పలువిధములుగ నూహించుచున్నారు.

యను రాజ్యమును దర్శింపనేగిరి. ఫాహియానును, యాతని మిత్రులును మాత్రము ఖోటాను నగరమున జరుగబోవు బౌద్ధ విగ్రహ మహోత్సవముల నవలోకింప గుతూహలురై మాస త్రయమువరకు నిందే యుండిరి.

చిన్న చిన్న బౌద్ధమఠములుగాక (అట్టివిచ్చట బెక్కులు గలవు) విశాలమై పేర్వడసిన సంఘారామము లీకుస్తాన దేశమున నాల్గు గలవు. ఆషాఢమాసప్రథమదివసమున నిచ్చట విగ్రహ మహోత్సవములు ప్రారంభమగును. ఇంతకు మున్నె పురవీథులన్నియునూడ్చి నీరముల జల్లెదరు. ఈతరుణ మున కుస్తాననగరమంతయు పందిరులతోను పచ్చని తోరణము లతోను వివిధవర్ణశోభితములగు కేతనములతోను శోభాయ మానముగ నలంకరింపబడును. పురద్వారోపరిభాగమున బెద్ద శిబిర మొండు నిర్మింపబడి నేత్రపర్వముగ సింగారింపబడును. నృపాలుడును నాతని యర్ధాంగియు, సేవకాగణపరివృతులై యుత్సవములు ముగియువరకు నీ గుడారమున విడిదిసేయుదురు.

గోమతిసంఘారామమున వసియించుబౌద్ధశ్రమణకు లంద రును మహాయానులు, కుస్తానభూమిాశుచే నత్యంతపూజ నీయులుగ బరిగణింపబడుచు మిగుల గౌరవింపబడుచుందురు. ఈ యూరేగింపు మహోత్సవమున వీరలే ప్రథమస్థాన మలంకరింతురు. తక్కటిపురజనులు వీరివెనువెంట నడచి వచ్చె దరు. పురద్వారమున కొకయరక్రోసుదూరమున నత్యున్నత మగు రథ మొకటి నిర్మింపబడి యుండును. ఇది ముప్పది యడుగుల యున్నతిగల్గి కదలిపోవుచున్న యొక దివ్యభవనము

వలె గన్పట్టుచుండును. పట్టుతోరణములతోడను, చిత్రశోభితములగు వితానములతోడ నలంకరింపబడి సువర్ణమణి విలసితమై చూపరుల కెంతయు నానందదాయకమై విరాజిల్లుచుండును. ప్రధానవిగ్రహము (బుద్ధుని విగ్రహము) రథమధ్యభాగమున నుంచబడును. ఈ మూర్తి కిరుకెలకు లందును బోధిసత్త్వుల ♦ విగ్రహములు రెండుగలవు. ఈ ప్రతిమలు బుద్ధునకుకై వారములు సల్పుచున్నట్లు మనోహరముగ జిత్రింపబడినవి.

బుద్ధవిగ్రహమునకు వెనుకపార్శ్వమున శిరోభాగము నుండి యనిమిషవిగ్రహము లెన్నియో వ్రేలుచుండును. ఈవిగ్రహములు దేవత. లాకాశగమన మొనర్చుచు బుద్ధభగవాను ననుగమించుటను సూచించుచుండును. విగ్రహములన్నియు సువర్ణరజతలోహములతో నిర్మింపబడి కనులకు మిరుమిట్లు గొల్పుచుండును. "రథము బయలు వెడలినది. పురద్వారమును సమీపించుచున్నది. ఇంక నూరుబారల దూరమున నున్న"దను కేకలు వినవచ్చినంతనే కుస్తాన దేశాధీశ్వరుడు క్రొత్తయుడుపులదాల్చి శూన్యమస్తకుడై, హస్తమున పూజాద్రవ్యముల గొని, యిరుగడల బారులుగట్టి సేవకానీకము వెంట నరుదేరుచుండ, పాదచారియై రథమున కెదురేగి, విగ్రహపాదమున కెరగి నమస్కరించును. పిమ్మట తనతోడ గొనివచ్చిన కుసుమజాలముల నామూర్తిశిరమున జల్లి,

♦ జ్ఞాన పరిపూర్ణులై, యుత్తరజన్మమున బుద్ధులై యవతరింపనున్న సిద్ధులకు బోధిసత్త్వు లని పేరు.

ధూపము లిడును. అంతటితో నృపాలుని యారాధన ముగి యును. అరదము మరల సాగును. రథము ఇంక కొంతదూర మేగి పురద్వారమును జొచ్చినంతనే నృపుని మనోహారిణియు, నామె పరిచారికాగణమును బైనుండి రథముపై కుసుమరాసుల వెదజల్లి పుష్పవర్షము గురిపింతురు.

ఒక్క గోమతీసంఘారామమేగాక, తక్కటి భిక్షుకాల యములుగూడ నిట్లే మహోత్సవములు సల్పును. వానికిని రథావళి కలదు. ఒక్కొక్కమఠమున కొక్కరథ మున్నది. ఆ రథసమూహములు బయలువెడలుటకు వేర్వేరుదినములు నిర్ణయింపబడును. ఒక్కొక్కదినమున నొక్కొక్కమఠాలయ రథము మహావైభవముతో బయలువెడలుచుండును. ఈమ హోత్సవము లిట్లు పదునైదుదినము లత్యంతవైభవముతో జరుగును. పిమ్మట రాజదంపతులు తమ ప్రాసాదమునకు మరలి పోయెదరు.

కుస్తానపురమునకు బశ్చిమభాగమున నేడెనిమిదిలీల దూరమున నృపాలుని 'నూతనసంఘారామ' మను నామమున బరగు ప్రసిద్ధసంఘారామ మొకటిగలదు. దీనిని గట్టుట కెనుబది వర్షములు పట్టెను. మువ్వురు రాజన్యుల రాజ్యకాలము గడచి పోవువరకు నీమఠనిర్మాణము పరిసమాప్తి నొందలేదు. ఈ భవ నము మున్నూటయేబదియడుగుల యౌన్నత్యముగలిగి, శిల్ప కళాచాతుర్యముల బ్రదర్శించు జిత్రవిచిత్రములగు చెక్కడపు బనులతో నలరారుచున్నది. దీని శిరోభాగ మంతయు సువర్ణా చ్ఛాదితమై, రత్నఖచితమై, శోభాయమానముగ నున్నది. దీని

చెంత నెత్తగు స్తూపమొకటి గలదు. ఈ స్తూపమునకు వెనుకటి భాగమున నతిరమణీయమై, వైభవోపేతమగు విశాలమందిర మొకటి నిర్మింపబడియున్నది. దీనికే 'బుద్ధమందిర'మని పేరు. ఈ గృహమందలి కవాటశ్రేణులు, గవాక్షపంక్తులు, కంబములు, దూలములు అన్నియు పసిడిరేకులచే గప్పబడి మెరుగు లీనుచున్నవి. ఇందు సన్యాసులయావాసమునకై నిర్మింపబడిన గదులసొబగు వర్ణింపనలవికాదు. అత్యంతమనోహరముగ నలంకరింపబడి డాలు గొల్పుచున్నవి. వీని సౌందర్యము అనుపమానము.

సంగు*పర్వతావళులకు బూర్వభాగమున రాజ్యమేలు అష్టరాజ్య ♦ నృపాలురును, తమకడనుండు ధనరాసులను అమూల్య వస్తుచయమును తమ భోగవిలాసములకే వినియోగింపక యణుమాత్రము రాచకార్య నిర్వహణమునకై వినియోగించి దక్కిన దెల్ల నీ సంఘారామపోషణాదికములకై దానమొసగెదరు.

---

* వీనికే అనియన్ పర్వతములనియు, బీలర్ టగ్ కొండలనియు నామాంతరములు గలవు. ఈ పర్వతపంక్తులు త్రివిష్టపమున కుత్తరభాగమున క్వెన్ లన్ టీన్షనుపర్వతశ్రేణుల నడుమనున్నవి.

♦ ఈ అష్టరాజ్యము లెవ్వియో ఎచ్చట విలసిల్లెనో తెలియరాకున్నది.

# నాల్గవ ప్రకరణము

సంగుపర్వతముల దాటి 'కీచా' యను రాజ్యమును జేరుట.

విగ్రహమహోత్సవములు పూర్తియైనతోడనే సాంగుషో యను యాత్రికుడు బౌద్ధమతదీక్ష గైకొనిన యొకానొక తార్తారుని వెంటనంటి కోఫేను ♦ రాజ్యమును జూడబోయెను. ఫాహియాను తక్కిన యాత్రికులతో గలిసి యచ్చటనుండి తిన్నగా బయలుదేరి యిరువదియైదు దినములు ప్రయాణ మొనర్చి జీహో * యను రాజ్యమును జేరెను. ఈరాష్ట్రమును బాలించు రాజు బాహుబలుడు, సుగుణశీలుడు, బౌద్ధమతాభిలాషి. ఈరాజ్యమున సహస్రబౌద్ధసన్యాసులు గలరు. వీరిలో జాలమంది మహాయానులు.

ఇచ్చట పదినైదుదినము లుండి పిమ్మట మనపాంథు లీరాజ్యమును విడచి దక్షిణాభిముఖులై పోయి, నాల్గుదినములకు "సంగులింగు" పర్వతశ్రేణుల తారసిల్లిరి. ఈపర్వతముల

---

♦ప్రస్తుత 'కాబులిస్థానమే' కోఫేను రాజ్యము. 'కోఫేను' కోఫస్‌నదికి సంబంధించియుండనోపు. సింధునది కుపనదియగు 'కాబూల్'నదియే కోఫస్‌నది యని కొందరూహించుచున్నారు. ఆఫ్ఘనిస్థానమునకు రాజధాని యగు కాబూలునగరమే కోఫేనునగరమై యుండవచ్చును.

*జీహోరాజ్య మేదియో తెలియవచ్చుటలేదు. ఖోటను రాజ్యమునకు వాయవ్యదిశగానుండు యార్కండుదేశమే జీహోయైయుండునని కొందరూహించుచున్నారు. ఈరాజ్యము 'కర్గలిక్' అయియుండునని తోచుచున్నది.

నెట్లో దాటి యుస్సురనుచు మన తెరువరులు "యూవీ" †యను రాజ్యమును జేరుకొనిరి. వర్ష ఋతువు అప్పుడే ప్రారంభమగుటచే వర్షకాల మిచ్చట * గడపి పిమ్మట మరల బయనమై, మనయాత్రికు లాపర్వతప్రాంతములబడి కొండల నెక్కుచు దిగుచు, యిరువదిరెండహోరాత్రములు పయన మొనర్చి, 'కీచా' (కాష్ఘర్) యను రాజ్యమును జేరిరి. ఇచ్చట యూకంగు మున్నగు యాత్రికులు వీరిని గలసిరి.

---

# ఐదవ ప్రకరణము.

బౌద్ధసన్యాసుల పంచమ పరిషన్మహాసభ—బుద్ధుని యస్థిశకలములు—కీచారాజ్యము.

ఈతరుణమున కీచారాజ్య మంతయు సందడిగ నుండెను. ఈరాజ్యమేలు నృపవరుడు పంచమపరిషన్మహాసభ ♦ యొకటి

---

† చరిత్రపరిశోధకు లీ రాజ్య మెచ్చట విలసిల్లెనో నిర్ణయింపజాలకున్నారు. 'టాషికుర్గను' రాజ్యమైయుండునని యిటీవల గావింపబడిన చరిత్రపరిశోధనలవలన దేలుచున్నది. ఈ దేశము అనియన్ పర్వతశ్రేణులలో నెచ్చటనో విస్తరిల్లి యుండవలెను.

* మనయాత్రికులు బయలుదేరిన తరువాత నిది మూడవ వర్షకాలమగుటచే వీరు చైనాసామ్రాజ్యమునుండి బయలుదేరి యిప్పటికి మూడువత్సరము లయినదని యూహింపవలసియున్నది.

♦ ఇది యొక బౌద్ధమత మహాసభ. కలుషవిమోచనమార్గముల నరయుటకును, నైతికప్రాబల్యమార్గాన్వేషణమునకు నీ సభ అశోకసార్వభౌముని చే స్థాపింపబడినది.

గావించుచుండెను. తత్సభకు తనరాజ్యమునగల బౌద్ధశ్రమ ణకులనెల్ల బిలువనంపెను. మేఘపటలివలె భిక్షుకసంఘములు తండోపతండములుగ నరుదెంచి సభాస్థలి నిండిరి. సభామంట పము చిత్రవితానములతోడను, బట్టుతోరణముల తోడను నేత్రపర్వముగ శృంగారింపబడెను. ప్రముఖులగు సదస్యు లాసీనులగు పీఠములకు వెనుకభాగమున సువర్ణకమలము లమర్చబడియుండెను. స్వచ్ఛమగు చాపలపై సభాసదు లెల్లర నధివసింపజేసి, రాజును నాతని యమాత్యులును యథావిధిగ బుద్ధభగవానునికి పూజ లొనర్చిరి. ఈ మహా సభ ప్రతిసంవత్సరమును వసంతకాలమున చైత్ర, వైశాఖ మాసములందు బ్రారంభమై రెండుమూడుమాసములుజరుగును.

సభ ముగిసినంతనే రాజు సభాస్థలమున జేరియున్న భిక్షువు లందరకు పారితోషికముల నొసగి సంభావింపు డని తన మంత్రుల కానతిచ్చును. ఇట్లయిదారుదినములు గడచి పోవును. పిమ్మట నృపాలుడు తన యుత్తమాశ్వమును రావించి తానె యశ్వపాలకుడై, కళ్లెము మున్నగు నశ్వోపకరణముల గుఱ్ఱమునకు దొడిగి ప్రధానామాత్యు నా తురగముపై నధి రోహింపచేయును. పిమ్మట దానును దన మంత్రులును శ్రమణకులకు రత్నశాలువలు, సువర్ణభూషణములు మున్నగు నమూల్యవస్తువుల దాన మొసగి సంప్రీతుల జేయుదురు.

ఈ రాజ్యము కొండలనడుమనుండు పర్వతప్రాంతమును కడుశీతలప్రదేశము నగుటచే గోధుమలుదక్క యన్యములగు

సస్యము లెవ్వియు నిచ్చట ఫలింపవు. భిక్షువులు తమ "సంవత్సరవిభాగమును" * గొనిపోయినతోడనే, ప్రభాత కాలములందు విపరీతముగ తుషారము గురియనారంభించును. అందుచే తమ వార్షికమును గ్రహింపకమున్నె సస్యముల పుష్కలముగ ఫలింపజేయుడని ♦ నృపాలుడు శ్రమణకుల వేడికొనును.

ఈనృపాలునిరాష్ట్రమున బుద్ధుని నిష్ఠీవనపాత్ర మొకటి గలదు. ఇయ్యది శిలానిర్మితమై, వర్ణమున బుద్ధుని కక్షపాలను బోలియున్నది. ఇచ్చటనే శాక్యసింహుని దంతము కూడ గలదు. దీనిపై నేడొక స్తూపము నిర్మింపబడియున్నది. ఈ స్తూపపరిసరములందు సహస్రబౌద్ధశ్రమణకులు నివసించుచుండిరి. వీ రెల్లరు హీనయానులు. పర్వతపంక్తులకు ప్రాగ్దిశగానుండు ప్రాంతములలో నివసించు ప్రజాళి సిన్నుసామ్రాజ్యమందలి జనులవలెనె మోటువస్త్రముల ధరించుదురు. కొందరు కాశ్మీరపువలువలవంటి మృదుతరమగు సన్నని రోమనిర్మితమగు వసనముల దాల్తురు. ఇచ్చటి శ్రమణకు లనుచరించు ఆచారనియమము లగణితములు. వాని నిచ్చట బేర్కొనుటకు తావులేదు.

---

* సంవత్సరవిభాగము. భిక్షువులగ్రాసమునకై రాజు తన రాజ్యమున బండినపంటలో గొంతభాగమును ఏటేట వారల కిచ్చుచుండును.

♦ కీచారాజ్యమందలి బౌద్ధశ్రమణకుల కమానుషశక్తులున్నవని ఫాహియాను దెల్పుచున్నాడు. ఆతపశీతలములగూడ నుపశమింపజేయగల సామర్థ్యములు వీరికి గలవట!

'కీచా' రాజ్యము ఆనియన్ పర్వతశ్రేణులమధ్య నున్నది. ఈకొండలదాటి ముందునకు బోయినకొలదియు బలు విధములగు వృక్షజాలములు గానవచ్చును. వీనిలో వెదురు, చెఱకు, దాడిమ మున్నగుచెట్లుదక్క తక్కటితరుజాతు లెవ్వియు సిన్నసామ్రాజ్యమున గని విని యెఱుంగనివి.

---

# ఆరవ ప్రకరణము

## ఉత్తరభారతమును సమీపించుట

ఇచ్చటనుండి బయలువెడలి పశ్చిమాభిముఖులై మన బాటసారు లొక్కమాసము పయన మొనర్చి ఆనియన్ పర్వతావళులదాటి ఉత్తరభారతమును సమీపించిరి. ఆనియన్ పర్వతశ్రేణులు మహోన్నతములై యేకాలమును హిమంబుచే గప్పబడియుండును. ఈకొండలలో కూరపన్నగములు నివసించుచుండును. వానిని రేపిరేని విషవాయువుల గ్రక్కును. భయంకర మగు హిమవర్షము గురియించును. శిలావృష్టిచే నాభీలమై ప్రళయభీకరమగు దుపానుల వీవ బంపును. ఈమహా సర్పములవాతబడిన మానవులు జీవములతో దప్పించుకొని బ్రతికి బయటపడుట గల్ల. ఈప్రాంతముల నివసించు ప్రజలీపర్వతములను "మంచుకొండ" లందురు.

మనపాంథు లీపర్వతముల నిర్గమించి యుత్తరభారత మును బ్రవేశించినంతనే 'టోలెయి'†యను రాజ్యమొండు వారి దృష్టిపథమున బడెను. ఇది యుత్తరహిందూస్థానపు సరిహద్దులలోనుండు నొక చిన్న రాజ్యము. ఇచ్చోట హీనయానులగు బౌద్ధభిక్షువు లెందరో గలరు. పూర్వకాలమున నద్భుత ప్రజ్ఞల గల్గిన యర్హతు♦డొక్కడీరాజ్యమున నివసించుచుండెడి వాడు. ఈతడు తన దివ్యమహిమచే (వృద్ధిసాక్షాత్క్రియా ప్రభావముచే) నొక శిల్పకారుని తుషితస్వర్గము*నకు గొంపో

† టోలెయి. ఇది దారద (డారెల్) రాజ్యమై యుండనోపునని కొందరి యభిప్రాయము. దార్దులను తెగవారిచే నివసింపబడు ప్రదేశము గాన దీని కీనామము గల్గినది. అయినను ఫాహియాను దర్శించిన రాజ్య మిదియై యుండునా యను సందేహము వొడముచున్నది. ఏలన నీ రాజ్యము సింధునదీపశ్చిమతీరమున నున్నది. మన పాంథు లీతరుణమున సింధునదికి తూర్పుతీరమున నుండిరి. ఇంకను సింధునదీజలముల దాటి పశ్చిమతీరమునకు బోవలేదు. ఈయుదంతము (మన యాత్రికులు సింధునదీ జలముల నిర్గమించిన యుదంతము.) ముందుప్రకరణమున వర్ణింపబడినది.

♦ ధర్మపథమున జరియించి జితేంద్రియుడై జన్మరాహిత్యమునొందిన యార్యసత్తమునకు "అర్హతు" డని పేరు. అర్హత్వము సిద్ధించిన పుణ్యపురుషున కమానుషప్రజ్ఞ లలవడునని బౌద్ధమతస్థుల విశ్వాసము. చైనాభాషయందీ 'యర్హతు'నకు లోహానుడని పేరు. చైనాదేశమున బుద్ధుని యనుచరుల నందర నీ నామముననే బిలచెదరు.

* స్వర్గములు నాల్గు. అందు తుషితస్వర్గము నాల్గవది. బోధిసత్త్వులందరును బుద్ధులై భూలోకమున నవతరింపకముని చ్చట జన్మింతురు. ఇచ్చటి జీవితపరిమాణము నాల్గువేల హాయనములు. ఇచ్చటి యహోరాత్రములు గలిసి మర్త్యలోకమున నన్నూరు వత్సరములకు సమానమగును.

యెను. స్వర్గధామముననున్న మైత్రేయబోధిసత్త్వుని* యాకార ముఖలక్షణము లాశిల్పకారునికి జూపి, యాతని మూర్తిని భూతలమున జితిరింపజేయుటకై నీయర్హతు డాశిల్పిని స్వర్గమునకు దీసికొనిపోయెను. ఇట్లాశిల్పకారుని మువ్మారు తుషితలోకమునకు గొనిపోయి, మైత్రేయుని విగ్రహ మాతనిచే బూర్తి చేయించెను. ఇది యెనుబదియడుగుల పొడవున జెక్కబడి మనోహరముగ నున్నది. ఉపవాస దినము లలో నీదివ్యవిగ్రహము తేజఃపుంజముల వెలిగ్రక్కుచుం డును. ఆపరిసరప్రాంతముల నేలు రాజన్యు లీ మూర్తికి కానుక లర్పించుటలో నొకరి కొకరు తీసిపోవరు. ఈప్రతిమ పూర్వ మెట్లుండునో యిప్పటికి నట్లే యున్నది.

---

# ఏడవ ప్రకరణము

## పాంథులు సింధునదీజలముల దాటుట.

మన తెరువరు లిచ్చోటనుండి, యానియర్ణపర్వతశ్రేణుల నంటి నైర్ఋతిదిశగా బదునైదుదినములు పయనము సల్పిరి.

---

* ఇతడు 'అజితు'డనికూడ బలుమారు పేర్కొనబడుచుండును. ఈతడొక బోధిసత్త్వుడు. బుద్ధభగవానుని శిష్యకోటిలో నగ్రగణ్యుడు. శాక్యసింహుని సామాన్యశిష్యగణమునం దీతనినామ మెచ్చటను గానరాదు. బుద్ధుడీతని 'తుషిత స్వర్గమున తారసిల్లిఐదు వేలవత్సరములు చెల్లినవెనుక బుద్ధుడవై, భూమండల మున నవతరించి తనస్థాన మాక్రమింపు'మని యాతని నుద్యోగించెను. కావున ప్రస్తుతకాలమున మైత్రేయుడు తుషితస్వర్గమున నున్నాడనియు, బుద్ధుడై జన్మింపబోవుచున్నాడనియు బౌద్ధమతస్థులు విశ్వసించెదరు.

అంతట గండశిలావృతమై పదివేలయడుగుల యున్నతిగల్గి యంబరము నొరయుచు మహోన్నత పాషాణకుడ్యమువలె గన్పట్టు నదీతట మొకటి వారి కెదు రయ్యెను. దానియంచుకు బోయి క్రిందికి జూచినచో గన్నులు తిరిగిపోవును. అధోభాగమున నురుగులగ్రక్కుచు, నదీప్రవాహ మొండు మహావేగమున ప్రవహించుచుండెను. అదియె సింధుతరంగిణి. అచ్చటి నుండి ముందునకు బోవుటకు మార్గము గానరాదు. అడుగు మోపుట కైన నాధారము కన్పింపదు. ప్రాచీనకాలమున జను లీపర్వతోపరిభాగమునుండి క్రిందికిదిగి నదీప్రవాహమును సమీపించుటకు గండశిలల మలచి పొడుగునను నిచ్చెన లమర్చి యొకవిధమగు మార్గ మేర్పరచిరి. ఇట్లమర్చబడిన నిచ్చెనల సంఖ్య యేడువందలకు బైగానుండును. నిచ్చెన కడుగుభాగముల నుండి యావలియొడ్డునకు బోవుటకు మోకులతో నొకవిధమగు వంతెన నిర్మింపబడి యున్నది. ఇచ్చట సింధునది ఎనుబది బారల వెడల్పున నుండును. ఇట్టి త్రాళ్ళవంతెనల యాధారముననే ప్రాచీనకాలమున జను లీ సింధునదీజలముల నిర్గమించెడివారు. పశ్చిమ దిగ్విజయయాత్రకై బయలువెడలిన హన్నువంశ నృపాలుర సైనికబలముల * వెంట నరుదెంచి వ్రాయసకాండ్రు వ్రాతలలో నీ ప్రదేశవర్ణనలు గానవచ్చును.

* హన్నువంశరాజులు పశ్చిమప్రాంత మంతయు జయింపవలె నను నాశతో పెక్కు సైన్యముల వెంటగొని పశ్చిమ దిగ్విజయయాత్రకై బయలు వెడలిరి.

కాని పాంకేను♦, కాన్యింగు* లైన నీ దుర్గమప్రాంతమువర కును బోయిన జాడలు గన్పడవు.

మనయాత్రికు లెట్లో కష్టముమీద సింధునదీజలముల దాటి యావలియొడ్డు జేరిరి.

ఇచ్చట సింధునదీతీరమున నివసించుచుండిన బౌద్ధ సన్యాసులుకొందరు మన పాంథుల దారసిల్లి "ప్రప్రథమమున బౌద్ధధర్మములు ప్రాచ్యదేశములకు గొంపోవబడిన దేకాలమునన్లో మీ రెరుగుదురా" యని ప్రశ్నించిరి. అందుకు ఫాహియాను "ఈ విషయమై నేనును దెలిసికొనగోరి యొకసారి ప్రాచ్యప్రపంచమున నివసించు ప్రజాళి నడిగితిని. వారీధర్మములు ప్రాచీనకాలము నుండియు, తమ తాతతండ్రులనాటగోలె పరంపరానుగతముగ తమప్రాంతముల ప్రబలుచుండెననియు మైత్రేయబోధిసత్త్వుని విగ్రహప్రతిష్ఠాపనమైనపిమ్మట భారతభూమినుండి బౌద్ధశ్రమణకులు కొందరు సూత్రగ్రంథముల వెంటగొని యీసింధునదీ జలముల దాటి ప్రాచ్యఖండమున బ్రవేశించిరనియు దెల్పిరి.

♦ హన్నుసామ్రాజ్యవిభు డగు "వూ" సార్వభౌముని యమాత్యుడు. అవిలంఘ్య మగు పశ్చిమప్రాంతభూముల జొచ్చిన చైనాయాత్రికులలో నీతడే ప్రథముడని చెప్పవచ్చును. ఈతని మూలముననే క్రీ. పూ. 150 వ సంవత్సరమునాటికి పశ్చిమఖండమున విలసిల్లుచుండిన ముప్పదియారు రాజ్యములకును చీనాసామ్రాజ్యమునకును రాకపోక లేర్పడినవి.

* ఈతనిగూర్చి మన కంతగా తెలియదు. ఈతడు క్రీ. శ. 88 వత్సరమున చైనాదేశ నృపాలుడగు "పాన్షో" భూమీశుచే రోమకసామ్రాజ్యమునకు రాయబారిగ నంపబడెను. ఈతడు కాస్పియను సముద్రతీరమువరకును బోయి వెనుకకు మరలివచ్చెను. పశ్చిమప్రాంతములగూర్చి పెక్కువిషయము లీతడు తన దేశీయులకు జెప్పి వారి భూగోళశాస్త్రపరిజ్ఞానమును విస్తరింపజేసెను.

బుద్ధుడు నిర్వాణమునొందిన మున్నూరువత్సరముల కీమూర్తి భూతలమున బ్రతిష్ఠింపబడినది. * ఈ విగ్రహ ప్రతిష్ఠ 'ఛో' వంశజు డగు "పింగు" నృపాలుని రాజ్యకాలమున జరిగి యుండవచ్చును. దీనినిబట్టి మైత్రేయబోధిసత్త్వుని విగ్రహము ప్రతిష్ఠింపబడినతోడనే, ప్రాచ్యదేశములందు బౌద్ధధర్మములు వ్యాపింపదొడగెనని చెప్పవచ్చును. ఈ ధాత్రీతలమున శాక్యసింహునిస్థాన మలంకరింపబోవు మహిమాన్వితుడును ఆధ్యాత్మికశక్తిసంపన్నుడు నగు మైత్రేయుడు గాకుండిన నింతటి దూరదేశముల కేగి మణిత్రయమును♦ బోధించి ఆయాదేశముల నివసించు జనసంతతులకు బౌద్ధధర్మముల నెరిగింపగలవార లెవ్వరుందురు? ఈ ప్రాచ్యభూములలో

* దీనినిబట్టి బుద్ధునినిర్వాణకాలము నిర్ణయింపవచ్చును. పింగునృపాలుడు క్రీ. పూ. 750 మొదలు 719 వరకును రాజ్యమేలియుంటచే, బుద్ధుడీలెక్కనుబట్టి పదునొకొండవ శతాబ్దమున నిర్వాణమునొందియుండవలెనని తేలుచున్నది. కాని యిటీవల గావింపబడిన చరిత్రపరిశోధనలవలన బుద్ధుని నిర్వాణము క్రీ. పూ. 480, 470 సంవత్సరముల మధ్యభాగమున (అనగా కన్ఫ్యూషియస్ గతించిన కొలదికాలమునకే)సంఘటిల్లియుండునని తెలియవచ్చుచున్నది. ఈపరిశోధనలబట్టి జూచిన నీప్రాచ్య మతకర్త లిరువురును సమకాలికులై యుండినట్లు గన్పట్టుచున్నది. 'రిసుడేవిడ్సు' చరిత్రకారుడు, బుద్ధునినిర్వాణకాలము క్రీ. పూ. 412 వ సంవత్సరప్రాంతముననైయుండవలెనని యూహించుచున్నాడు. ఈతనియూహ నిజమగునెడల, శాక్యసింహుడు, కన్ఫ్యూషియస్ కంటె మిగుల జిన్నవాడైయుండవలెను.

♦ మణిత్రయము:—బుద్ధుడు, బౌద్ధధర్మము, బౌద్ధసంఘములు వీనికే మణిత్రయ మనిపేరు.

నింతటి యద్భుత పరిణామము గల్పించుట మానవమాత్రుని పనిగాదు. కావున హాన్సు సామ్రాజ్యవిభు డగు మింగు+ సార్వభౌమునికల నిక్కువమయ్యెను అని నుడివెను.

---

# ఎనిమిదవ ప్రకరణము

## వ్రూషంగు (ఉద్యానము)

సింధునదీ తోయములదాటి మన తెరువరులు 'వ్రూషంగు రాజ్యము' ను దర్శించిరి. ఈ రాజ్య ముత్తరభారతములోనిది. దీనికే యుద్యాన * మని కూడ బేరు. మధ్యభారతమందలి ప్రజలుమాట్లాడుభాషనే యిచ్చటిజనులును మాట్లాడెదరు. అచ్చటిజనులు తినునట్టి యాహారమునే వీరును భుజింతురు. వారుదరించునట్టి వస్త్రములనే దాలుతురు. బౌద్ధమత మిచ్చట

---

+ మింగుసార్వభౌముని రాజ్యకాలమున చైనాసామ్రాజ్యమున బౌద్ధ మతప్రచారము ప్రారంభమైనదని ఫాహియాను సిద్ధాంతము చేయు చున్నాడు. ఈతడు క్రీ.శ. 58 మొదలు 75 వరకును రాజ్యపాలన మొన ర్చెను. క్రీ. శ. 61వ సంవత్సరమున నీతడు స్వప్నమును గనెను. ఈ స్వప్నవృత్తాంతము ఫాహియాను మనకు దెల్పియుండలేదు. బౌద్ధమతప్రచా రమునుగూర్చియైయుండనోపు.

* ఉద్యానము - పాంచాలదేశమున కుత్తరభాగమున సుభవస్తునదీ తటమునంటియుండు రాజ్యము. దీనిప్రస్తుతనామము స్వాట్టు (Swat). కుసుమ ఫలశోభితములగు నారామసీమలచే విరాజిల్లుచు, మనోహరములగు పెక్కు వనభూములకు తావలమై, రామణీయకమగుటచే నీరాజ్యమునకు 'ఉద్యాన' మను నామధేయము గల్గినది.

మిగుల ప్రాబల్యము గాంచినది. బౌద్ధసన్యాసులు నివసించు గృహావళి నిచ్చటిజనులు "సంఘారామము" లందురు. ఇట్టి సంఘారామము లీరాజ్యమున నైదువందలకు మించియుండును. ఇచ్చటిభిక్షువులందరును హీనయానులు. పాంథు లెవ్వరేని యీ సంఘారామముల కరుదెంచునెడల వారల కచ్చట నాశ్రయ మిచ్చిపలువిధముల నాదరించి మూడుదినములవరకును అతిథి పూజ లొనర్తురు. ఈగడువు గడచినవెనుక వేరెచ్చటి కైనను బోయి విశ్రాంతి గొనుడని పంపివేయుదురు.

బుద్ధు డుత్తరభారతమున బర్యటనము సల్పుచు నీ రాజ్యమును దర్శించి యిచ్చట దన "యడుగుజాడను" విడిచి పోయెను. ఈ పదచిహ్నము చూపరుల భావములబట్టి పొట్టి గను బొడవుగను బరిణామము నొందుచు గన్పడుచుండును. ఈ పాదచ్ఛాయ నేటికిని యీరాజ్యమున గలదు. దాని పరిమాణము నేటికిని యిట్లే మార్పునొందుచుండును.

శాక్యసింహుడు తనకాషాయవస్త్రము నారగట్టుకొనిన పర్వతశిలయు, క్రూరనాగున♦ కురగరూపమును బోనడచి దివ్యస్వరూపము నొసగిన పుణ్యస్థలియు నిచ్చటనే గలవు. బుద్ధుడు తనయుడుపుల నారవైచిన శిల పదునాలుగడుగుల నిడివియు, యిరువదియడుగుల వెడల్పును గలిగిన బ్రహ్మాండమగు గండ శిల. ఈ బండ యొక్కవైపున నునుపుదీరి నిగనిగలాడుచున్నది.

---

♦ఈ నాగునిపేరు "అప్తాలుడు." సుభవస్తునదీజలములలో నీతని యునికి. ఈ నదికి అప్తాలుడు రక్షణదేవత.

హ్యూ్యాకింగు, హ్యూ్యాటా, టోచింగు మున్నగు యాత్రికు లిచ్చటనుండి మున్నుగా బయలుదేరి 'నాగర' * యనురాజ్యమును జూడబోయిరి. ఇచ్చటనే బుద్ధుని దేహచ్ఛాయ గలదు. ఫాహియానును దక్కటి పథికులును వర్షఋతువు గతించువరకును ఊషాంగునందే యుండి యటుపిమ్మట నచ్చోటు వీడి దక్షిణాభిముఖులై పోయి సుహాటో• యను రాష్ట్రమును జేరిరి.

---

# తొమ్మిదవ ప్రకరణము

## సు హా టో

ఈ రాజ్యమునగూడ బౌద్ధమతము మిగుల ప్రబలముగ నుండెను. అమరవిభుడగు శక్రుడు † పూర్వజన్మమున బోధిసత్త్వుని అగ్నిపరీక్ష జేసిన తా విచ్చటనే గలదు.

---

* నాగర. కాబూలునదికి దక్షిణపుటొడ్డుననుండు నొకపురాతన రాజ్యము. జలాలాబాదుపట్టణమునకు బశ్చిమముగ ముప్పదిమైళ్ళ దూరమున నున్నది. చైనాభాషలో నీరాజ్యమును "నాకీ" యందురు. దీనికి "నగరహార"మనికూడ నామాంతరముగలదు.

• ఈరాజ్య మెచ్చట నున్నదో స్పష్టముగా దెలియవచ్చుటలేదు. ఇది సింధునదీస్వాట్టుదేశములమధ్య నుండియుండవలెను. ప్రస్తుతస్వాస్తిని (Swastene) యైయుండునని దోచుచున్నది.

† శక్రుడు:— సురపతియగు నింద్రుడు. ఫాహియాను తన యాత్రగ్రంథమున బెక్కుసారు లీతని బేర్కొనుచుండును. బౌద్ధమతస్థు లీతనికంటె శాక్యసింహు డెక్కువవాడని వాదించెదరు.

ఇందుడు బోధిసత్త్వునిసుగుణశీలముల బరీక్షింపనెంచి యొక డేగను పావురమువెంట నంపెను. సాళువము కపోతమును బట్టి, చీల్చి, భక్షించి తనయాకటిబాధ దీర్చికొనుటకై దాని వెన్నంటి తరుమజొచ్చినది. దవ్వులనుండి బోధిసత్త్వుడీదృశ్యము నవలోకించుచుండెను. ఎట్టులైన బ్రాణముల రక్షించుకొనుటకై పరితపించుచు నెగిరివచ్చుచున్న కపోతరాయని దురవస్థ జూచి మిగుల జాలినొంది, బోధిసత్త్వుడు తన మేని మాంసపుకండల గోసి డేగకు విసరి పావురమును గాపాడెను. *

శాక్యసింహుడు జ్ఞానియైనపిదప (బుద్ధత్వమునొంది) తన శిష్యగణములతో నీప్రాంతమున సంచారముచేయుచు, నీ తావు గాంచి మున్నొకసారి తాను తనమేనికండలగోసి సాళువమున కశనముగానిడి పావురమును మృత్యుముఖమునుండి దప్పించిన దిచ్చోటనేయని నుడువుచు నీప్రదేశమును వారలకు జూపెను. ఈ తీరున నీరాజ్యమున నివసించు జనసంతతు లీవృత్తాంతము నెరిగి యీ స్థలమున నొక స్తూపమును గట్టించి వెండి బంగారములతో దానికి బూతపెట్టిరి.

---

# పదియవ ప్రకరణము

## గాంధారము

పథికు లీరాజ్యమునుండి ప్రాగ్దిశగా బయనమొనర్చి యైదు దినములలో గాంధారము♦ను జేరిరి. ఇచ్చట నీతరుణ

* జాతకకథలలోని వృత్తాంతము.

♦ వర్తమాన 'ధేరీరాజ్యమే' ప్రాచీనకాలమున గాంధారరాజ్యమని బిలువబడుచుండెను. పంజాబు ప్రాంతముల విలసిల్లినది. మిక్కిలి పురాతనమైనది.

మున అశోకసార్వభౌముని తనయుడగు ధర్మవివర్ధనుడు +
రాజ్య మేలుచుండెను.

బుద్ధుడు బోధిసత్త్వుడై యుండుకాలమున నొకానొక మనుజునికి దన నయనముల దీసియిచ్చినతా విచ్చటనే గలదు. ఈ ప్రదేశమున నిప్పుడొక స్తూపము గట్టబడియున్నది. ఈ రాజ్యమందలి ప్రజ లెల్లరును హీనయానశాఖకు జెందిన బౌద్ధమతస్థులు.

---

# పదునొకండవ ప్రకరణము

## తక్షశిల; స్తూపచతుష్టయము.

గాంధారమునుండి బయలుదేరి ఫాహియాను తన యనుచరులతో గలసి, ప్రాగ్దిశగా నేడుదినములు ప్రయాణ మొనర్చి తక్షశిలరాజ్యమును జేరెను. చైనాభాషలో "తక్షశిల" యనిన "దునిగినమస్తక" మని యర్థము. బుద్ధుడు బోధిసత్త్వుడై యుండిన ప్రాచీనకాలమున నొకమానవు

+ చంద్రగుప్తుని (గ్రీకుభాషలో సాండ్రకోటస్) మనుమడు. పెక్కు విహారములను స్తూపములను గట్టించి పేరు వడసెను. ఈతడుతన చే జీవములతో పాతిపెట్టబడుటకు శిక్షితుడైన యొకానొక యర్హతుని ప్రశాంతముఖ విలాసముల జూచి దిగ్భ్రమజెంది యాతనివలననే బౌద్ధదీక్ష గైకొనెను. అప్పటినుండియు బౌద్ధమతవ్యాపనకై కృషిసల్పి చేయూత నొసగెను.

నకు దన శిరమును గోసియిచ్చిన క్షేత్ర ♦ మీరాజ్యముననే గలదు. అందువలననే ఈ రాష్ట్రమునకు "తక్షశిల" యని సార్థకనామము గల్గినది.

ఇచ్చటి కనతిదూరమున బోధిసత్వుడు తన దేహము నాకటితోనున్న శార్దూలమున కశనముగా నిడినచోటు గలదు. మన యాత్రికులీప్రదేశమునుండితూర్పుదెసగా రెండుదినములు ప్రయాణ మొనర్చి యాపుణ్యస్థలమును దర్శించిరి. ఈ ప్రదేశ మున సప్తమణిస్థగిత మగుస్తూప మొకటి నిర్మింపబడియున్నది. పై నినుడివినతావునగూడ స్తూపముగలదు. ఈ పరిసరప్రాంత ములనేలు రాజన్యులును, వారియమాత్యగణమును, ఆ యా రాజ్యముల నివసించు ప్రజాళియు తండోపతండములుగ నీ పవిత్రవాటికల దర్శించి, స్తూపములకు ప్రదక్షిణముల నొనర్చి కానుక లిడి పోవుచుందురు. ఇచ్చటి కరుదెంచు యాత్రికులకు దెరపిలేదు. స్తూపములపై పుష్పముల జల్లువారును, నచ్చట దీపముల వెల్గించిపోవువారును నిసుముజల్లిన రాలకుందురు. ఇవియు వెనుక నుదహరించిన స్తూపద్వయమును గలిసి యీ రాజ్యమున "స్తూపచతుష్టయ"మని ప్రసిద్ధి గాంచినవి.

---

♦ ఇది జాతకకథలోని వృత్తాంతము. 'బుద్ధుడు' దాలిద్దియను గ్రామ మున బ్రాహ్మణుడై జన్మించి యీ సాహసమును గావించెను. ఇట్టి మహా త్యాగమునకై యాత డనిమిషలోకమున జన్మ మందెను.

# పండ్రెండవ ప్రకరణము

## పురుషపురము - కనిష్కుని స్తూపము
## గౌతముని కక్షపాల.

మన తెరువరు లిచ్ఛోటనుండి దక్షిణదిశగా బోయి నాల్గుదినములకు పురుషపుర*మను రాజ్యమును జేరిరి. మున్నొక సారి శిష్యగణసమేతుడై శాక్యసింహు డీరాజ్యమున బర్యటనము సల్పుచు నొక్కనా డానందుని ♦ బిలిచి "ఆనందా! నేను పరినిర్యాణము + నొందిన పిదప కనిష్కుడను ×

---

* ప్రస్తుత పెషావరము (Peshawar)

♦ ఆనందుడు శాక్యసింహుని యన్నకొమారుడు. సిద్ధార్థుడు బుద్ధత్వము నొందిన ముహూర్తమున జన్మించెను. ఇతడు బుద్ధుని యుపదేశముల నంది యర్హతు డయ్యెను. గొప్పమేధావి యని పేరుగాంచెను. ఆనంద శాక్యసింహుల కమితమగు స్నేహ ముదయించినది. తన నిర్యాణకాలమున శాక్యసింహు డీతనితో బల్కినవచనములు హృదయవిదారణములు. వీనిని వినిన నెట్టిపాషాణహృదయమైనను నీరగును. ఉత్తరజన్మమున నీతడు బుద్ధుడై భూతలమున నవతరించును.

+ నిర్యాణమునకు బర్యాయపదము.

× క్రీ. శ. మొదటిశతాబ్దమున పదియవ సంవత్సర ప్రాంతమున ఆర్యావర్తమున రాజ్యమేలిన రాజు. వీరిసోదరులమువ్వురిలో నీతడు కనిష్ఠుడు. యూషీ (తుఖారా) వీరి యావాసము. ఆకస్మికముగ నొక సన్యాసి యీ నృపాలునికి గాన్పించి యీతనికి బౌద్ధదీక్ష యొసగెను. నాటనుండియు అశోక సార్వభౌమునివలెనే యీతడును బౌద్ధమతవ్యాప్తికై చాల కృషిసల్పెను. పశ్చిమోత్తరభారతమున విలసిల్లు స్తూపములనెల్ల నీతడే గట్టించెనని ప్రతీతి. భారతభూమి నేలినరాజులలో మిగుల విఖ్యాతయశు డగు భూవరుడు.

నృపాలుడు జన్మించి మహావైభవముతో నీప్రాంతమున రాజ్యమేలి యీప్రదేశమున నొక మహాస్తూపమును నిర్మించు నని పల్కెను. కొంతకాలమున కాత డనినట్లే కనిష్కనృపుడు భూతలమున నుద్భవిల్లి, ఆర్యావర్తమునకెల్ల రాజ్యాధిపత్యమును వహించెను. ఈ భూవరుడు రాజ్యపాలన యొనర్చుచు నొక్కనాడు తన పరిపాలన మేతీరున నడుచుచుండెనో చూడ గోరి ప్రచ్ఛన్నవేషమున దనరాజ్యమున గ్రుమ్మరుచుండ నొకచోట పశులకాపరితనయుడగు పసిబాలు డొకడు మార్గమున కడ్డుగా గూర్చుండి చిన్నిస్తూపము నొకదానిని గట్టుచుండెను. కనిష్కనృపతి యీకుఱ్ఱని నిర్మాణకౌశలమును జూచి రిచ్చవడి "పాపడా! నీవిచ్చట నేమిచేయుచుంటివి?" యని ప్రశ్నించెను. "అయ్యా! బుద్ధభగవానున కొకస్తూపమును గట్టుచుంటిని." అని బాలుడు ప్రత్యుత్తర మిచ్చెను. బాలుని కార్యదీక్ష కెంతయు నచ్చెరువందుచు కనిష్కభూపాలుడు ముద్దులొల్కెడు యీబాలస్తూపముపై వేరొక స్తూపమును గట్టించెను. ఈబాలుడు నిజముగ పశులకాపరిపాపడు కాడు; ఇంద్రభూపతి. బౌద్ధస్తూపము నొక్కదానిని నిర్మింప గనిష్కనృపుని బ్రేరేపించుటకై యీతడు పశుపాలకుని రూపము దాల్చి నృపాలు డరుదేరుమార్గమున కెదురుగా గూర్చుండి యొక చిన్నస్తూపమును నిర్మింపదొడగెను.

కనిష్కనృపునిచే గట్టింపబడిన స్తూపము నన్నూరడుగులయౌన్నత్యముగల్గి రత్నమణిస్థగితమై, కాంతు లీనుచు నేత్రపర్వ మొనర్చుచుండును. మనపాంథు లెచ్చటను దీనిని బోలిన

స్తూపమును గాంచినది లేదు. సౌందర్యమున దీని మరపించు స్తూపము భారతవర్షమున వేరొండు కానరాదు. జంబూద్వీపమున+ నీస్తూపరాజము రమణీయతకు నిరుపమానమని ప్రఖ్యాతిగాంచినది. కనిష్కభూమీశుని స్తూపము పూర్తియైన పిమ్మట నంతర్గతమై లోన మడగియున్న యీపసిపాపని చిన్న స్తూపము ఉన్నతస్తూపమును దక్షిణపార్శ్వమున జీల్చుకొని బయలువడినది. దీనియెత్తు మూడడుగులకు పైగా నుండును.

ఈరాజ్యముననే బుద్ధుని కక్షపాల గలదు. మున్నొక సారి "యూషీ" * రాజ్యనృపు డీకక్షపాలను దనరాజ్యమునకు గొంపోవ దలచి, ప్రచండమగు సైన్యముల వెంట గొని పురుషపురముపై నెత్తివచ్చి, తద్రాజ్యము నవలీల జయించెను. పురుషపురము యూషీభూమీశుని పాదాక్రాంత మయ్యెను. అట్లు దిగ్విజయమును బడసి యూ

---

+ ప్రాచీన హైందవ భూగోళశాస్త్రానుసరణి, భూవలయమున నాల్గుమహాఖండములు గలవు. అందు జంబూద్వీపమొకటి. ఇది యాకారమున, జంబూపత్రమును బోలియుండుటచే దానికిజంబూద్వీపమనునామము గల్గినది. ఈద్వీపము మేరుపర్వతమునకు దక్షిణదిగ్భాగమున నున్నది.

* దీనికే తుఖారగూడెమని పేరు. తార్తారులును, ఇండోసిధియనులును నీరాజ్యమున నివసించు ప్రజలు. వీరు హూణుల (Huns) చేతను మాతృదేశమునుండి దరుమగొట్టబడి (క్రీ. పూ. 180) ట్రాన్సాక్సియానా, బాక్ట్రియను రాజ్యములపై బడి యాదేశముల విధ్వంస మొనర్చి పిమ్మట భారతఖండమును జొచ్చి పాంచాల కాశ్మీరరాజ్యముల జయించిరి. వీరిలో బ్రఖ్యాతుడగురాజు కనిష్కభూపాలుడు. ఈసందర్భమున ఫాహియానుచే బేర్కొనబడిన నృపుడు కనిష్కుడై యుండనోపు.

నృపుడు కక్షపాలను గొనిపోవ నుద్యుక్తుడై తానును బౌద్ధ మతాభిలాషియే యగుటచే మున్నుగా దన సేనానులతో గలిసి మణిత్రియమునకు యథోచితముగ బూజలొనర్చెను. పిమ్మట నొక యుత్తుంగగజరాజమును రావించి భూషణావళులచే నతిమనోహరముగ దాని సింగారించి కక్షపాలను దానిపై నుంచి గజమును దోలింపసాగెను. కాని యాద్విరదము చటాలున నేలపై గూలపడి మరల లేవజాలదయ్యెను. ఒక్కయడుగైనను ముందునకు సాగిపోవజాలదయ్యెను. నృపాలుడంతట గజశకటము నొండు గూర్చించి కక్షపాల నందుంచి, బలిష్ఠములగు నెనిమిదిగజయూథముల నాశకటమునకు బన్ని తోలెను. ఈసారియైనను నృపునిజతనములు ఫలింపవయ్యెను. ఏనుగులు తమశక్తినంతయు ధారవోసినవి. శకటము చలింపలేదు. రోషముతో నాగజబృందము హుమ్మని పట్టిలాగెను. కార్యము లేకపోయినది. శకట మొక్కయంగుళమైనను ముందునకు గదలదయ్యెను. నృపవరుడు ఖిన్నుడై యీ కక్షపాలను గొనిపోవుట కంకను దరుణము సమీపింపలేదని తలచి దాని నచ్చటనే దిగవిడచి నిజరాజ్యమునకు మరలిపోయెను. పోవునపుడచ్చోట నొకస్తూపమును నిర్మించి కక్షపాలను గాపాడుచుండుడని యచ్చట నాయుధపాణులగు భటుల గాపుంచెను. ఆచెంతనే యొకమఠమును గూడ కట్టించెను. ఇప్పుడీమఠమున నేడువందలబౌద్ధసన్యాసులు నివసించుచుండిరి. అపరాహ్ణము తిరిగినంతనే యిచ్చటనుండు సన్యాసులీకక్షపాల ననుదినమును సంఘారామమునుండి వెలుపలకు గొనివచ్చి

పూజ లొనర్చి, నైవేద్యము లర్పించి పిదప భుజింతురు. సాయంసమయమున గూడ నిట్లే దానిని బహిఃప్రదేశమునకు గొనివచ్చి ధూపములు వైచెదరు.

ఈకక్షపాల శ్యామలవర్ణముగ నుండును. అద్దమువలె స్నిగ్ధమై, నిగనిగలాడుచు మెరుగు లీనుచున్నది. దీనిపైయంచుల దిలకించిన నీకక్షపాలవిచిత్రనిర్మాణవైఖరి * ద్యోతకమగును. నాల్గుకక్షపాల లొకదానిలో నొకటి విలీనమై యీ కక్షపాల నిర్మాణమైనట్లు విస్పష్టముజేయుచు దానియంచుల కండ నాల్గు పొరలు గాన్పించుచుండును. ఈ కక్షపాలమందము అంగుళములో నైదవభాగముండును. నిరుపేద లిందు కొలది పుష్పముల బడవైచినను ఇది సంపూర్ణముగ నిండిపోవును. ధనాఢ్యులు, కుసుమరాసుల గంపలతో దెచ్చి గుమ్మరించినను యీకక్షపాల నిండదు.

---

* గౌతముడు బుద్ధుడైనతోడనే బ్రహ్మదేవునిచే యాతనికొసగబడిన భిక్షాపాత్ర యదృశ్యమైనది. అంతట నల్వురధిష్ఠానదేవతలును నాల్గు మరకత నిర్మితములగు కక్షపాలలను దెచ్చి యాతని కొసగిరి. కాని వాని నీతడు గ్రహింపనొల్లడయ్యెను. పిమ్మట వారు (వేరుసెనగకాయవలె) ఇంచుక పసిమివర్ణముగల్గిన శిలానిర్మితములగు కక్షపాలలను దెచ్చి "నే గొనివచ్చినది పుచ్చుకొమ్మ, నే గొనివచ్చినది పుచ్చుకొ" మ్మని తగవులాడ జొచ్చిరి. బుద్ధుడంతట నా నాల్గింటిని దెమ్మని వాని నన్నిటిని యొక దానిలో నొకటి యమర్చి యొక్కటిగా జేసివైచెను. ఈ కక్షపాల పైయంచులదిలకించిన నాల్గుకక్షపాలలకలయికయు విస్పష్టముగ గానవగును.

పాయూను సాంకింగులు కక్షపాలకు యథావిధిగ ఆరాధనలొనర్చి యచ్చటనుండి చైనా దేశమునకు మరలిపోయిరి. హ్వ్యాకింగు, టోచింగు, హ్వ్యాటా మున్నగు యాత్రికులు బుద్ధునిఛాయా, దంత, కపాలాస్థిక లుండు పవిత్రక్షేత్రముల దర్శింప నిచ్ఛగొని తిన్నగ నగారా • రాజ్యమునకు బయనమై పోయిరి. పాప మిచ్చట హ్వ్యాయింగు రోగపీడితు డయ్యెను. ఇతనికి బరిచర్య లొనర్చుటకై టోచిం గీతనికడ నాగిపోయెను. హ్వ్యాటా యొంటరియై పురుషపురమునకుబోయి, యచ్చట తక్కటియాత్రికుల గలిసికొని, యచ్చటనుండి పాయూను, సాంకింగులతో గలసి యాత్ర చాలించి సిన్నుసామ్రాజ్యమునకు వెడలిపోయెను. హ్వ్యాయింగునకు వ్యాధి ప్రబలమై తుద కాతడు శాక్యసింహుని కక్షపాల యున్న సంఘారామమున మృతినొందెను. ఫాహియాను యేకాకియై, గౌతముని పుర్రె ముక లున్న తావునకు బయనమై పోయెను.

---

• దీనినిగూర్చి ఎనిమిదవ ప్రకరణమున జెప్పబడినది.

# పదుమూడవ ప్రకరణము

## న గా రా

ఫాహియాను డిట్లొంటరియై పశ్చిమదిశగా బదునారు యోజనము లరిగి, 'నగారా' రాజ్య సరిహద్దులలోనున్న 'హెలో'* యను పట్టణముజేరెను. ఆమూలాగ్రముగ సువర్ణచ్ఛాదితమై సప్తమణిస్థగితమై యొప్పారుచుండెడు నొక దివ్య విహారమున ♦ బరిరక్షితమై శాక్యసింహుని కపాలాస్థిక యిచ్చటనేగలదు. నగారారాజ్యమేలు నృపాలున కీశల్యాశకలములపై నమితమగు పూజ్యభావము. దీని ననుదినమును దర్శించి, పూజ లొనర్చి పోవుచుండును. దీని నెవ్వరును దస్కరింపకుండ బరిరక్షించుటకై యీరాజు తనరాజ్యమునంగల యుత్తమవంశజులగు నెనమండుగురుయోధుల నహోరాత్రము లీవిహారమునకు కావలివెట్టెను. వీ రీయస్థికను కంటిలోని రెప్పవలె గాపాడుచుందురు. సూర్యుడస్తమించినంతనే సీవిహారరక్షకులు విహారద్వారమునుమూసి ముద్రిలువైచి గృహములకు బోయెదరు.

---

* పెషావరుపట్టణమునకు బశ్చిమముగానుండు హిడ్డానగరమే యీ హెలోపట్టణమై యుండనోపు. దీనికి 'హీగో' యను నామాంతరముగూడ గలదు. 'హీగో' యన శల్యమని యర్థము.

♦ ప్రథమమున బౌద్ధసన్యాసులు నివసించు పర్ణకుటీరములు విహారములని పిలువబడుచుండెడివి. తరువాత గౌతమునికక్షపాల, దంత శల్యములు మున్నగాగలపవిత్రవస్తుచయము నుంచుటకై గోపురాకారముగ నిర్మింపబడు కట్టడములకుగూడ విహారము లను నామము గల్గెను. ఇట్టికట్టడములు బేహారమున విరివిగ నుండుటచే వీనికి విహారము లనిపేరు కల్గెను.

ఈ యెనమండుగురు వీరాగ్రేసరులయొద్ద నెనిమిదిముద్రిక లుండును. ప్రభాతమగుటతోడనే వీరు మరల విహారమునకు జని ముద్రల బరిశీలించి తలుపుల దెరచెదరు. పిమ్మట బన్నీటితో హస్తములగడిగికొని శల్యఖండమును వెలికి గొనివత్తురు. విహారమున కావల బహిఃప్రదేశమున ఉన్నతమగు నొక శిలావేదిక నిర్మింపబడియుండును. దీనిపై గుండ్రని మణిస్థగితమగుసింహాసన మమర్పబడియున్నది. ఈరత్నపీఠికపై నస్థికనుంచి దానిపై వైడూర్యనిర్మితమై, ముత్తియములుబొదిగిఘంటాకృతిగ నుండు నొకడోలికను మూతగాపెట్టెదరు. ఈశల్యము గొంచెము పసిమిడాలుగనుండు ధవళవర్ణముగలిగి యర్ధచంద్రాకృతిగ నున్నది. దీని కైవారము పండ్రెండంగుళము లుండును. ప్రతిదినమును దీనిని విహారాంతర్భాగమునుండి బయటకు గొనివచ్చు వేళల విహారరక్షకు లొక మహోన్నత మగు చంద్రశాలపై నెక్కి తాళమృదంగాదిరావము లొనర్తురు. శంఖముల బూరింతురు. ఈ మంగళధ్వానముల వినినంతనే నృపుడు పూజాద్రవ్యముల హస్తమునగొని వేవేగ విహారమునకు జని, యస్థికకు బూజ లొనర్చును. పిమ్మట నతడును నాతనియనుచరులును ఒక్కరొక్కరే, పదిలముగ నాయెముకనుబైకెత్తి శిరమున నిడికొని మరల దానిని యథాస్థానముననుంచి పశ్చిమద్వారమునుదాటి విహారమును నిర్గమించి (తూర్పుద్వారమున విహారమును బ్రవేశింతురు) వెడలిపోయెదరు.

నగారా రాజ్యాధిపు డిట్లే యనుదినమును ప్రాతఃకాలముననే విహారమునకు జని, యస్థికకు బ్రణమిల్లి పూజ లొ

నర్చును. ఈయారాధనకృత్యములు ముగిసినవెనుక గాని యాతడు తనపరిపాలనాకార్యములనిర్వర్తింపనొల్లడు. ఇచ్చటి వైశ్యులును నిట్లే మున్నుగా, నీశల్యమునకు బూజలొనర్చి యటుపిమ్మటనే సంసారకృత్యముల జక్కబెట్టుకొనెదరు. అనుదినమును యాతీరునే యీశల్యమునకు ఆరాధనలు జరుగుచుండును. పూజావిధానమంతయు సమాప్తియైన పిమ్మట యస్థికను విహారములోనికి దీసికొనిపోయెదరు. దీనినుంచుటకై విహారాంతర్భాగమున "విమోక్ష"* యనెడు స్తూప మొకటి గలదు. ఇది యైదడుగులపొడవుగల్గి రత్నఖచితమై ద్యుతుల నీనుచున్నది. విహారద్వారమునకు ముంగిటభాగమునపూలయంగడు లెన్నియో గలవు. అచ్చట కుసుమదామములు చందనాగరు మున్నగు పూజాద్రవ్యములు విక్రయింపబడుచుండును. శల్యసందర్శనమునకై వచ్చు యాత్రికాగణ మీపుష్పములు గొని యస్థికను బూజించి పోవుచుందురు. ఈపరిసరరాజ్యముల నేలురాజన్యులెల్లరును గౌతముని యస్థికకు దఱుచుగ కానుకలంపుచుందురు. ఈశల్యవిహారము నలువదియడుగుల వైశాల్యము గల్గినచతురమున గట్టబడినది. నభోంతరాళము కంపించినను క్షోణీతలము వికావికలై తునియలైనను ఈతావు చలింపదు.

హెలోపట్టణమునుండి బయలుదేరి మనపాంథు లిచ్చటికుత్తరదిశగా నొక్క యోజనముదూరముననున్న నగారారాష్ట్రరాజధానిని జూడబోయిరి. బుద్ధుడు బోధిసత్త్వుడై

---

* మోక్షదాయిని యనియర్థము.

యుండిన కాలమున నైదు పుష్పమంజరుల మూల్యమునకు గొని దీపాంకరు × న కొసగినచో టిదియె. ఈపట్టణమధ్య భాగమున నొక స్తూపము గలదు. ఇది బుద్ధుని దంతము నుంచుటకై కట్టబడినస్తూపము. బుద్ధునిపుత్త్రముకకుబలెనే దీని కిని యనవరతము పూజలు జరుగుచుండును. అసంఖ్యాకులగు జను లెవ్వేళను దీని దర్శించి పోవుచుందురు.

ఈపట్టణమున కీశాన్యభాగమున నొకపర్వతపులోయ గలదు. ఇచటనే బుద్ధునియోగదండ మున్నది. (పలవలుదీరి సన్యాసుల కడనుండు నొకవిధమగు దండము). ఈప్రదేశ మున నిప్పు డొక విహారము నిర్మింపబడి యున్నది. ఇచ్చటికిని వేలకొలది బౌద్ధయాత్రికు లరుదెంచి కానుక లర్పించి చనుచుం దురు. ఈదండము గోశీర్ష ♦ పర్వతోపరిభాగమున బెరుగు మంచిగంధపుగఱ్ఱతో నిర్మింపబడినది. పదునారు, పదునే డడు గుల పొడవున నుండును. ఇది యత్యంత దీర్ఘ మగు నొక కొయ్యగొట్టమున బరిరక్షితమై యున్నది. శతసహస్ర సం ఖ్యాకులు పట్టి లాగినను దీని నీ యొరనుండి వెలికి దీయుట దుర్లభము.

---

× శాక్యసింహున కిరువదినాల్గవ తరమువాడు. ఇంతముందుగనే బుద్ధు డీతనితో తాను భూలోకమున నవతరింపబోవుచుంటినని తెల్పెను.

♦ గోశీర్ష పర్వతప్రాంతమున తామ్రవర్ణవిలసితములై సుసౌరభముల గుబ్మ్మరించు చందనతరువులు విరివిగ బెరుగుచుండునని ప్రతీతి. ఈ పర్వ తము "ఉల్లరకురు" మహాఖండమున మేరుశైలమున కుత్తరదిశగా నున్నది. ఈ పర్వతము గోశిరమును బోలియుంటచే దీని కీసార్థక నామము గలిగినది.

ఈ పర్వతముకనుమదాటి పశ్చిమముగ గొంతదూర మేగినచో నింకొక విహారము గానవగును. ఇందు బుద్ధుని సంఘాటి * (సంఘాళి) గలదు. ఈ రాజ్యమున అనావృష్టిదోష మావహిల్లినప్పు డెల్ల జనులు తండోపతండములై యీ విహార మునకు గదలిపోయి యీ సంఘాటిని నీవలదెచ్చి, దానికి ప్రదక్షిణము లొనర్చి మ్రొక్కులిడి పూజలు సేతురు. వెను వెంటనే గగనభాగమంతయు మేఘసంకీర్ణమై యొక్కత్రుటిలో కుంభవృష్టిగ వర్షము గురియును.

ఈ పట్టణమునకు దక్షిణభాగమున నొక అర్ధ యోజనదూరమున నెత్తగు పర్వత శ్రేణి యొకటిగలదు. ఇం దొక శిలాగహ్వర మున్నది. ఇదియె గౌతముడు తన తను చ్ఛాయను విడిచిపోయినచోటు. పదిబారలదూరమున నుండి యీనీడను వీక్షించునెడల శాక్యసింహుని దివ్యదేహమును బ్రత్యక్షముగ జూచుచుంటిమా యనిపించును. పసిడికాంతుల మఱపించు నాతనిశరీరకాంతి, యాతని సహజసౌందర్యమునకు మఱింతవన్నె వెట్టు నాతని మేనిపై నలరారు పుట్టుమచ్చలు ♦ విస్పష్టముగ గాన్పించును. దాపునకు బోయినకొలదియు నీ దేహచ్ఛాయ స్వప్నదృశ్యమువలె నస్పష్టమగును.

---

* భుజసీమనుండి పాదముల వరకును వ్రేలుచుండు సన్యాసులు ధరించు దీర్ఘమగు నంగీ.

♦ఇట్టిపుట్టుమచ్చలు బుద్ధునిమేనిపైనూటపంౘ్రెండు (చిన్న వెనుబదియు బెద్దవి ముప్పదిరెండును) గలవని బౌద్ధగ్రంథములందు వ్రాయబడియున్నది.

ఈపరిసరరాజ్యముల బాలించు నృపాలురెందరో నిపుణమతులగు చిత్రకారుల నంపి, యీ ఛాయా చిత్తరువును వ్రాయింప బహుళప్రయత్నము లొనర్చిరి. కాని యిది దుస్సాధ్యమయ్యెను. ఎంతటి చిత్రకారుడైనను ఈతని మేని ఛాయాచిత్రమును జిత్రింపజాలడయ్యెను. సహస్రబుద్ధులును తమతమచ్ఛాయల నిచ్చటనే విడిచిపోయెదరని యీ ప్రాంతవాసులు చెప్పుకొనెదరు.

బుద్ధుని ఛాయాగహ్వరమునకు బశ్చిమముగ నూరుబారల దూరమున శాక్యసింహుడు కేశఖండన, నఖవిచ్ఛేదనము లొనరించుకొ . న తావు గలదు. గౌతముడు నాతని శిష్యగణమును రాబోవు పురుషాంతరములయందు నిర్మింపబడు స్తూపావళి కాదర్శప్రాయముగ నుండున ట్లొకస్తూపరాజమును గట్టిన దీ ప్రదేశముననే. ఈస్తూపము డెబ్బది యెనుబదియడుగుల యున్నతిగల్గి మేఘమండలమును దాటిపోవుచున్నది. ఇది నేటికిని కాననగును. ఈస్తూపమునకు దాపుననే యొక సంఘారామము గలదు. అందునివసించు బౌద్ధసన్యాసు లేడువందలకు పైగా నుందురు. ఈప్రాంతముననివసించిన యర్హత్తుల ప్రత్యేక బుద్ధుల♦జ్ఞాపకార్థమై నిర్మింపబడిన స్తూపము లొక్కసహస్రముండును.

---

♦ వీరికే నిదానబుద్ధులనియు బ్రత్యేక 'జిను'లనియు నామాంతరములుగలవు. వీరు సంసారసౌఖ్యముల త్యజించి, సన్యాసవృత్తిని జేపట్టిన బౌద్ధసన్యాసులు. గురుశిక్షణలేకయే బుద్ధత్వమును సముపార్జించినవారగుటచే వీరన్యులకు మోక్షపథముల నిరూపింపజాలరు. ప్రాచీనబౌద్ధమత కాలమున నిట్టి సన్యాసు లున్నట్లు గానరాదు.

# పదునాల్గవ ప్రకరణము

## హ్యూకింగుయాత్రికుని మరణము.

## "లోయి" "పోహాన" రాజ్యములు.

శీతకాలమంతయు నిచ్చటనే గడపి యటుపిమ్మట మన పాంథుడు తనయిరువురి మిత్రులి*తో గలిసి యిచ్చోటనుండి పయనమై దక్షిణదిశగ బోయి కొన్నిదినములకు క్షుద్రహిమ శైలముల ♦సమీపించెను. ఈ నగోపరిభాగమున నేకాలమును మంచు పేరుకొనియుండును. ఈ పర్వతశ్రేణి కుత్తరభాగమున మనయాత్రికు లాకస్మికముగ బోరున వీచెడుశీతలవాయువుల దాకిరి. అంతటి శీతలమును వా రెన్నడు జూచి ఎఱుగరు. చలిచే వారి శరీరములు గడగడ వణకిపోయినవి. నోటినుండి మాట వెలువడలేదు. పాపము! హ్యూకింగున కీచలి గాలులు మరింత దుర్భరము లైనవి. ఆత డొక్కడు గైనను ముందునకు సాగిపోవజాలడయ్యెను. నోటనుండి నురుగుల గ్రక్క సాగెను. ఈతనికి మృత్యు వాసన్నమైనది. ఇతడు, ఫాహియానును తన ప్రక్కకు బిలిచి, "మిత్రమా! నే నింక జీవింపను. ఒక్కక్షణమైన నాలసింపక, మీ రిచ్చోటు వాసి పొండు. జాగొనర్చెద రేని మీకును నిచ్చట మరణము దప్పదు. నే బోవుచుంటిని. నాకై మీరు చింతింపవలదు."

---

* టోచింగు, హ్యూకింగులు.

♦ ఆర్యావర్తమునకు పశ్చిమోత్తరభాగముననున్న సఫీదుకో పర్వతపంక్తులు. వీనిశిఖరము లెప్పుడును హిమముచే గప్పబడియుండును.

అని హీనస్వరముతో బల్కుచు నాతడు ప్రాణముల విడిచెను. ఫాహియాను కన్నీరు నింపుచు నాతని మృతకళే బరమును గాగిలించికొని "మన సంకల్పమునకు భంగము వాటిల్లినది. ఇది విధివిపరీతము*. చేయునదేమి?" యని విలపించి హతశేషు డగుమిత్రుని వెంటగొని యెట్టులో కష్టము మీద నామంచుకొండల నిర్గమించి "లోయి"♦ రాజ్యమును జేరుకొనెను. ఈ రాజ్యమున మూడు వేలమంది బౌద్ధసన్యాసులు గలరు. వీరిలో హీనయానులును, మహాయానులును గూడ గలరు.

మన బాటసారులు శీతకాల మిచ్చట నాగి యటు పిమ్మట యిచ్చటనుండి బయలుదేరి దక్షిణముగా మరలి పదిదినములకు "పోహన" † యను రాజ్యము సమీపించిరి. ఈ రాజ్యమునగూడ మూడు వేల బౌద్ధ

---

* ఈ శబ్దము లుచ్చరించుట, యిట్టి విపత్తరుణమున మానవమాత్రులకు సహజమైనను, ఫాహియానువంటి బౌద్ధశ్రమణకునినోటనుండి వెలువడ రానివి. ఏలన: బౌద్ధులు విధిసంఘటనమును విశ్వసింపరు. ఆ త్రుటియందు కన్ఫ్యూషియసుమతభావము లాతని మనము నావరించి బౌద్ధమతసిద్ధాంతములను మరుగుపరచినవి.

♦ ప్రస్తుత ఆఫ్గనిస్థానము. ప్రాచీనకాలమున నీ దేశమునకు "లోయి" రాజ్య మనిపేరు. "రోయి" యనిగూడ దీనికి నామాంతరము గలదు.

† ప్రస్తుతము "బన్నూ" లేక, "ఫలానా" జిల్లాయని వ్యవహరింబడు ప్రాంతమునకే ప్రాచీనకాలమున పోహనరాజ్యమని పేరు.

శ్రమణకులు నివసించుచుండిరి. వీరిలో మహాయాను లెవ్వ రును లేరు. అందరును హీనయానులె.

ఈ రాజ్యమును వీడి మన పాంథు లిరువురును మూడు దినములు ప్రయాణ మొనర్చి మరల సింధునదీజలముల దాటి యావలియొడ్డునకు బోయిరి. ఈ నదీప్రవాహమున కిరుపార్శ్వ ముల నుండు విశాలభూభాగమంతయు సమతలమగు పల్లపునేల.

---

# పదునైదవ ప్రకరణము

## "భీద" రాజ్యము

సింధునదిని దాటినంతనే మన తెరువరులు "పెటూ"* యనురాజ్యమును దారసిల్లిరి. బౌద్ధమత మిచ్చట మిగుల ప్రాబల్యముగాంచెను. ఇందు నివసించుసన్యాసులలో నుభయశాఖల(హీనయాన, మహాయాన)వారును గలరు. కడుదూరమున నుండెడు చైనాసామ్రాజ్యమునుండి యార్యావర్తమునుదర్శింప బౌద్ధసన్యాసు లేతెంచి రనువార్త వినినంతనే యిచ్చటి ప్రజ లాశ్చర్యమానసులై "అన్యదేశీయులగు వీరు బౌద్ధమత సారమును గుర్తెరుంగుటయు సంసారతాపత్రయముల విసర్జించి విరాగులై సన్యాసదీక్ష గైకొనుటయు అంతటిదవ్వులనుండిబౌద్ధ మతధర్మముల నరయుటకై భారతరాజ్యమున కరుదెంచుటయు

* పాంచాలము మనయాత్రికుడు దర్శించినకాలమున ప్రకృత పాంచాల రాజ్యము పెటూ యనియు భీదయనియు బిలువబడుచుండెను.

మిగుల నబ్బురముగాదె'' యని యచ్చెరువందుచు వారి కమిత మర్యాదలజూపి వలయువస్తుసామగ్రిని సనుకూర్చి యెంతయు నాదరించిరి.

---

# పదునారవ ప్రకరణము

## మధుర - మధ్యభారతమునందలి సాంఘిక, రాజ్యాంగ వ్యవస్థలు.

పాంచాలమును వీడి మనపాంథు లాగ్నేయముగ నెనుబది యోజనములు ప్రయాణ మొనర్చి కొన్నిదినములకు 'మధుర' * యను రాజ్యమును జేరిరి. మార్గమధ్యమున నెన్నియో సంఘారామముల వీక్షించిరి. అందందు నివసించు బౌద్ధభిక్షుకుల నెందరినో సందర్శించిరి. వారింకను 'పూనా' ♦ నదీ తటము నంటియే పోవుచుండిరి. ఈ నదీప్రవాహమున కిరు కెలకులందును విశాలమగు బౌద్ధమఠము లిరువది గలవు. అందు నివసించు శ్రమణకులు మూడువేలకు పైగా నుందురు.

---

* మధుర- శ్రీకృష్ణుని జన్మనగరము. దీనికి మయూరినగరి యను నామాంతరము గలదు. కృష్ణభగవానుని వాహనము మయూరమగుటచే ఈ నగరమున కాపేరు గల్గినది.

♦ ఇయ్యది యమునాతరంగిణియై యుండనోపు. దీనికి బూనానది యను పే రెట్లుగల్గెనో తెలియకున్నది.

బౌద్ధమత మిచ్చట మిక్కిలి యభివృద్ధి గాంచినది. ఉత్తరభారతమునం దెడారికి బశ్చిమభాగమున విస్తరిల్లిన రాజ్యముల నేలురాజన్యు లెల్లరు బౌద్ధమతస్వీకారులు. బౌద్ధశ్రమణకులయెడ వీరి కమితమగు పూజ్యభావము వారికి కానుక లొసగునపు డీనృపవరులు కిరీటముల దాల్పరు. మకుటముల దీసి శూన్యమస్తకులై వారిని సంభావింతురు. భిక్షువులకు భోజనాదు లొసగునపుడు తమ యమాత్యగణ బంధుసందోహములతో వారి కభ్యాగతులై మృష్టాన్నములతో వారినిబరితృప్తులజేయుదురు. శ్రమణకులమోల్ల వీ రెన్నడును ఉన్నతాసనములపై గూర్చుండరు. రాజాధిరాజై నను పర్యఙ్కముపై నాసీనుడై వీరితో మాటలాడ సాహసింపడు. వారితో భాషింపవలసినపు డిచ్చటి నృపలు వారి ముంగిట నొక రత్నకంబళము బరపించి దానిపై గూర్చుండి వినమ్రులై వారితో ముచ్చటింతురు. ఇట్టి యతిథిమర్యాదలు బుద్ధుడు సజీవుడై యుండిన కాలమున బుట్టినవి. ఇవి నా డెట్టితీరున ననుకరింపబడెనో నేటికిని అదేవిధమున బాటింపబడుచున్నవి. ఈ యాచారము లీప్రదేశమున నణుమాత్రమైనను మార్పునొందక పెక్కుతరముల నుండి యట్లే నిల్చియున్నవి.

మధురరాజ్యమునకు దక్షిణభాగమున వ్యాపించి యుండు దేశమంతయు మధ్యభారత మనబడును. ఇది సమశీతల ప్రదేశము. ఈ ప్రాంతమం దెచ్చటను తుషారములు కానరావు. హిమము మచ్చునకైన కన్పింపదు. ఇచ్చటి ప్రజ లైశ్వర్యవంతులై సౌఖ్యమున మనుచుండిరి. ఇచ్చటి

రాజ్యపాలన అత్యంతసౌఖ్యదాయక మైనది. ప్రజాపీడన యణుమాత్రమైన నీ రాజ్యభాగమున గానబడదు. ప్రజాస్వాతంత్ర్యమునకు భంగముగల్పించు రాజశాసనము లరిది. ప్రజలు తమగృహముల నొక యధికారికడ నమోజు చేయించు కొనవలయు ననునియమము లిచ్చట లేవు. జేనిభూక్షేత్రముల సేద్య మొనర్చు కృషీవలులుమాత్రము కొంత సస్యభాగమును నృపునకు జెల్లింపవలయును. కర్షకులు తమకిష్టముండిన రాజమాన్యముల సేద్య మొనరింపవచ్చును. లేకుండిన వీడిపోవచ్చును. ఎల్లకాలమును వాని నంటియుండవలయునను నిర్బంధము లేదు. తాడన శిరచ్ఛేదనలు మున్నగు కౄరశిక్షల విధింపకయే యిచ్చటినృపులు రాజ్యపాలన మొనర్తురు. వారొనర్చు తప్పిదములబట్టి దోషులకు జరిమానాలను మాత్రము విధించుట గలదు. ఇదియె యీ రాజ్యమున నపరాధులపై విధింపబడు కఠినశిక్ష. ఇచ్చట జేనిపై బెక్కుసారులు తిరుగుబాటుసల్పి యాతని పదభ్రష్టుని గావింప దలపడిన రాజద్రోహికైనను మరణదండన లేదు. అట్టి నిందితుల దక్షిణహస్తముల ఛేదించి విడుతురు. ఈ ప్రాంతమున రాజ్యమేలు రాజుల యంగరక్షకులకుగూడ నిర్ణీతవేతనములు గలవు.

ఈవిశాలరాజ్యమందలి ప్రజలెవ్వరును జీవహింస యొనర్పరు. మద్యమును గ్రోలరు. వెల్లుల్లి, నీరుల్లి మున్నగు నింద్యపదార్థముల దినరు. పశువధ మొదలగు కౄరకర్మల నాచరింపుచు దూరమున పురబాహ్య ప్రదేశమున నివసించు మానవుల

కీప్రాంతమున చండాలు రని పేరు. పురమున బ్రవేశించునపుడును, విపణివీధుల బోవునపుడును, తాము చండాలురమని తెలుపుటకై వీరు కఱ్ఱలతో గొట్టుకొనుచు చప్పుడు చేయుచు బోయెదరు. ఆ ప్రాంతమున సంచరించు జను లాధ్వని విని, వారి సంపర్కము దగులకుండ దూరముగ దొలగిపోయెదరు.

ఇచ్చట నివసించుజను లెవ్వరును కుక్కుటములు, సూకరములు మున్నగు క్షుద్రజంతువుల బెంచరు. జీవములతో నుండు పశువుల విక్రయింపరు. ఈ రాజ్యమందలి విపణవీధులం దెచ్చట వెదకినను మాంసమునమ్ము కసాయిదుకాణములు గాన్పింపవు. మద్యవిక్రయశాలలు గానరావు. వాణిజ్య వ్యాపారములయందు నాణెములుగ నీ ప్రాంతవాసులు గవ్వల నుపయోగింతురు. ఈ రాజ్యమున చండాలురే మృగవధాజీవనులు. వీరలే జంతువుల వేటాడి చంపెదరు. మత్స్యమాంసముల వీరె విక్రయింతురు.

బుద్ధుడు నిర్వాణమునొందినపిమ్మట యీ పరిసర ప్రాంతములనేలు భూవరులు, బౌద్ధసన్యాసుల యారాధనలకై విహారముల గట్టించిరి. వారికి గృహముల, మాన్యక్షేత్రముల, ఆరామసీమల, పొలముల, సేద్యమొనర్చుటకై వలయు దుక్కిటెద్దుల దానమొసగి వీని నవిచ్ఛిన్నముగ, నాచంద్రతారకముగ ననుభవింపుడని, లోహఫలకములపై దానశాసనముల వ్రాయించిరి. వారితరువాత సింహాసన మధిష్ఠించిన రాజులును ఈ సన్యాసుల కొసగబడిన భూగృహారామములకై యాసపడక యీ దానశాసనముల శిరమునదాల్చి పాలించిరి. ఈ లోహ

శాసనములు నేటికిని యాప్రాంతమున గాననగును.

సత్కార్యాచరణము, సూత్రపఠనము, ధ్యాననిష్ఠయు, బౌద్ధభిక్షువుల పవిత్రధర్మములు. ఆహార వస్త్రాదులతో, శయ్యాపర్యంకములతో నమరియుండు గదులెప్పుడును అన్యప్రాంతములనుండి యరుదేరు బౌద్ధశ్రమణకులకొరకై యిచ్చట సిద్ధముగ నుంచబడును. పరివ్రాజకులగు సన్యాసులేతెంచిరని వార్త వినినంతనే ఆ ప్రాంతమందలి సంఘారామమున వసియించు భిక్షువులు వారి కెదురేగి, స్వాగతమొసగి, తమ నిలయమునకు గొనివత్తురు. వారి యుడుపుల కక్షపాలల యోగదండముల తామే మోసికొనివత్తురు. గృహము జేరినంతనే వారికి పాదములగడిగికొనుటకై యుదకమును, పాదలేపనకై తైలము నొసగి యాసీనుల జేయుదురు. నిర్ణీత వేళల ద్రవరూప * మగు నాహారముల నొసగి సంప్రీతుల జేసెదరు. పిమ్మట నా పరివ్రాజకుడు కొంతతడవు బడలికతీర విశ్రమించిన పిదప దరికిజేరి "అయ్యా! మీరీ సన్యాసదీక్ష గైకొని యెంత కాలమైన"దని ప్రశ్నించి, యాతని పూజ్యతాపూజ్యతలబట్టి యాతని కర్హమగు శయనమందిరమును జూపింతురు.

---

* భిక్షువులు సూర్యోదయము మొదలు అపరాహ్ణమువరకును ఘనరూపమగు నాహారమును భుజింపవచ్చును, తక్కటివేళల భుజింపరాదు. అన్యకాలములం దట్టియాహారమును, భుజించుట నిషిద్ధము. అట్లు భుజింపబడు నాహారము "వికల" మగును. మార్గాయాసముచే నలసినపాంధులు మాత్రము తక్కటివేళలందుగూడ మధువు, నవనీతము మున్నగు భక్ష్యముల గొనవచ్చును.

ఈ ప్రాంతమున నివసించు బౌద్ధశ్రమణకుల యావాసములకు దాపున, సారిపుత్ర♦ మహామౌద్గల్యాయన* యానందుల+ గౌరవార్థమును, అభిధర్మ వినయసూత్ర పిటకల¶ గౌరవార్థమును గట్టింపబడిన స్తూపము లనేకము లున్నవి.

ఈరాజ్యమున నివసించు గృహస్థులు ప్రతివత్సరమును వర్ష కాలము గతించిన వెనుక నిచ్చుటి శ్రమణకులకు కానుక

---

♦ సారిపుత్రుడు శాక్యసింహుని శిష్యకోటిలో నగ్రగణ్యుడు. విద్యాపారంగతుడు. ప్రతిభాశాలి. బుద్ధుని "కుడిభుజ"మని ప్రఖ్యాతినొందినవాడు. ఈతడు నలందాపట్టణవాసియగు తిష్యతనయుడు. ఈతనితల్లిపేరు సారిక. ఈమెనుబట్టియే యితనికి సారిపుత్రుడను నామధేయముగల్గినది. ఈతనికి "ఉపతిష్య" (తిష్యతనయుడుగాన) యనునామాంతరముగూడ గలదు. ఇతడు పెక్కుశాస్త్రముల రచించెనని బౌద్ధగ్రంథములయందు జెప్పబడియున్నది. అభిధర్మపిటకను లిఖించిన దీతడేయని యొకప్రతీతి కలదు. బుద్ధుని నిర్వాణమునకు బూర్వమే యీతడుమృతినొందెను. మరల బుద్ధుడై భూలోకమున నవతరించునని బౌద్ధమతస్థుల విశ్వాసము.

* మహామౌద్గల్యాయనుడు. సింహళభాషలోనీతనికి "ముగలాను" డని పేరు. ఈతడును బుద్ధుని ప్రధానశిష్యగణములోనివాడే. శాక్యసింహుని "వామభుజ" మనిప్రఖ్యాతినొందెను. అమానుషశక్తులగలవాడు, దీర్ఘదర్శి. శాక్యసింహుని విగ్రహమును భూవలయమున జిత్రింపజేయుటకైయీత డొకశిల్పకారుని దనవెంట తుషితస్వర్గమునకు గొంపోయి యా లోకకల్యాణుని దివ్యరూపము నాతనికిజూపెను. యమలోకమునకుబోయితనతల్లినినరకబాధల నుండితప్పించెను. ఈతడును శాక్యసింహునికి మున్నె నిర్వాణమునొందెను. బుద్ధుడై యీతడు భూవలయమున నవతరించును.

+ ఈతనివృత్తాంతము తొమ్మిదవప్రకరణమున వర్ణింపబడినది.

¶ పిటకత్రయములోని యుపాంగములు. ఈమూటికిని పిటకత్రయమనిపేరు.

లర్పింతురు. భిక్షువులకనువగు పాయసము మున్నగు ద్రవ్యాహారముల సమకూర్చి వారికంపెదరు. ఇందలి పరివ్రాజకులును ఈ తరుణమున మహాసభల గావించి ప్రజలకు బౌద్ధమత ధర్మముల నుపదేశింతురు.

ఈ ప్రాంతమందలి సన్యాసులు సారిపుత్రుని స్తూపమును బూజింతురు. ప్రతివత్సరమును నీ స్తూపమునకు మహోత్సవములు సల్పెదరు. కుసుమదామములతోడను, ధూపములతోడను, అగరుచందనములతోడను దాని నారాధింతురు. ఉత్సవకాలమున నీస్తూపపరిసరములన్నియు దీపావళులచేనలంకరింపబడి కనుల కింపుసేయుచుండును. ఒకవంక గాయకులు మృదుమధురకంఠస్వనములతో గాన మొనర్చుచుందురు. వేరొకప్రక్క మంగళవాద్యములు చెలగుచుండును.

తొలుత సారిపుత్రు డుత్తమవంశసంభూతుడగు బ్రాహ్మణుడు. ఈత డొకనాడు శాక్యసింహునికడ కేగి, సన్యాసము స్వీకరింప ననుజ్ఞవేడెను. మహామౌద్గల్యాయన మహాకాశ్యపులు * నిట్లె బుద్ధునిచే ననుజ్ఞాతులై సన్యాసదీక్ష గైకొనిరి.

* మహాకాశ్యపుడు మగధరాజ్య నివాసియగు నొక బ్రాహ్మణుడు. శాక్యసింహుడే యీతనికి బౌద్ధమతదీక్ష యొసగి తనశిష్యగణములోనొకనిగ బరిగణించెను. గౌతముడు నిర్వాణమునొందినపిమ్మట నీతడే ప్రధాన బౌద్ధమతాచార్యుడై బౌద్ధమతవ్యాప్తికై చాలాకృషిసల్పెను. బౌద్ధమత మహాసభాసంస్థాపకు డీతడే. అందులకే యీతనికి "ఆర్యస్థవిర" యను బిరుద నామముగల్గినది. మున్నుగ బౌద్ధమతసిద్ధాంతముల లిఖియింప మొదలు పెట్టిన దీతడేయని ప్రఖ్యాతినొందెను. ఈతడును భూవలయమున బుద్ధుడై యవతరించును.

ఇచ్చటనుండు భిక్షుణులానందుని స్తూపమునకు బూజ లొనర్తురు. స్త్రీలకును సన్యాసవృత్తి జేపట్టుట కనుజ్ఞ యొసగుమని యాతడే బుద్ధుని బ్రార్థించియుంటచే నీతనిపై బౌద్ధసన్యాసినుల కమితమగు భక్తి. ఆకారణముననే వీరీతని నారాధింతురు. శ్రామణీరులు♦ రాహులు¶ స్తూపమును బూజింతురు. అభిధర్మపీఠికాపండితు "అభిధర్మస్తూపము"నకును వినయపీఠికాపండితులు "వినయస్తూపము"నకును ఆరాధనల సల్పుదురు.

---

♦ శ్రామణీరులు – నూతనముగ సన్యాసమును స్వీకరించినవారు. వీరు దశవిధనియమములను బాటింతుమని దీక్షగైకొందురు. ఫాహియానును బాల్యమున నిట్టిదీక్ష గైకొనినవాడే. మున్నుగ త్రిశరణమును గైకొని (బుద్ధుడు బౌద్ధాధర్మములు, బౌద్ధాలయములు – వీనికి త్రిశరణములని పేరు) పిమ్మట దశవిధులను బాటింతుమని ప్రమాణముల జేయుదురు. (1) ప్రాణిహింస (2) చౌర్యము. (3) అశుచి. (అపవిత్రత) (4) అనృతము. (5) మద్యపానము. (6) అపరాహ్ణానంతర భోజనము. (7) నృత్య, గాన, వినోదములు, నాట్యకళాప్రదర్శనములు. (8) పుష్పమాలికా, సుగంధజల, భూషణాలంకారములు. (9) మృదుతల్పములు. (10) సువర్ణరజితములు– వీనిని వర్జించుటయే దశవిధనియమము లనబడును.

¶ రాహులుడు – శాక్యసింహుని జ్యేష్ఠపుత్రుడు. బౌద్ధమతమును స్వీకరించి,జనకునికి చేదోడై యాతనితోడ నార్యావర్తమంతయు గుమ్మరెను. గౌతముని మరణానంతర మీతడు "వైభాషిక" మను నూతనసిద్ధాంతమును ప్రతిష్ఠించెను. నూతనముగ సన్యాసస్వీకార మొనర్చునారల కితడధిష్ఠానదేవత. మున్ముందు బుద్ధుడు భూలోకమున నవతరించునపుడెల్ల యాతడాతని జ్యేష్ఠపుత్రుడై యుద్భవించు చుండును.

ఇచ్చటి మహాయానులు ప్రజ్ఞాపారమిత + మంజుశ్రీ • యవలోకితేశ్వరుల * సేవింతురు.

---

+ ప్రజ్ఞాపారమిత:—అష్టపారమితలలో నొకటి. పారమిత యనిన మోక్షసాధనమని యర్థము. బౌద్ధమత గ్రంథములం దట్టి నిర్వాణమార్గము లెనిమిది సూచింపబడెను. దానము, పవిత్రజీవనము, శాంతము, శక్తి, ధ్యానము, జ్ఞానము (ప్రజ్ఞ) మొదలగునవి. వీనికే అష్టపరిమితలని పేరు. వీనిలో జ్ఞానమే యన్నిటిలోన ప్రధానమైనది. ఇదియే నరులను సంసారజలధిని దాటించి నిర్వాణతీరమును జేర్పగలదు.

•మంజుశ్రీ ప్రసిద్ధుడగు నొక బోధిసత్త్వుడు. చైనాసామ్రాజ్యములోని షాన్సీ, పట్టణవాసు లిప్పటికిని వీని నారాధింతురు. భారతఖండమందలి మహాయానులును వీనినే పూజించెడివారు. బౌద్ధగ్రంథములయం దీతడు "జ్ఞానస్వరూపు"డని వర్ణింపబడియున్నాడు. ఈతనికి "మహామతి"యనియు 'కుమారరా'జనియు బిరుదనామములు గలవు. బౌద్ధధర్మముల బోధించుటయం దీత డసమానప్రజ్ఞాధురీణుడని ఖ్యాతినొందుటచే నీతనికి "కుమారరాజు"అనిబిరుదనామము కల్గెను. ఈతడు "సహస్రబాహు"డనియు "శతగక్షపాలధారి" యనియు పేర్కొనబడియున్నాడు.

* అవలోకితేశ్వరుడు ప్రఖ్యాతబోధిసత్త్వులలో నొకడు. చైనాదేశమున నీతనికి "క్వాన్షీ"నని పేరు. "అవలోకితేశ్వర"యనునది సంస్కృత నామము. కంఠధ్వనుల నవలోకింపగలవాడు (మానవాళి ప్రార్థనల నాలింపగలవాడు) అని యీపదమునకర్థము. త్రివిష్టప భారతవర్షములం దీతని పురుషునిగను, చీనా, జపానురాజ్యములందు స్త్రీదేవతగను భావింతురు. చైనాదేశమున నీమె, "సహస్రబాహి"యనియు "సహస్రాక్షి యనియు వర్ణింపబడినది. చీనాసముద్రతీరమునకు సమీపముననున్న "పూటూ" యనుద్వీపమున నీమె ప్రధాన పీఠముగలదు. ఇది, నేటికిని బౌద్ధయాత్రికులకు మహాపుణ్యక్షేత్రము. శతసహస్రసంఖ్యాకు లనుదినమును ఈదేవిని దర్శించిపోవుచుందురు. ఈ భేద మెట్లుగ గల్గెనో, పురుషుడగు నవలోకితేశ్వరుడు దేవి యెట్లయ్యెనో తెలియరాకున్నది.

పూజామహోత్సవములు ముగిసినంతనే, యీప్రాంతమున నివసించు బ్రాహ్మణులును, వైశ్యులును శ్రమణకులకు వార్షికముగ జెల్లింపవలసిన సస్యభాగము జెల్లించి యింకను వారి కుపయుక్తములగు సంబారవస్త్రాదుల వారికి గానుకగ నొసగెదరు.

మనపాంథులు సింధునదీప్రవాహమును దాటినచోట నుండి దక్షిణసముద్రతీరమువరకును వ్యాపించియుండు భూభాగమంతయు నొకవిస్తీర్ణమగు విశాలమైదానము. నలుబదియేబదివేలలీల పొడవుననుండును. ఇచ్చట మహోన్నతములగు పర్వతము లెవ్వియు గానరావు. పర్వతాగ్రములనుండియు వేగమునబారు నదీప్రవాహములును గాన్పింపవు. మందగమనమొనర్చుచుబోవు క్షుద్రవాహినులుమాత్రము గలవు.

---

# పదునేడవ ప్రకరణము

## బుద్ధుని స్వర్గారోహణము.

ఇచ్చట (మధుర)నుండి బయలుదేరి మన తెరువరులు తిన్నగా సంకాశ్య* యను రాజ్యమునకు బోయిరి. ఇది మధురారాజ్యమున కాగ్నేయభాగమున బదునెనిమిది యోజనముల దూరమున నున్నది. బుద్ధుడు త్రయస్త్రింశ

* దీనికే కపిత్థరాజ్యమని కూడ పేరుగలదు. కనూజి పట్టణమునకు వాయవ్యభాగమున 'సమకోళ' యను పేరుగలిగిన గ్రామ మిప్పటికిని గలదు.

త్స్వర్గము♦ నుండి భూవలయమునకు దిగినచో టిచ్చటనే గలదు. శాక్యసింహుడు మన్నొకమారు త్రియస్త్రింశత్స్వర్గమునకు బోయి యచ్చట మూడునెలలుండి తన తల్లియగు మాయాదేవికి బౌద్ధధర్మముల నుపదేశించి పిమ్మట భూమండలమునకు దిరిగివచ్చెను. బుద్ధుడు తన యనుచరులెవ్వరికిని దెల్పకయె సూక్ష్మదేహమును దాల్చి, తనదైవతాశక్తిచే స్వర్గలోకము నవరోహించెను. మాసత్రియ గడువుకాలమింక (బుద్ధుడు స్వర్గముననుండుట కేర్పరచుకొనిన గడువు) ఏడుదినములలో గడచిపోవుననగ, గౌతముడు తన సూక్ష్మరూపమును విడనాడెను. అనిరుద్ధు * డంతట తన దివ్యచక్షువుల సాయమున త్రియస్త్రింశత్స్వర్గమున నున్న శాక్యసింహుని గాంచి, యాతురముతో మౌద్గల్యాయనుని బిలిచి "బుద్ధుడిప్పుడు త్రియస్త్రింశత్స్వర్గమున గలడు. సత్వరమునబోయి యాలోక కళ్యాణుని పాదముల కెరగి ర"మ్మని ప్రోత్సహించెను. మౌద్గ

---

♦ ఇంద్రస్వర్గము. త్రియస్త్రింశత్స్వర్గ మన ముప్పదిమూడు అంతర్భాగములు గల్గిన స్వర్గమని యర్థము. ఇచ్చట వర్ణింపబడిన స్వర్గము హైందవపురాణగాథలలో వర్ణింపబడిన స్వర్గమును సర్వవిధముల బోలి యున్నది. ఇది మేరుపర్వత చతుశ్శిఖర మధ్యభాగమున ముప్పదిమూడు మహానగరములతో చెలువారుచుండునని వర్ణింపబడినది.

* శాక్యసింహుని పినతండ్రియగు అమృతోదనుని తనయుడు. ఈతనికి దివ్యచక్షువులుగలవు (అణిమాది అష్టసిద్ధులలో నొక్కటి). ఇతడు తన దివ్యనయనముల విప్పి ముల్లోకములలోని జీవరాసుల నొక్కసారి తిలకింపగలడు.

ల్యాయనుడు నాలసింపక తక్షణమే స్వర్గమునకేగి బుద్ధుని చరణములపై వ్రాలి నమస్కరించెను. బుద్ధు డాతని లేవనెత్తి సముచితరీతిని గౌరవించి కుశలప్రశ్నలడిగెను. వారిరువురును గొంతతడవు ముచ్చటించిన పిదప శాక్యసింహుడుమౌద్గల్యుని జూచి"మౌద్గల్యాయనా!.నేనింక నేడుదినములలో నిచ్చోటు వాసి, జంబూద్వీపమునకు బోవుచుంటిని. నీవిక భూతలము నకు బొమ్ము" అని పల్కి సెలవొసగి యాతనిబంపివైచెను.

మూడునెలలకాలమునుండి శాక్యసింహు డెచ్చటను గానరాకుంటచే, తల్లడిల్లి యాప్రాంతమున రాజ్యపాలన మొనర్చు పృథ్వీపతు లెనమండ్రు తమయమాత్యగణ ప్రజా నీకములతో రాజ్యముల త్యజించి, యాతని వెదకుచు దేశ దేశమును దిరుగజొచ్చిరి. ఈ మహీపాలు రీతీరున వికల చిత్తులై గగనతలము నావరించు మేఘజాలములరీతి బ్రిబలి తండోపతండములై తమవెంట నరుదెంచెడు మహాజనసంఘము లతో, దేశములెల్ల దిరిగి తిరిగి యెట్టకేల కీ కపిత్థరాజ్యమును జేరి యాతని రాకకై నిరీక్షించుచు, నచ్చట పడగాపుల బడియుండిరి.

ఈ తరుణమున నిచ్చట జేరియున్న మహాజనసంతతు లలో 'నుత్పల' యను భిక్షుని యొకతెగలదు. ఈమెయు, బుద్ధునిగానక పరితపించుచు, నేకాకినియై వాడవాడల దిరిగి తుదకీ కపిత్థదేశమును జేరికొనెను. కాని యాజనప్రవాహమును జూచి యామెగుండె లవిసిపోయినవి. దిగులువడుచు నా సన్యా

సిని తనలో దానిట్లు విలపింపసాగెను. "ఈమహాసందడిలో నా కా మహామహుని దర్శనభాగ్య మబ్బుట దుర్లభము. నేడీ నృపాలక శ్రేణి అసంఖ్యాకులగు జనసంఘములతో నామహా భాగుని దర్శింప వేచియున్నారు. నేనొక్క యబలను; పరివారశూన్యను; అసహాయురాలను. 'వీరందరికంటె మున్నుగా నాలోకకల్యాణుని జూచుభాగ్యము నాకెట్లు లభింపగలదు? అసంభవము! అసంభవము!" అదృష్టవశమున విచారపూరితములగు నీమె తుదివాక్యములు, ఆర్తశరణ్యుడగు బుద్ధుని శ్రోత్రపుటముల బడినవి. ఆతనిహృదయమున నామెపై ననివార్యమగు ప్రేమ జనించినది. తృటికాలమున నామెకు నిఖిలభూవలయమునకు సామ్రాజ్యాధిపత్యము వహింపగల యొక సార్వభౌముని దివ్యరూపమును ప్రసాదించెను. ఇట్లాతనికృపావిశేషమున నాభిక్షుని పృథ్వీపతు లందరికంటె మున్నుగా నాతనికి బ్రణమిల్లి ధన్యురాలయ్యెను.

శాక్యసింహుడు, త్రయస్త్రింశత్స్వర్గమునుండి భూవలయమునకు దిగివచ్చు తరుణమున మింటినుండి భూతలమునకు మణివిరాజితములగు మూడుసోపానపంక్తు లమర్పబడినవి. బుద్ధుడు మధ్యసోపానములపై నుండెను. ఈసోపానములు సప్తమణిస్థగితములై వెలుగుల గ్రక్కుచు గన్నుల మిరుమిట్లు గొల్పుచుండెను. వీనికి దక్షిణపార్శ్వమున రజతనిర్మితములగు మెట్లుగలవు. వీనిపై నడచివచ్చుచు, బ్రహ్మలోకాధీశ్వరుడగు ప్రజాపతి బుద్ధునకు చామరము విసరుచుండెను. మణిసోపానములకును వామభాగమున స్వర్ణ

A. Subbarao



సోపానములు నిర్మింపబడెను. వీనిపై నిలిచి, సురపతి శాక్య సింహునకు ఛత్రము పట్టుచుండెను. అసంఖ్యాకులగు నిర్జరులు బుద్ధునికై కైవారములు సల్పుచు నాతని ననుగమింపజొచ్చిరి. ఇట్లు శాక్యసింహు డమరలోకమునుండి మహావైభవముతో పృథ్వీమండలమునకు దిగెను. బుద్ధుడు భూలోకమును సమీపించి, సోపానములు డిగి పుడమిపై నడుగువెట్టిన తోడనే సోపానపంక్తులు భూమిలో కుంగి యదృశ్యమయ్యెను. ఏడు సోపానపీఠములుమాత్రము నేలపై నిలిచిపోయినవి.

ఈ సంభవము జరిగిన పెక్కువర్షములకు అశోక సార్వభౌముడు రాజ్యాభిషిక్తుడయ్యెను. ఈరాజన్యచూడామణి కొక్కనాడాసోపానముల యధోభాగము భూగర్భమున నెచ్చటయానెనో పరిశీలింపవలయునని బుద్ధిపొడమి తన సేవకులబిలిచి, యామెట్ల యడుగుకొన గన్పించువరకును ద్రవ్వుడని యాజ్ఞాపించెను. సార్వభౌముని సేవకాగణము తేని యాజ్ఞానుసారము పాతాళము గన్పించువరకు ద్రవ్విచూచిరి. కార్యము లేకపోయినది. ఎంతలోతు త్రవ్వినను, సోపానముల తుది గాన్పించలేదు. రాజసేవకులు హతాశులైరి. అశోక చక్రవర్తి విభ్రాంతుడై చిన్నవోయెను. అప్పటినుండియు నాపృథ్వీశుని బౌద్ధమతానురాగము మరింత గాఢమయ్యెను. ఆత డీ సోపానపంక్తులు పుడమిలో గూరుకొనిపోయిన ప్రదేశమున సుందరమగు విహారమును నిర్మించి యందు మధ్యసోపానముల కుపరిభాగమున బదునారడుగుల నిడివిగల యొక బుద్ధవిగ్రహమును జెక్కించెను. విహారమునకు వెనుకవైపున

నేబదిమూరలయున్నతి గల్గి శిల్పచిత్రములతో చెలువొందు శిలా స్తంభము * ను గట్టించెను. ఈ కంబమునకు శిరోభాగమున సింహవిగ్రహ మొకటి చిత్రింపబడియున్నది.

ఈ స్తంభము గుండ్రముగానుండక పలకలుదీరియున్నది. దీనికి నాల్గువైపులను నాల్గు ప్రతిమాస్థానములు గలవు. నాల్గిటియందును నాలుగు బుద్ధమూర్తులు చిత్రితములై యున్నవి. ఈప్రతిమలు మరకతమణులవలె నిర్మలములై నిగనిగద్యుతుల నీనుచున్నవి. ఈయశోక స్తంభమునుగూర్చి యొకచిన్న చిత్ర గాథ గలదు. ఒకప్పుడీసోపానవిహారములుండు ప్రదేశ మెవ్వరియావాసభూమి యని శ్రమణకులకును, బౌద్ధమతాంతరులకును వివాద సంఘటిల్లెను. వాద ప్రతివాద సంరంభమున శ్రమణకులకే పరాజయము గల్గినది. అంతట నిరుకక్షులును శాంతించి, సంధి కియ్యకొనిరి. ఆప్రాంతము నిక్కువముగ శ్రమణకుల నివాసస్థానమే యగునెడల నది యొక్క యద్భుత సంభవము వలన ప్రదర్శితము గావలయుననియును, అట్లు నిర్ధారణయగునెడల మతాంతరులు పోరుచాలించి తామాస్థానమును వీడి

* కన్నింగుహాము (చరిత్రకారుడు). దానీప్రదేశమును, 1862 వ సంవత్సర ప్రాంతమున దర్శించితిననియు, అచ్చట దానొక శిలా స్తంభమును గాంచితిననియు దానియగ్రభాగమున, నతిమనోహరముగ జిత్రింపబడి శిల్పకళాచాతుర్యముల బ్రదర్శించు నొక గజవిగ్రహము గలదనియు, ఆ విగ్రహముయొక్క కరపుచ్ఛములిప్పుడు శిథిలమై కాలవాహినిలో గలిసి పోయినవనియు, నిదియె ఫాహియానుగాంచిన స్తంభమై యుండుననియు, బొరపాటున నాతడీ గజవిగ్రహమును జూచి సింహవిగ్రహ మనుకొని యుండుననియు వ్రాసియున్నాడు.

పోయెదమనియును బలికిరి. తోడనే స్తంభాగ్రమున నధివసించియున్న రాతిసింగము దిక్కులుమారుమ్రోగునట్లు ఒక్క పెట్టునగర్జించినది. చూపరు లాభీషణనినాదమును విని దద్దరిల్లి పడిరి. మతాంతరులు భీతావహులై యచేతనప్రతిమనుండి యట్టి మహాశబ్దములు వెలువడుట కెంతయు నచ్చెరువందుచు, యావింతతీర్పునకు కరములుమోడ్చి వెడలిపోయిరి.

బుద్ధుడు మూడునెల లింద్రలోకమున నివసించి స్వర్గ భక్ష్యముల జవిగొనుటచే నాతనిశరీర మాపాదమస్తకము ఘనసౌరభముల గుబ్బుమ్మరింపదొడగెను. అందువలన నాతడు భూవలయమున నడుగిడినతోడనే సత్వరమునబోయి స్నాన మాచరించెను. పిమ్మట నిచ్చోట (బుద్ధుడు స్నానమొనర్చిన చోట) నొక స్నానగృహము నిర్మింపబడినది. ఇది నేటికిని గాననగును. ఉత్పల శాక్యసింహునకు బ్రణమిల్లినతావున గూడ నొకస్తూపము గట్టబడినది.

బుద్ధుడు కేశఖండన మొనరించుకొనినప్రదేశమందును, గౌతమునకు బూర్వ మవతరించిన బుద్ధత్రయమును ♦ శాక్య

♦ మహాభద్రకల్పమున నుద్భవిల్లినవారు. ఈకల్పముననె గౌతమ బుద్ధుడుగూడ నవతరించెను. ఈతడు నాల్గవవాడు. భావికాలమున నవతరింపనున్న మైత్రేయు డయిదవవాడగును. బుద్ధత్రయమున "క్రకుచందుడు" మొదటివాడు. ఈతడు కాశ్యపవంశమున బుట్టినవాడు. ఈతనికాలమున మానవుల జీవితపరిమాణము నలువదివేల వత్సరములు. అసంఖ్యాకులగు మానవుల కీతడు బౌద్ధదీక్ష నొసగును. ఈతనితరువాత నుద్భవించినవాడు "కనకముని." ఈతడు బుద్ధత్రయమున ద్వితీయుడు. ఈతని దేహకాంతి సువర్ణచ్ఛాయను మరపించుచుండుటచే నీతని కీనామధేయము

సింహాసనము నుండి భాషించిన తావులందును, నడచి పవిత్రమొనర్చిన చోటులందును, సురపతియు కమలాసనుడును బుద్ధునికి ఛత్రచామరముల బట్టుచు మింటినుండి మర్త్యలోకమునకు దిగిన పుణ్యస్థలమునందును స్తూపములు నిర్మింపబడినవి.

ఈ రాజ్యమున నివసించు శ్రమణకులసంఖ్య రమారమి యొక సహస్రముండును. వీరిలో నుభయశాఖలవారును గలరు. బౌద్ధసన్యాసులకు భోజనాదు లొసగుటకై యిచ్చోట ధర్మశాల లనేకములు గలవు. ఇచ్చటనే శ్వేతకర్ణియను భూతసర్ప మొకటిగలదు. ఈయురగమిచ్చటి సన్యాసుల కెట్టిహానియు దొరలకుండ వారిని గంటికి రెప్పవలె గాపాడుచుండును. ఇంతియకాక యీరాజ్యమున గొరత వాటిల్లకుండ సకాలమున కుంభవృష్టి గురిపించుచు సస్యాదుల బుష్కలముగ ఫలింపజేయుచు నిచ్చటి ప్రజలకెంతయు శుభము గూర్చుచుండును. దీని కారుణ్యభావమునకు మిగుల సంతసింపుచు, నీరాజ్యమున నివసించు శ్రమణకు లీసర్పరాజమున కొక విహారమును నిర్మించి, యది శయనించుటకం దొక రత్నకంబళమును బఱచిరి. దీని కనుదినమును దమచే మంత్రపూతమగు నాహారమును బంపుచుందురు. ముగ్వురు శ్రమణకులు దానితో గలిసి

గల్గినది. ఈతనికాలమున నరుల యాయుష్కాలపరిమితి ముప్పదివేలేండ్లు. వీనితరువాత కాశ్యపు డవతరించెను. ఈతనికాలమున మానవుల జీవితపరిమాణ మిరువదివేల హాయనములు.

భుజించుటకై ప్రతిదినమును దాని యావాసమునకు బోవు చుందురు. వర్ష కాలము గడంచినంత నేయా ఫణిశ్రేష్ఠముతన మేను గృశింపజేసి సూక్ష్మరూపమును దాల్చును. అది గనిపెట్టి యిచ్చటి భిక్షువు లాపామును మీగడతో నింపిన యొక తామ్ర కలశమున నుంచెదరు. పిమ్మట శ్రమణకు లందరును బారులు దీర్చి యొక్క ప్రదేశమున గూర్చుండెదరు. అంతట నా రాగిపాత్రమును, ప్రతి శ్రమణకుని పీఠమునొద్దకును గొనిపోవుచు నాశ్రేణు లన్నియు దిప్పెదరు. దానిపై నధి వసించియున్న శ్రమణకునకు జోహారు లొనర్చుచున్నదో యనున ట్లా యురగము భిక్షువుని యాసనమును సమీపించి నపుడెల్ల దనశిరము నెత్తుచు వంచుచుండును. ఇట్లా భుజంగము శ్రమణకులపీఠములన్నియు జుట్టివచ్చిన తోడనే యదృశ్యమై పోవును. ఇట్లే ప్రతివత్సరమును నీభూతము సర్పరూపమును దాల్చి సన్యాసుల దర్శించి పోవుచుండును.

ఈ రాజ్యము మిగుల సస్యవంతమైనది. ఇందలి ప్రజ లఖండసౌఖ్యముల దేలియాడుచు నెట్టికొఱతయులేక, ధనధాన్యములతో దులదూగుచుందురు. అన్యప్రాంతముల నుండి పాంథు లెవ్వరేని తమగ్రామముల కేతెంచినచో వారిని బలుతెరగుల నాదరించి యతిథిసేవ లొనర్తురు.

ఉరగవిహారమునకు బశ్చిమోత్తరముగ నేబదియోజన ముల దూరమున, 'అనిలభూమి' యనునామమున బరగు సంఘా రామ మొక్కటిగలదు. ఈమఠమునకు దాపుననే పూర్వము 'పెద్దరాసి' యను భూత మొక్కటి దిరుగుచుండెడిది.

ఇది శ్వేతకర్ణివలె లోకోపకారికాదు, కుటిలపిశాచి. కరుణాసాంద్రుడగు బుద్ధుడు దీని పిశాచిరూపమును దొల గించి మానవస్వరూపము నొసగెను. ఈ ప్రదేశమున నొక విహారము నిర్మింపబడియున్నది. ఈరాజ్యమేలు నృపాలు డీవిహారభూమి నంతయు నొక యర్హతునకు దానమిచ్చు చుండ నాతని హస్తమున విడిచిన సలిలబిందువులు కొన్ని భూమిపై పడెను. ఆబిందువు లీప్రదేశమున నేటికిని గాన్పించు చుండును. ఎంతటితీక్ష్ణ మగు నెండ గాచినను, భగ్గున మండు కొనిపోవు వేసవియందైనను నీ నీటిబిందువు లింకిపోవు. పనిగొని హస్తములతో బలుమారులు తుడిచినను నంత రింపవు. ఇచ్చటనే బుద్ధునిస్తూప మొకటి గలదు. ఈ స్తూపము కడ నహోరాత్రములు కావలిగాయుచు, నాప్రదేశ మం తయు దుడిచి యుదకము జల్లుచు నొకపిశాచి యీప్రాంతమున సంచరించుచుండును. విమతస్థుడగునృపాలుడొక్క డసూయా ప్రేరితుడై యాపిశాచమునుజూచి "పిశాచమా! నా సర్వసైన్య ములతో నిచ్చటికి గదలివచ్చి, యీప్రదేశమున శిబిర ముల నిర్మించుకొని యీ తావంతయుగల్మషభూయిష్ఠ మొనర్చె దను. అప్పుడీ ప్రదేశమంతయు నెట్లు సమ్మార్జించి, పరిశుభ్ర మొనర్తువో జూచెదగాక" యని పల్కి సత్వరమున దనసైనిక వాహినుల రప్పించి బిలబిలలాడుచు నవ్వీట విడిసెను. అంతట నాపిశాచి ప్రళయభీకరమగు సుడిగాలుల నాప్రదేశ మున వీవబంచెను. చిటికలో నాప్రళయమారుతము లాకశ్మలము

నంతయు దుడిచి యాపరిసరముల నెప్పటియట్ల పవిత్ర వంతముగ నొనర్చెను.

ఈసమీపమున నక్కడక్కడ చెదరి నూరు చిన్న స్తూపములు గలవు. రవి గ్రుంకువరకు లెక్కించినను వీనిసంఖ్య గనుగొనజాలము. వీనిసంఖ్యానకము నరయదలచితిమేని, ప్రతి స్తూపమునొద్ద నొక్కొక్క మనుజుని నిలువబెట్టి పిమ్మట నా మనుజుల లెక్కగొనవలయును.

ఇచ్చటనే యొక బౌద్ధమఠముగూడ గలదు. ఆరేడు వందల సన్యాసు లిందు నివసించుచుండిరి. మున్నొకమారు నిదానబుద్ధు డొక్క డాహారమును భుజించిన తా విచ్చటనే కలదు. ఈమఠముననే యాశ్రమణకుడు నిర్యాణము నొం దెను. దీని కనతిదూరమున నాతని మృతకళేబరమున కగ్ని సంస్కారము గావించినచోటు గలదు. ఇది వలయా కారముగ బండిచక్రమంత పరిమాణమున నుండును. ఈ ప్రదేశముచుట్టును గసవు పుష్కలముగ బెరుగుచున్నను దీని లోపలిభాగమునమాత్ర మొక్క గడ్డిపోచయైనను మొలక లెత్తుటలేదు. అంతయు వంధ్యబారియున్నది. ఈ శ్రమణ కుడు తన కాషాయాంబరముల నారగట్టుకొనిన తావును నిశ్లే తరులతాశూన్యమై యున్నది. ఆతని యుదుపులబరచిన యానవాళ్ళింకను నిచ్చట గాన్పించుచున్నవి.

---

# పదునెనిమిదవ ప్రకరణము

## కన్యాకుబ్జ.

మన పాంథులు వర్షకాలమంతయు ఉరగవిహారముననే యుండిరి. పిమ్మట నచ్చటనుండి బయలుదేరి యాగ్నేయ దిశాభిముఖులై యేడుయోజనములదూర మరిగి, గంగానదీ తీరముననున్న కన్యాకుబ్జనగరము*ను దర్శించిరి. ఈపట్టణమున గొప్ప బౌద్ధమఠములు రెండు గలవు. ఇందు నివసించు సన్న్యాసు లెల్లరును హీనయానులు.

ఈ నగరమునకు బశ్చిమభాగమున నారేడులీలలదూర మున, గంగానది యుత్తరపుటొడ్డున శాక్యసింహుడు తన శిష్యగణమునకు బౌద్ధధర్మముల నుపదేశించిన పవిత్రవాటిక గలదు. "మానవుల సుఖదుఃఖము లస్థిరములు. కాయము బుద్బుదప్రాయము" మన్నగు వేదాంతరహస్యముల, బుద్ధు డీతరుణమున దన శిష్యకోటులకు దెల్పెనని యాప్రాంతవాసు లిప్పటికిని వింతగ జెప్పుకొనుచుందురు. ఈ ప్రదేశమునగూడ నొక స్తూపము గట్టబడినది. అది నేటికిని నిల్చియున్నది.

కన్యాకుబ్జనగరమున గలవిశేషముల నారసి మన పాంథు లచ్చటనుండి దక్షిణముగమరలి గంగాతరంగిణిదాటి యచ్చటి కనతిదూరముననున్న 'ఆలి' ♦యను గ్రామమును

---

* కుబ్జకన్నియల నగరము. బ్రహ్మదత్తుని నూర్వురు పుత్రికలును, "మహావృక్షు"డను తాపసునివివాహమాడక తిరస్కరించుటచే నాతడు కోపించి "మీరలందరును కుబ్జశరీరలగుదురుగాక" యనిశపించెను. అందు వలననే యీ నగరమునకు కన్యాకుబ్జనగరమని నామధేయము గల్గినది.

♦ ఈ గ్రామ మెచ్చటనుండెనో తెలియవచ్చుట లేదు.

జేరిరి. ఈ గ్రామసమీపముననే బుద్ధుడు తపోనిష్ఠల గడపిన తావులును, అసంఖ్యాకులగు జనసంతతులకు బౌద్ధధర్మముల నెరిగించినస్థలములును గలవు. ఈ పావనక్షేత్రము లన్నిటి యందును స్తూపములు గట్టబడియున్నవి.

---

# పందొమ్మిదవ ప్రకరణము

## అయోధ్య.

ఈగ్రామము వీడి యాగ్నేయ దిశగా బదియోజనముల దూర మరిగినచో విశాఖ (అయోధ్య) యను రాష్ట్ర మొకటి గానవచ్చును. ఇది మిగుల పురాతన రాజ్యము. సాకేతు, దానికి రాజధాని. ఈ నగరి దక్షిణద్వారమున కనతి దూరమున రాజబాటకు ప్రాగ్దిశగ బుద్ధుడు దంతధావన మొనర్చుకొనినచోటు గలదు. గౌతము డిచ్చటనే యొక వటవృక్ష శాఖతో బలు దోమి యటుపిమ్మట నా దంత కాష్ఠమును దనచెంత భూమిలో గ్రుచ్చెను. వెంటనే యా నిర్జీవకాష్ఠము సజీవియై త్రుటికాలమున బర్ణములు దొడిగి, ఏడడుగుల యెత్తునకు బెరిగి చిన్న వృక్ష మయ్యెను. విమతస్థులగు బ్రాహ్మణు లాయద్భుతమునుగాంచి యసూయాపరులై యా లేతపాదపమును నిర్మూలింప బహువిధప్రయత్నము లొనర్చిరి. ఒకమారు దానిని మొదలంట దెగనరికిరి. మరియొక సారి సమూలముగ బెకలించి దూరముగ బారవైచిరి. కాని,

యా మొక్క చావదయ్యెను. మరలమరల నది యచ్చోటనే యుద్భవిల్లుచు పల్లవింపదొడగినది. బ్రాహ్మణులు హతాశులై వెడలిపోయిరి.

ఈ తరుసమీపముననే బుద్ధచతుష్టయము కూర్చుండి భాషించిన తావులును, నడచి యానందించిన చోట్లును గలవు. ఆ స్థానములన్నిటియందును విహారములు నిర్మింపబడియున్నవి.

---

## ఆరువదియవ ప్రకరణము

### కోసలము - జేతవనవిహారము.

సాకేతనగరమునుండి మన పాంథులు దక్షిణముగా మరలి యచ్చటి కెనిమిదియోజనముల దూరమున నున్న శ్రావస్తి పట్టణమును జూడబోయిరి. శ్రావస్తి♦ కోసల* రాజ్యమునకు రాజధాని. అతిప్రాచీన మయిన నగరము. ప్రసేనుజిత్తుడు+ రాజ్య మేలినచోటు. ఈ పట్టణ మిప్పుడు మిగుల శిథిలమైయున్నది. పూర్వవైభవము లంతరించినవి.

---

♦ అయోధ్యానగరమున కరువదిమైళ్ళదూరమున 'రపతీ'నదియొడ్డున నున్నది. ఈపట్టణశిథిలములు నేటికిని గాననగును. శాక్యసింహునకు జ్ఞానోదయమైనపిమ్మట నాతడు బెక్కువత్సరము లిచ్చటనే గడపెను.

* నవీన అయోధ్యాఖండములో నొకభాగము.

+ బౌద్ధమతమును బోషించిన రాజన్యులలో నీతడొకడు. ఈతడు కోసలరాజ్యమును బాలించినవాడు.

మునుపటివలె బహుళజనసంఖ్యాకులచే గలకలలాడు చుండుట లేదు. జనశూన్యమై వెలవెల బోవుచున్నది. నేడీపట్టణమున, నిన్నూరుకుటుంబములకంటె నెక్కువ గాన్పింపవు. మహాప్రజాపతి*చే నిర్మింపబడిన ప్రాచీనశిలా స్తూప మిందే గలదు. సుదత్తుని♦ గృహశిథిలములును నిచ్చో టనే గానసగును. ఆతని దివ్యభవనమంతయు నిప్పుడు కాల వాహినిలో గలిసిపోయినది. ప్రాకారకుడ్యములును బాడు నూయియు మాత్రము నేటికిని నిల్చియున్నవి. అంగుళ మాల్యు+డర్హతుడైన తావును, ఈతడు నిర్వాణము నొందినపిదప నాతని దేహ మగ్నిసంస్కార మొనరింపబడిన చోటును, ఈ పట్టణసమీపముననే గలవు. ఈ ప్రదేశము లన్నిటియందును అత్యున్నతములగుస్తూపములు నిర్మింపబడి యున్నవి. ఈ స్తూపవైభవముల గాంచి బౌద్ధమత వైరులగు

* శాక్యసింహుని పినతల్లి. శైశవమునుండియు, బుద్ధుని పెంచి పెద్ద వానిని జేసిన దీమెయే. స్త్రీలలో సన్యాసదీక్ష గైకొనుట కీసాధ్వీమణియే ప్రథమురాలు.

♦ శ్రావస్తి పట్టణవాసియగు నొకానొక వణిక్ శ్రేష్ఠుడు. మిగుల ధనాఢ్యుడు. దానశీలుడు. ఫాహియాను శ్రావస్తిపట్టణమును దర్శించు కాలమునాటి కాతని భవనమంతయు శిథిలమై పాడుపడియుండెను.

+ ఒక వీరశైవమతస్థుడు. అంగుళమాల్యలను వీరశైవమతశాఖకు జెందిన వాడగుటచే నీతని కీనామము గల్గినది. ఈ శాక్తేయులు స్వమత రక్షణకే హత్యలుగావించినను దోషములేదని తలచెదరు. శాక్యసింహునిచే నాతడు బౌద్ధమత దీక్షగైకొని యర్హతుడయ్యెను.

నిచ్చటి బ్రాహ్మణు లసూయాగ్రస్తులై వీని నెట్టులైన విధ్వంస మొనర్పవలయు నని విశ్వప్రయత్నము లొనర్చిరి. ఒకనాటి రేయి ఖడ్గహస్తులై యీప్రదేశమును జుట్టిముట్టిరి. కాని కార్యము లేకపోయెను. ఆ తరుణమున, నాకస్మికముగ నాకసమంతయు కారుచీకట్లు గ్రమ్మి నభోంతరాళమునుండి ఫెళఫెళారావము లొనర్చుచు పిడుగులు గురియ జొచ్చెను. ప్రళయభీకరముగ జీమూతసంఘములు గర్జింపదొడగెను. గగనభాగమంతయు గలత జెందినట్లు శరపరంపరలుగ మెరుపులు మెరయజొచ్చినవి. స్తూపసంహారణమునకై యేతెంచిన బ్రాహ్మణు లా యుత్పాతలక్షణముల గాంచి గుండె లవిసి యచ్చోటనుండి బరుగువారిరి.

ఈ పురద్వారమునకు దక్షిణపార్శ్వమున నన్నూరు బారలదూరమున సుదత్తునిచే నిర్మింపబడిన విహార మొకటి గలదు. ఇదియె లోకవిఖ్యాతమగు "జాతవనవిహారము" దీనికే సువర్ణవనవిహార మని గూడ నామాంతరము గలదు. ఈ విహారము తూర్పుముఖముగ గట్టబడియున్నది. దీని సింహద్వారమున కిరుకెలకు లందును శిల్పరచనలచే నలరారెడు రెండు శిలాస్తంభములు గలవు. అందు వామపార్శ్వమున నిర్మింపబడిన స్తంభశిరోభాగమున నొక చక్రప్రతిమ గలదు. కుడివైపున నున్నదాని యగ్రభాగమున నొక వృషభ విగ్రహము చిత్రింపబడియున్నది. ఈ విహారపరిసరములన్నియు నిర్మలజలపూరితములగు జలాశయములతోడను, మధురఫలభరితములగు తరుసంతతులతోడను, చిత్రశోభితము

లగు సుమజాలములతోడను నిండి కనులపండువొనర్చు లతా వితానములతో విలసిల్లుచు నెంతయు శోభాయమానముగ నున్నవి. ఇట్టి రమ్యదృశ్యములతో నలరుచు అత్యంత మనోహరముగ నుండుటచేతనే యీ విహారమునకు "సువర్ణ వన విహార"♦మను నామము గలిగినది.

శాక్యసింహుడు త్రియస్త్రింశత్స్వర్గమునకు బోయినపుడు కోసలదేశాధీశ్వరుడగు ప్రసేనజిత్తు డాతనిగానక బెగడొంది గోశీర్ష చందనతరువుతో నాతని విగ్రహమును జెక్కించి యామూర్తిని సువర్ణవనవిహారమున బుద్ధు డనుదినము నుపవిష్టుడై తప మాచరించుకొనుతావున బెట్టించెను. శాక్యసింహుడు తల్లికి బౌద్ధధర్మముల నుపదేశించి స్వర్గమునుండి భూమండలమునకు మరలి మరల యీవనవిహారమునకు జనుదెంచుచుండె నను వార్త లేతెంచినంతనే యీ చందనపుబొమ్మ తటాలున దన స్థానమునువీడి యాతని కెదురేగెను. శాక్యసింహు డా ప్రతిమనుజూచి సంతసించి "విగ్రహమా! నీవింక నీయథాస్థానమునకు బొమ్ము. నేనీలోకమును బాసిపోయిన పిదప నా

---

♦ శ్రావస్తిపట్టణ పరిసరముల విలసిల్లు నొక ప్రసిద్ధవిహారము. ఇది యత్యంతరమణీయమగు నొక క్రీడావనమున గట్టబడినది. ఈయారామము, ప్రసేనజిత్తుని తనయుడగు 'జేత' యను నృపకుమారునిచే "అనాధపిండికు" నకు విక్రయింపబడినది. శాక్యసింహుని కీవనవాటిక మిగుల ప్రేమాస్పదమగు నావాసభూమి. పెక్కువత్సరము లాత డిందే నివసించెను.

చతుర్విధశిష్యసంతతులకు* నీవే యాదర్శప్రతిమవు గావలయు”నని యాశీర్వదించెను. తోడనే ఆపాఞ్చాలిక యచ్చోటువాసి విహారాంతర్భాగమునకుబోయి తన యథాస్థానమున నిల్చెను!

ఇదియె ప్రథమమున భూమండలమున జిత్రింపబడిన బుద్ధవిగ్రహము. తదుపరి బౌద్ధప్రపంచమున నిర్మింపబడిన బుద్ధమూర్తులకు మాతృక. అంతటినుండియు శాక్యసింహుడీవిహారమునువీడి దీనికి దక్షిణపార్శ్వమున నిరువదిబారల దూరముననున్న వేరొక చిన్నవిహారమున దన నివాసమేర్పఱచుకొని యందు నివసింపజొచ్చెను.

తొలుత సువర్ణ వనవిహార మేడంతరముల ప్రాసాదము. ఈ విహారపరిసరముల రాజ్యపాలన మొనర్చు రాజులును, దత్ప్రాంతనివాసులును ఏకాలము నీ దివ్యహర్మ్యమును దర్శించిపోవుచుందురు. దీనికి గానుక లర్పించువారును, బట్టుతోరణములతో నీభవనమంతయు నలంకరించువారును, చిత్రవర్ణవిలసితములగు వితానముల నీసౌధోపరిభాగమున వ్రేలగట్టువారును, నీసదనమున సుమజాలముల వెదజల్లువారును, ధూప

* బౌద్ధమతమున చతుర్విధధర్మములు గలవు: (1) మానవజన్మము దుఃఖభాజనము (2) మనోవికారమే దుఃఖపరంపరలకు గారణభూతము (3) ఇంద్రియనిగ్రహము దుస్సాధ్యముగాదు (4) ఇంద్రియనిరోధమునకు మార్గములు గలవు, అనునవి. ఈచతుర్విధధర్మముల నభ్యసించిన బౌద్ధగణము క్రమముగ స్రోతపాణులనియు, సక్రదాగామినులనియు, అనాగామినులనియు, అర్హాతులనియు చతుర్విదశాఖలుగ విభజింపబడిరి.

ములు వైచువారును, సూర్యుడస్తాద్రి జేరినంతనే యచ్చటదీప
ములు పెట్టువారును, ఈప్రదేశమున నెల్లవేళలబౌద్ధయాత్రికు
లిసుముజల్లిన రాలకుందురు. ఇట్లుండ దౌర్భాగ్యవశమున
నొకనాటిరేయి యొక మూషికము వెలుగుచున్న దీపపువత్తిని
నొకదానిని నోట గరచుకొని పరుగెత్తుకొని పోవుచుండ
హార్మ్యపరిభాగమున గట్టబడిన మేల్కట్టున కగ్నిస్పర్శదగిలి
నిప్పంటుకొనెను. త్రుటికాలమున నగ్నికీలలు రేగి నానాముఖ
ముల వ్యాపించి యాభవనమును జుట్టివైచినవి. సువర్ణవనవిహా
రము రెపపాటులో భస్మీభూతమయ్యెను. ఆపరిసరరాజ్యముల
నేలెడుభూధవు లీదుఃఖవార్తవిని విచారపరీతులైరి. ప్రసేనజిత్తు
నిచే నిర్మింపబడిన చందనవిగ్రహముగూడ నగ్నిశిఖలవాతబడి
ధగ్ధమైపోయెనేమోయని భయకంపితులైరి. కాని యీవిషాద
సంభవముజరిగిన నాల్గయిదుదినములకు నారలాప్రదేశమును
బరిశీలించుచుండ ప్రాగ్దిశగానున్న యొక చిన్నవిహారమున
బరిరక్షితమై యా చందనపుబొమ్మ గాన్పించెను! ఆనృపాలురు
విస్మయులై తత్క్షణమే జాతవనవిహారమును బునర్నిర్మాణ
మొనర్ప మొదలుపెట్టిరి. రెండంతరములు పూర్తియైన పిమ్మట
మరల నావిగ్రహమును గొనిపోయి యందుంచిరి.

సువర్ణవనవిహారమును గాంచినంతనే మన ఫాహియాను
టోచింగుల కనివార్యమగు దుఃఖ మతిశయిల్లెను. పాపము!
మన ప్రయాణికుల కీవిహారమును వీక్షించుట కిదియె తొలి
సారి. ఇరువదియైదు దీర్ఘవర్షములు లోకైకపూజ్యుడగు బుద్ధ
భగవానున కావాసభూమియై యతులవైభవమున దనరారి

జగద్విఖ్యాతిగనిన విహారము నేడు పాడువడి శూన్యగేహమై వెలవెల బోవుచున్నది. లోకకల్యాణు డందుగానబడడు, అని తొల్లిటివైభవమును దలపోసి యాపథికులు కన్నుల నీరు వెట్టుకొనిరి. వారిహృదంతరాళముల అనివార్యముగ విచార భావములు తరంగితమయ్యెను. బుద్ధభగవాను డవతరించిన యీపుణ్యభూమిని జన్మింపక యెచ్చటనో మొరటుదేశమున బుట్టి మందభాగ్యుల మైతిమే యని యాపాంథులు విల పించిరి. వారి ప్రస్తుతావస్థకూడ వారలకు మరింత దుఃఖ భాజన మయ్యెను. వారిట్లు చింతింపసాగిరి. "బౌద్ధధర్మముల నరయుటకై కడుదూరమునుండి యీ యార్యావర్తనమునకు బయలువెడలితిమి. ఎన్నియోశ్రమల బడితిమి. పాషాణభూ యిష్ఠమగు పెక్కురాజ్యముల నిర్గమించితిమి. దుర్గమంబగు నెడారుల దాటితిమి. మార్గమధ్యమున గొందర సోదర శ్రమణకుల గోల్పోయితిమి. మార్గశ్రమంబు భరింపజాలక భీతిల్లి కొందరు గమ్యస్థానమునుజేరకమునుపే వెనుకదారి పట్టిరి. పలుకష్టములగడచి పెద్దకాలమునకీ భారతవర్షమును జేరు కొంటిమి. కాని యా శాక్యసింహుని గన్నులారజూచుభాగ్యము లేకపోయినది." అని తలపోసి యశ్రువులరాల్చిరి.

ఇంతలో నెవ్వరో నూతనశ్రమణకు లరుదెంచిరనువార్త వినినతోడనే సువర్ణవనవిహారమున నివసించు భిక్షువులు బిలబిలాడుచు గృహాంతరసీమలనుండి వెలువడి మనయాత్రికుల జుట్టునుమూగి వారి నీక్రింది విధమున బ్రశ్నించిరి.

శ్రమణకులు— "పథికులారా! ఎచ్చటనుండి మీరాక? మీనివాస మేది?"

బాటసారులు— "అయ్యా! మేము చీనా సామ్రాజ్యమున నివసించువారము. అందుండియే వచ్చుచుంటిమి.

బౌద్ధభిక్షువు లాపథికులమాటల నాలకించి విభ్రాంతులై "ఎచ్చటి చీనాసామ్రాజ్యము! ఎచ్చటియార్యావర్తము! అంత దవ్వులనుండి బౌద్ధధర్మముల నెఱుగుటకై యీ భారతరాజ్యమున కేగుటయా! మేమింతకాలమునుండి యీ విహార భూముల నివసించుచుంటిమిగాని హన్నురాజ్యమునుండి బౌద్ధ మతావలంబులు వచ్చినజాడ లెఱుగము!" అని యాశ్చర్యమగ్నులైరి.

జాతవనవిహారమునకు బశ్చిమోత్తరముగ నాలుగు లీలలదూరమున "చక్షుప్రదాయిని" (లేక అంధవిమోచని) యని పిల్వబడునుపవన మొకటిగలదు. పూర్వమీ యారామ ప్రదేశమున నైదువందలమంది గ్రుడ్డివారలు నివసించు చుండువారు. బుద్ధభగవానుడీ వికలాంగులయెడ జాలిగొని వారికిబౌద్ధధర్మముల నుపదేశించి వారియంధత్వమును బాపెను. అంధు లానందపరవశులై తమ హస్తములనుండు దండముల నాచెంత భూమిపై గ్రుచ్చి బుద్ధుని పాదాబ్జములపై వ్రాలి నమస్కరించిరి. తోడనే యాదండములు చిత్రగతిని వేరుదొడగి గుబగుబజిగిర్చి శాఖలవై చిత్రుటిలో నున్నతముగ బెరిగి మహావృక్షము లయ్యెను. ఇవ్విధమున నీ ప్రాంతమంతయు మనోహరమగు వనవాటికయైనది. అంతటినుండియు నీయారామ

సీమకు "చక్షుప్రదాయిని" యను నామముగలిగినది. జాతవనవిహారమున వసియించు శ్రమణకు లనుదినమును మజ్జనభోజనములొనర్చి యా యుపవనమునజేరి ధ్యాననిష్ఠల దేలుచు కాలముగడుపుచుందురు.

ఈ విహారమున కీశాన్యభాగమున నారేడులీలలదూర మున 'వైశాఖ'* యను భిక్షుణిచే నిర్మింపబడిన విహార మొకటి గలదు. మున్నొకమారు బుద్ధుడును నాతని పరివ్రాజకాగణ మును యీ విహారమున కాహ్వానింపబడిరి. ఈ విహార మిప్పటి కిని గలదు.

సువర్ణవనవిహారము ముంగిట విశాలమై రమణీయమగు ప్రాంగణము గలదు. ఈ ముంగిలిభాగమునకు ప్రాక్పశ్చిమ పార్శ్వములందు రెం డున్నతద్వారము లున్నవి. ఈ వనభూమి నంతయు సువర్ణములతో గప్పి సుదత్తుడే యీ వనవాటికను గొనెను. జాతవనవిహార మీ యుపవనమధ్యభాగమున నున్నది. మానవాళికి బౌద్ధమతధర్మముల నుపదేశించుచు బెక్కండ్రకు బౌద్ధదీక్ష నిచ్చుచు శాక్యసింహు డీ యారామ ప్రదేశమున చిరకాలము వసియించెను. ఆత డాసీనుడైన తావులందును, నడచిన దారులందును స్తూపములు నిర్మింపబడి యున్నవి. ఈ స్తూపము లన్నిటికిని బ్రత్యేకనామములు గలవు. ప్రతి స్తూపనామమును స్తూపోపరిభాగమున జిత్రింపబడి యున్నది. బుద్ధునిపై బ్రహ్మహత్యాదోష మాపాదించుటకు సుందరుడను బ్రాహ్మణుడు ప్రాణత్యాగము గావించుకొనిన దిచ్చటనే.

* అనాథపిండికుని యర్ధాంగి. భిక్షుణి యయ్యెను.

K. S. Murty



శాక్యసింహుడు తొంబదియారు భిన్నశాఖలకు జెందిన విమతస్థులతో ప్రచండమతవాదముసల్పి వారినోడించిన తావును ఇచ్చటనే గలదు. ఈప్రదేశము జాతవనవిహార పూర్వద్వారమునకు డెబ్బదిబారలదూరమున రాచబాటకు బశ్చిమముగ నున్నది. ఈవాగ్యుద్ధమును జూచుటకై యీ రాజ్యమేలు నృపవరుడు తన యమాత్యగణసేవకానీకములతో నాప్రదేశమునకు గదలిపోయెను. నాటిసభాస్థలి అసంఖ్యాకములగు జనసమూహములతో గ్రిక్కిరిసిపోయినది.

ఆ తరుణమున 'చంచమణ' యను నొక క్షుద్రవనిత బుద్ధునిజూచి యసూయాగ్రస్తయై నవమాసస్ఫూర్తియగు చూలాలివలెయుడుపుల దాల్చి యా మహాజనసంఘము మ్రోల నిల్చి నిర్భీతయై బుద్ధుడు తన్నుగామించి బౌద్ధనియమముల మంటగల్పెనని యరచుచు శాక్యసింహుని నిందలపాలుగావింప జూచెను. అంతట శచీపతి త్వరితగతి నొక మూషికరూపమును దాల్చి యామె కటిప్రదేశమున కెగబ్రాకి కృత్రిమోదరమును బెంచుటకై యావనిత యెత్తుగానిడిన వస్త్రచయమును దెగగొఱికి తునియలుగావించి నేల బడవైచెను. సభాస్తారు లెల్లరు విభ్రాంతులై యీ యద్భుతసంభవమును దిలకింపసాగిరి. పృథివి యంతట పెటిల్లున బీటవారెను. ఆపాపి యామహాగహ్వరమున గ్రుంగి యదృశ్యమైపోయినది. దేవదత్తుడు* నిట్లే

* ఆనందుని సోదరుడు. శాక్యసింహునికి మిక్కిలి సమీపబంధుగు. ఈతడు బుద్ధునియెడల ప్రబలవిరోధమును బాటించి యాతనిబరిమార్ప బహుళప్రయత్నము లొనర్చెను. పూర్వజన్మమునగూడ వీ రిరువురును శత్రువులే.

విపలిప్తమగు నఖములతో సిద్ధార్థునకు హానియొనర్చబోయి యధోలోకమున మణగిపోయెను. ఆప్రదేశమును ఈ విహార పరిసరములందే గలదు.

ఈ సంఘటనములు జరిగిన తావులం దీప్రాంతవాసులు జ్ఞాపకార్థమై గురుతుల నిడిరి. బుద్ధుడు మతాంతరులతో వాదమునెరపిన ప్రదేశమున నరువదియడుగుల యున్నతిగల్గిన విహార మొకటి గట్టబడియున్నది. అందాసీనుడై యుండినట్లు చిత్రింపబడిన బుద్ధవిగ్రహము గలదు.

సువర్ణవనవిహారమున కెదురుగ బ్రాహ్మణమతస్థులచే గట్టింపబడిన దేవాలయ మొకటిగలదు. ఇది రాజబాటకు దూర్పుదెసగ నున్నది. దీనియె త్తరువదియడుగులుండును. దీనికే "ఛాయాచ్ఛాదిత" దేవళ మని పేరు. దీని కీనామ మెట్లుగల్గెనో తెల్పుటకొరకు చిన్నగాథ గలదు. సూర్యుడు పశ్చిమాకాశ వీధుల సంచరించునపుడు జాతవనవిహారచ్ఛాయ లీ దేవళముపై బడి దానిని గప్పివేయును. కాని సహస్రకిరణుడు తూర్పుదెస నున్నప్పు డీ దేవాలయపునీడలు విహారముపై బడక యుత్తరముగ బ్రసరించును. బ్రాహ్మణమతావలంబులు తమ దేవాలయమును దుడిచి సలిలములజల్లి ధూపదీపనైవేద్యములచే నందుప విష్టుడైన దేవు నారాధించుటకై యర్చకుల నియమించిరి. కాని రాత్రులందు బ్రాహ్మణ దేవళమున నెల్గింపబడెడు దీపము

ఉత్తరజన్మములందైన నీవైరము చల్లారలేదు. శాక్యసింహుని ప్రాణములగొన నీతడు పలుసారులు ప్రయత్నించియు విఫలమనోరథుడై తుదకు దానె భంగపడి దారుణమరణమునకు గురియై మ్రగ్గెను.

లద్భుతముగ ప్రభాతమగుసరికి విహారము గాన్పింపజొచ్చెను. మతాంతరు లీ విపరీతసంభవమునకు క్రోధోద్రిక్తులై మండి పడుచు "ఇది శ్రమణకులు గావించు చౌర్యము. వీరు మా దేవాలయమున వెల్గింపబడుదీపముల నిశాసమయమున మెల్లగ గొనిపోయి తమ విహారమున బెట్టుకొనుచున్నారు. అయినను మే మింతటితో మా యారాధనల విరమించుకొను వారము గాము" అని నిప్పులుగ్రక్కుచు "ఈరేయి మా దీపముల నెట్లుగొనిపోయెదరో జూచెదముగాక !" యని పల్కి బ్రాహ్మణులందరును నాటిరాత్రి తామే యా దేవాలయమున గావలిగాయజొచ్చిరి. అర్ధరాత్రమగుసరికి నాకస్మికముగ తమచే నారాధింపబడు దేవతలె గిల్లున నక్షత్రపథమునుండి దిగి వారు చూచుచుండగనే దేవళమునుజొచ్చి దీపములగొనిపోయి విహారమునకు ప్రదక్షిణము లొనర్చి లోనికిజని బుద్ధునకు హారతులిచ్చి యదృశ్యులైరి. మంత్రశక్తిచే గట్టువడిన కీలుబొమ్మలవలె బ్రాహ్మణు లాసంభవమును దిలకించి స్తంభితులై పోయిరి. శాక్యసింహుని యద్భుతమహిమకు రిచ్చవడి యా ద్విజు లంతటనుండియు దమసంసారముల ద్యజించి బౌద్ధమతావలంబులై సన్యాసవృత్తిని స్వీకరించి బుద్ధునియనుచరులైరి.

ఈకాలమున జాతవనవిహారమునకు జుట్టును దొంబది యెనిమిదిబౌద్ధమఠము లుండెడివనియును వానిలో నొకదాని యందు దప్ప దక్కటిమఠము లన్నిటియందును భిక్షువులు నివసించుచుండెడివా రనియు నీప్రాంతవాసులు జెప్పెదరు.

ఈ "మధ్యదేశమున*" తొంబదియారు భిన్నమతశాఖలు గలవు. ఈ వివిధమతశాఖీయులు, ఇహపరలోకములు వేరుగనున్నవనియును, నార్వటికిని అత్యంత పరస్పరసంబంధము గలదనియును మున్నగు సిద్ధాంతముల విశ్వసించెదరు. ప్రతి శాఖకును అసంఖ్యాకులగు ననుచరులు గలరు. బౌద్ధభిక్షువులవలెనె వీరును తిరిపెమెత్తి తమజీవయాత్రల గడపెదరు. కాని భిక్షాటన మొనర్చునపుడు వీరు శ్రమణకులవలె కక్షపాలల తమ వెంట గొనిపోవరు. వీరును పాంథజనులసౌకర్యార్థమై మనుష్య సంచారమే లేనిమార్గములం దచ్చటచ్చట ధర్మశాలల గట్టించి యందు దేశాటన మొనర్చు తెరువరులకును, నతిథులై యరుదెంచు బౌద్ధశ్రమణకులకును అన్నపానీయములొసగియు, విశ్రాంతిగొనుటకు పర్యంకశయ్యాదుల సమకూర్చియున్నాదరింతురు. పథికు లీవిశ్రాంతిగృహములలో నివసింపనగు నిర్ణీత కాలమునమాత్ర మించుక తారతమ్యముగలదు., బౌద్ధధర్మశాలలకును వీనికినిగల వ్యత్యాస మిందేగలదు. దేవదత్తునకు గూడ నిచ్చట నెందరో యనుయాయులు గలరు. వీరెల్లరు నింతకుము న్నవతరించిన బుద్ధత్రయమును సేవింతురుగాని శాక్యసింహు నారాధింపరు.

శ్రావస్తిపట్టణమున కాగ్నేయభాగమున నొక యర

---

* ఈ సందర్భమున ఫాహియాను యాత్రికునిచే వర్ణింపఁబడునది మధ్యభారతమో లేక తాను ప్రకృతము సందర్శించుచుండిన కోసలరాజ్యమో దెలియవచ్చుటలేదు. పూర్వాపరసందర్భములఁబట్టి కోసలదేశమే యై యుండునని తోచుచున్నది.

క్రోసు దూరమున విరూఢాహ నృపాలుడు♦ తనసేనల వెంట గొని కపిలవస్తునగరముపై దండెత్తివచ్చుచుండ బుద్ధు డాతని దారసిల్లిన*చోటు గలదు. ఇచ్చోట నొకస్తూపము నిర్మింప బడియున్నది.

---

♦ ఈతనికి వైడూర్యనృపుడను నామాంతరముగూడగలదు. ఈతడు కోసలరాజ్యమును బాలించురాజు. ప్రసేనజిత్తునితనయుడు. తనజనకుని మరణానంతర మీతడు కోసలరాజ్యసింహాసన మధిష్ఠించి శాక్యవంశీయులరాజధాని యగు కపిలవస్తునగరముపై దాడివెడలి యాపట్టణమును భస్మీభూత మొనర్చెను.

* వైడూర్యనృపుడు చతురంగబలసమేతుడై వచ్చుచుండ బుద్ధుడొక మహీరుహచ్ఛాయనునిలిచి యానృపాలుని జెవిబడునట్లు కంఠమెత్తి యిట్లని పల్కదొడంగెను. "ఈ శుద్రితరువు నాకాశ్రియమిచ్చుటలేదు. కాని నా బంధుమిత్రుల కొదవనున్న యాపదల దలచుకొనిన నాకిదియె నెలవగుచున్నది." ఆమాటలవిని విరూఢాహుడు మిగులజాలినొంది తనసైన్యముల వెనుకకు మరలించుకొని వెడలిపోయెను. కాని యీ రాజేశ్వరుడు దన వైరమును మాత్రము విడువలేదు. కొంతకాలమైన పిదప మరల ప్రచండ సైన్యములతో నానగరముపైబడి దానిని విధ్వంసమొనర్చెను.

# ఇరువదియొకటవ ప్రకరణము

## బుద్ధత్రయము.

శ్రావస్తినగరమును వీడి, మనపాంథులు పశ్చిమాభిముఖులై యేబదిలీలదూర మరిగి కాశ్యపబుద్ధుని జన్మస్థానమగు 'టూవెయి' * పట్టణమును జేరిరి. కాశ్యపుడు తన జనకుని గలిసికొనిన చోటను, తుదకాతడు నిర్యాణమునొందిన తావునను స్తూపములు గట్టబడియున్నవి. కాశ్యపతథాగతుని + కళేబర శిథిలముపై గూడ నొక మహాస్తూపము నిర్మింపబడియున్నది.

శ్రావస్తినగరమున కాగ్నేయపార్శ్వమున పండ్రెండు యోజనముల దూరమున "నాభిగ" ♦ యను బట్టణ మొకటి గలదు. ఇదియె క్రకుచండబుద్ధుడు జన్మించిన తావు.

---

* సాహరహత్తునకు బశ్చిమముగ నుండు 'తాద్వా' గ్రామమే యీ "టూవెయి" పట్టణమై యుండనోపునని చరిత్రకారు లూహించుచున్నారు. కాని కాశ్యపుడు బుట్టినచోటు వారణాసియని పెక్కండ్రభిప్రాయము.

+ మహిమాఢ్యులగు బుద్ధులకొసంగెడు బిరుదనామము. బౌద్ధగ్రంథములలో కాశ్యపుని నిర్యాణవృత్తాంత మిట్లు వర్ణింపబడినది. కాశ్యపుడవసానము నొందిన పిమ్మట యాతని మృతదేహమున కగ్నిసంస్కారము గావింపబడెను. కాని యాతని శల్యపంజరముమాత్ర మగ్నిదగ్ధముగాక యట్లే నిలిచియుండెను. అంతట జంబూద్వీపవాసులందరును దాని కెంతయు నచ్చెరువంది యాబౌద్ధయతిశల్యముల ప్రోవు నొకచోట నిక్షిప్తమొనర్చి యచ్చట బ్రహ్మాండమగుస్తూపమును గట్టించిరి. దానినిడివి యొక యోజనముండునట!

♦ క్రకుచండుని జన్మక్షేత్రము మేఖలానగరమని కొందరి యభిప్రాయము.

శ్రావస్తికుత్తరముగ నొకయోజన మేగినచో కనకముని జన్మించిన పట్టణము గాన్పించును. వీరు తమ జనకుల సందర్శించిన తావులందును, నిర్యాణమునొందిన క్షేత్రములందును స్తూపములు గలవు.

---

# ఇరువది రెండవ ప్రకరణము

## కపిలవస్తు.

శ్రావస్తినుండి తూర్పుదిశగా మరలి మనపాంథులుకపిల వస్తునగరమునకు బోయిరి. ఇది శ్రావస్తిపట్టణమున కొక్క యోజనముదూరమున నుండును. ఈ పట్టణావస్థ కడుసంతాపకరముగ నున్నది. ఈనగరమంతయు నేను పాడువడి శిథిలమై, నిర్మానుష్యమగు యెడారివలె నున్నది. కొలదిమంది బౌద్ధభిక్షువులును, పదిపండ్రెండు నిరుపేద కుటుంబములును దక్క యీ విశాలనగరమున నెచ్చటను మనుష్య సంచారమే గానరాదు. పూర్వకాలమున శుద్ధోదన మహీపాలుని* సౌధముగట్టబడినచోట నేడాతని సతీసుతులశిలావిగ్రహములు మాత్రము గాన్పించుచున్నవి. రాజప్రాసాదమంతయు నంతరించి పోయినది. బుద్ధుడు ధవళకురఙ్గము నెక్కివచ్చి తన

* శాక్యసింహునితండ్రి.

గర్భమును బ్రవేశించినట్లు మాయాదేవి (బుద్ధునితల్లి)కలగనిన తావును, సిద్ధార్థుడు రోగపీడితునిగాంచి, తన యశ్వశకటమును గిరుక్కున వెనుకకు మరలించినచోటును, అసితమహర్షి* బాల సిద్ధార్థునియొడలిపై గలయవతారచిహ్నముల బరిశీలించిన ప్రదేశమును, దేవదత్తుని ముష్టిఘాతములచే గూలిన గజయూథకళేబరమును, యువరాజగుసిద్ధార్థుడవలీల పిడికిటనెత్తివిసరివైచిన♦ ప్రాంతమును, బాల్యక్రీడలదేలుచునొక్కనాడు శాక్యసింహుడు దన కార్ముకమును‡సంధించి యమ్మునేయ, నాశరము, మూడు యోజనములదూరమునబడి,పుడమిని జీల్చుకొని భూగర్భమును

---

* శుద్ధోదనమహీపాలుని తండ్రి రాజ్యకాలమున మంత్రిపదవి నలంకరించినవాడు. పాళీభాషలో నీతనికి "కళాదేవళు"డని పేరు.

♦ వైశాలీనగరమునుబాలించు లిచ్ఛవీవంశనృపుడు. శుద్ధోదనునితనయుడగు సిద్ధార్థునకు సుందరమగు నొక కరిశాబకమును కానుకగానంపెను. ఈ గజకిశోరము కపిలవస్తునగరమును సమీపించుచుండ నది దేవదత్తుని గంటబడెను. దానినిజూచి యోర్వజాలక దేవదత్తుడొక్క ముష్టిఘాతమున నామత్తగజమును హతముగావించెను. ఆనందుడు (శాక్యసింహుని సవతితల్లి కుమారుడు) ఆదారినిబోవుచు, మార్గమున కడ్డుగాబడియుంటచే యామృగకళేబరము మరియొకప్రక్క కీడ్చెను. మరికొంతవడికి సిద్ధార్థకుమారుడామార్గమున జనుచు విగతజీవియైయున్న యాగజయూథమును గాంచి, దానిపుచ్ఛమును పిడికిటబట్టి విసరివైవ, నది పైకెగసి యేడు ప్రాకారముల దాటి యావలబడెను. ఆదేహము నేలపైబడినచోట పల్లమై, నాభీలమగు నొక యగడ్తయేర్పడెను. శాక్యసింహు డప్పటికి పదేండ్లబాలుడు.

‡ కార్ముకము. బాల్యక్రీడాసక్తులై యొక్కనాడు, శాక్యబాలురు శరముల విడచుచు నాడుకొనుచుండ సిద్ధార్థుడు తన తోడిబాలురను మించి తనబాణము మూడు క్రోశముల దూరమున బడునట్లు విడిచి, యాతని ధను

బ్రవేశింప, నచ్చట జలధారలు గుబగుబ నిర్గమింపదొడగిన స్థలమును, శాక్యసింహునకు జ్ఞానోదయమైనపిదప, నాతడు దన ప్రియజనకునికడ కేగి యాతని సందర్శించిన తావును, నన్నూరుశాక్యకుమారు లొక్కపెట్టున దమ దారాసుతుల వీడి, యుపాలి ♦ పాదముల కెరగిన †ప్రదేశమును, శుద్ధోదన మహీపాలుడైన జొరరాకుండ నల్వురు దేవవిభులును ప్రతీహారులై మందిరద్వారములకడ గావలిగాయుచుండ బుద్ధభగవానుడు దేవతానీకములకు బౌద్ధధర్మముల నుపదేశించిన పావనక్షేత్రమును, శాక్యసింహుడు ప్రాగ్దిశాభిముఖుడై న్యగ్రోధ పాదపముక్రింద నాసీనుడైయుండ, నాతని పినతల్లియగు మహాప్రజాపతి యొకసంఘాళినిదెచ్చి (సన్యాసులు దొడుగుకొను యంగీ) యాతనికికానుకగానొసగిన పవిత్రవాటికను, వైడూర్య నృపాలుడు శాక్యవంశమున బుట్టిన నారీమణులనెల్ల తనఖడ్గ ధారల కెరగావింప వా రసువులు బాసి స్వర్గధామమును

---

ర్విద్యానైపుణ్యమును బ్రదర్శించెను. బుద్ధుడప్పటికి పదునేడేండ్ల ప్రాయము వాడు. ఆబాణము మూడుక్రోశములరిగి యచ్చటబడి భూమిని భేదించుకొని పృధ్వీగర్భమును బ్రవేశింప నచ్చట జలధారలు నిర్గమింపదొడగెను. వీని కీప్రాంతవాసులు "శరధార"లని పేరిడిరి.

♦ ఈతడొక బౌద్ధ సన్యాసి. శూద్రవర్ణమున జన్మించినవాడు (మంగలి) నీచజన్ముడైనను సుజ్ఞాన శీలుడయ్యెనేని పూజనీయుడని బౌద్ధమత ముద్ఘోషించినది. శిక్షణనియమముల బాగుగ నెఱిగినవాడని యీతడు శాక్యసింహునిచే గొనియాడబడెను. ప్రథమబౌద్ధమత మహాసభానిర్మాతలలో నీతడు ప్రాధాన్యుడు. వినయగ్రంధముల రచించిన దీతడేయని ప్రతీతిగూడగలదు.

† ఆసమయమున పృధ్వీతలమంతయు నారుసార్లు కంపించెను.

జేరకమున్న శ్రోత్రపాణులైన * పవిత్ర భూమిని మన పాంథు లీ కపిలవస్తు పట్టణపరిసరములందు వీక్షించిరి.

కపిలవస్తునగరమున కీశాన్యభాగమున బెక్కుక్రోశములదూరమున తన్నగరాధీశుల మాన్యక్షేత్రములు గలవు. ఇచ్చటనే యొక మహీరుహచ్ఛాయను గూర్చుండి నృపకుమారుడు(సిద్ధార్థుడు)కృషీవళులు పొలముదున్నుట నవలోకించెను.

ఈ పట్టణమునకు దూర్పువైపున నైదుక్రోశముల దూరమున "లంబిని" యను నారామ మొకటి గలదు. కపిలవస్తు నృపాలునియర్థాంగి కమలాకరమును జొచ్చి జలకమాడి శాక్యసింహునిగనిన దిచ్చోటనే. ఆ సతీమణి సరోవరజలముల స్నాన మొనర్చి యుత్తరపుటొడ్డు నెక్కి యిరువది యడుగులు వైచి యచ్చట నిలిచి తన హస్తముల జాపి యాచెంతనున్న

* జన్మరహితులగు యతీంద్రులకు శ్రోతపాణులని పేరు. వైదూర్య మహీపాలుడు శాక్యవంశ జన్ములగు వయిదువందల కన్యకామణులు తన యంతఃపుర కామినులగుట కిచ్చగింపక దిరస్కరించుట చే క్రుద్ధుడై వారల నొక సరోవరతీరమునకు గొనిపోయి నిర్దయుడై వారలపాదములను హస్తములను ఖండించి విడిచెను. దయాళుడగు బుద్ధుడు వారియాక్రందనధ్వనుల దవ్వులనుండి విని యొక్కపరుగున నావికలాంగుల చెంతకేగి వారి నోదార్చి చికిత్సయొనర్చి త్రుటిలో వారి గాయముల మాన్పెను. పిమ్మట వాయువతీ మణులకు బౌద్ధధర్మముల నుపదేశించెను. ఆకన్నియలు హర్షముతో బౌద్ధ దీక్షగైకొని ప్రాణముల విడిచిరి. పిదప చతుర్మహీపాలుడు రాజ్యమేలుచుండ నీరాచపట్టియిలు భూలోకమున జన్మించి యొక్కనాడు సువర్ణవన విహారమునకు జని బుద్ధుని దర్శించిరి. శాక్యసింహు డనుగ్రహించి వారికి కైవల్యపథము నొసగెను.

వృక్షశాఖ నొకదానిని కరమున గీలించి ప్రాగ్దిశాభిముఖయై కుమారునిగనెను పుడమిపై బడినంతనే యాపాప డేడడుగులు నడచెను. ఉరగ వల్లభు లిద్దరు వానిని జలక మాడించిరి. ఆపసికుమారునకు నీళ్లువోసినచోట నొకపెద్దబావి యయ్యెను. ఈ కూపోదకములను రాజ్ఞి స్నాన మొనర్చిన సరోవరజలములను ఇచ్చటి భిక్షువులు పావనోదకములుగ భావింతురు.

శాక్యసింహునకు జ్ఞానోదయమైన తావును, బుద్ధుడు బౌద్ధధర్మములను లోకమున బ్రతిష్ఠింప మొదలిడిన చోటును, మతవాదమున నాతడు విమతస్థుల పరాభూతుల గావించినప్రదే శమును, తనతల్లికి బౌద్ధధర్మముల నుపదేశించుటకై గౌతముడు త్రియస్త్రింశత్స్వర్గమున కేగి భూమండలమునకు దిగినప్రాంత మును, బౌద్ధ మతావలంబులకు మిగుల పావన క్షేత్రములు. తక్కటిప్రాంతము లాత డప్పుడప్పుడు ప్రదర్శించిన యమానుష శక్తులంబట్టి ప్రసిద్ధిగాంచినవి.

కపిలవస్తురాజ్యమంతయు నేడు పాడువడి జనశూన్యమై నిర్జరారణ్యమువలె భీతిగొల్పుచున్నది. దేశమంతయు సింహ శార్దూలాదివన్యమృగసంకీర్ణ మగుటచే ప్రమత్తులై యీ రాజ్యమున బ్రయాణ మొనర్చుట కడు నపాయకరము. ఇచ్చట పాంథు లత్యంత జాగరూకులై నడువవలయును.

---

# ఇరువదిమూడవ ప్రకరణము

## రామరాజ్యము.

కపిలవస్తునగరమున కైదు యోజనముల దూరమున "రామరాజ్యము" ♦ గలదు. ఇది 'లంబినీ' వనమునకు ప్రాగ్దిశగా నున్నది. ఈ రాజ్య మేలునృపుడు బుద్ధుని శల్యముల గొన్నిటి దెచ్చి వానికొరకొక స్తూపమును గట్టించి దానికి "రామస్తూప" మని పేరిడెను. దీనిచెంతనే పెద్దతటాక మొకటి గలదు. ఈ జలాశయమున నొక్కపాము నివసించుచుండును. ఈ యురగరాజమే యీ స్తూపమునకు బూజ లొనర్చుచు నేయింబవళ్లు దానికి గావలిగాయుచుండును. అశోక సార్వభౌముడు పట్టాభిషిక్తుడైనంతనే బుద్ధుని శల్యజఖండములపై నిర్మింపబడిన అష్టస్తూపములను* బడగొట్టించి వానికి బదులు యెనుబదినాలుగువేల †స్తూపముల గట్టింపనిచ్చగొని తక్కటి ప్రాంతములందునిర్మింపబడిన స్తూపముల నన్నిటిని చిదుకగొట్టించెను.అటుపిమ్మట అష్టస్తూపమగు రామస్తూపమునుకూడ

---

♦ దీనికి "రామగ్రామ"మను నామాంతరముగూడ గలదు. ఇది కపిలవస్తు కుసి నగరముల మధ్య నున్నది.

* బుద్ధుని శల్యము లెనిమిదిభాగములుగ విభజింపబడి ఎనిమిదిప్రాంతములకు గొనిపోబడినది. ఎనిమిదిచోట్లను ఎనిమిదిదిస్తూపములుగట్టింపబడెను.

† మానవుని శరీరమున నెనుబది నాలుగువేల పరమాణువు లుండునని యూహింపబడుటచే యశోకనృపాలు డీయెనుబదినాలుగువేలయణువులకు నెనుబదినాలుగువేలస్తూపముల గట్టింపవలెనని సంకల్పించెను.

బడగొట్టింప నుద్యుక్తుడై యిచ్చటికరుదెంచెను. ఆత డీప్రదేశ మును సమీపించినంతనే యాదాపున కమలాకరమున నివసించుచున్న ఉరగరాజ మానృపుని కట్టెదుట నిలిచి తటాక గర్భముననున్న దనప్రాసాదమున కాతని బిలుచుకొనిపోయి తానాస్తూపమునకు కానుకగ నొసగుటకై తెచ్చియుంచిన వస్తుచయము నాతనికి జూపి "ఓనృపోత్తమా! వీని మరపించు వస్తువుల దెచ్చి యీ స్తూపమున కర్పింపగలవేని. దీని బడగొట్టింపుము. నే నడ్డుసేయ"ననిపల్కి యాయహివల్లభు డదృశ్యు డయ్యెను. అశోకుడాశ్చర్యనిమగ్నుడై యట్టివస్తుసముదయము భూవలయముననెచ్చటను గానరాదని యెఱిగి హతాశుడై స్తూపమును బెకలింపకయె వెడలిపోయెను.

కొంతకాలమున కీస్తూపపరిసరము లన్నియు కసవుచే నలముకొనిపోయెను. స్తూపమును దుడిచి సలిలమును జల్లువా రెవ్వరును లేకపోయిరి. పూజాపునస్కారములు శూన్యమ య్యెను. అంతట నాప్రాంతవనమున నివసించు ఏనుగు లనుదినమును దమ తుండంబులతో సలిలముల గొనివచ్చి యా ప్రదేశమున జల్లి చిత్రవిచిత్రములగు కుసుమములదెచ్చి యాస్తూపమున కర్పించి వెడలుచుండెను. ఇట్లుండ నొకనా డీరామరాజ్యమున వసియించు బౌద్ధబిక్షు వొక్కడీస్తూపమును దర్శింప నరుదెంచుచు దూరమునుండి యా గజసంతతుల జూచి నివ్వెరపడి భీతావహుడై యాప్రక్కనున్న చెట్లమాటున డాగి యాకుంజరసమూహములచెయిదముల నవలోకింపజొచ్చెను. ఆ ఏనుగులగుంపు యెప్పటివలె సరోవరమునుండి నీరముల

దెచ్చి యారాధనకృత్యములు నిర్వర్తించుచుండెను. నియుక్త విధిని ఆదంతావళములు రామస్తూపమునకు పూజలొనర్చుట గాంచి భిక్షువు, "ఆహా! యింతటి మహాస్తూపమునకు బూజ లొనర్చుటకు కడకు ద్విరదసమూహములు దిక్కయ్యెనా? ఎంతగతిపట్టినది''అని విచారపరీతుడై తక్షణమె దానుగైకొనిన శపథముల*విడనాడి శ్రామణేరుడై యాస్తూపమున కారాదనల సల్పదొడగెను. అచ్చట దట్టముగ బెరిగియున్నకసవును, ముండ్ల పొదలను దొలగించి యాస్తూపపరిసరము లన్నియు శుభ్రి మొనర్చి దర్శనపాత్రముగ జేసెను. అంతటితో తనివినొందక యారాజ్యమును బాలించు రాజునొద్దకుబోయి వేయివిధముల నాతని బ్రార్థించి యాతని తోడ్పాటున నచ్చట నొక సంఘారామమును గట్టించి యామఠమునకు దానె యధిపతి యయ్యెను. ఈ సంఘారామము నేటికిని గలదు. అందు భిక్షువు లిప్పటికిని నివసించుచున్నారు.

ఇవి చిరకాలమునాటి సంభవములు గావు. ఇటీ వలి వృత్తాంతములు. నాటినుండి నేటిదనుక యీ సంఘారామ మునకు శ్రామణేరులే యధపతులుగ నుండిరి.

---

* ఈతడు విడనాడిన శపథము లెవ్వియో ఫాహియాను మనకు దెల్పి యుండలేదు.

# ఇరువదినాల్గవ ప్రకరణము

## శాక్యసింహుడు తుదిసారి దారాసుతులవీడిన తావు.

ఇచ్చటకు ప్రాగ్దిశగా మూడు యోజనముల దూరమున సిద్ధార్థకుమారుడు తన ధవళతురంగమును, రథసారధియగు చన్నుని × పురమునకు మరలిపొమ్మని వెనుకకు బంపివైచిన చోటుగలదు. ఇచ్చట నొకస్తూపము కూడ నిర్మింపబడి యున్నది.

ఇచ్చటినుండి మనపాంథులు మరల తూర్పుదెసగా మరలి మరినాలుగు యోజనము లరిగి అంగార* (బొగ్గుల) స్తూపమును గాంచిరి.

పిమ్మట నీ తెరువరులు ప్రాగ్దిశాభిముఖులై పండ్రెండు యోజనములు చని కుశనగరమును ♦ జేరిరి. ఈ నగరమున

---

× ఇదిలోకకల్యాణమునకై శాక్యసింహు డంతఃపురమును వీడి చనిననాటిరేయి జరిగిన వృత్తాంతము. ఈ యుత్తమాశ్వ మానాడు సంతోషాతిరేకమున ముల్లోకములును దద్దరిల్లిపడునట్లు హేషాధ్వానము లొనర్చెను. సిద్ధార్థునిచే విడనాడబడి దుఃఖితయై యీ వాజి యశ్వశాలకు దిరిగిపోక యందే నిలచి తిరిగి తిరిగి శుష్కించి తుదకు విచారభరమున జీవముల బాసినది. ఈ హయరాజమునకు కంటకమని పేరు.

* దీనికే యింగలస్తూపమని పేరు. కొందరు చరిత్రకారులు దీనినే విభూతిస్తూపమని కూడ పేర్కొనియున్నారు. ఇది బుద్ధుని మృతదేహమున కగ్నిసంస్కారంబు గావించినచోట గట్టబడిన స్తూపము.

♦ అచ్చట కుశలు విరివిగా బెరుగుచుండుటచే నా పట్టణమునకు కుశనగరమని పేరు గల్గెను. పాటలీపుత్రమునకు (పాట్నా) పశ్చిమోత్తరమున కూసియా యనుగ్రామసమీపమున నీనగర శిథిలము లింకనుగానవచ్చెడిని.

కుత్తరపార్శ్వమున ప్రవహించు హిరణ్యావతీనదీతటమున రెండు సాలవృక్షములనడుమ బుద్ధు డుత్తరశిరస్కుగా నిర్యాణము నొందెను. శాక్యసింహునిచే బౌద్ధమతదీక్ష యొసగ బడిన శిష్యకోటిలో గట్టకడపటివాడగు సుభద్రుడను* బ్రాహ్మణుడు పరిపూర్ణుడై యటుపిమ్మట యర్హతుడైన చోటును, సువర్ణమణివిరాజిత మగునొక యనంతశయనమున నుంచి నేడు దినము లాలోకారాధ్యుని మృతదేహమునకు బూజలొనర్చిన తావును +, వజ్రపాణి,తన వజ్రపుగదను బరిత్యజించిన ×యవనియు, అష్టమహీపాలురును, అగ్నిదగ్ధమైన శాక్యసింహుని

---

* వారణాసీ పట్టణమున నివసించుచుండిన యొకానొక విప్రుడు. ఈతడు బౌద్ధధర్మముల నెరుగుటకై యొకనాడు శాక్యసింహునికడకేగెను. అప్పటికీతడు నూటయిరువది యేండ్ల వయోవృద్ధుడు. ఆనాటిరేయి బుద్ధుడు దివికేగుచుండెను. ఇది తరిగాదని యానందుడీ వృద్ధబ్రాహ్మణుని వెనుకకు బంపివేయుచుండ బుద్ధుడాతనివారించి యాముదుసలిని తన యొద్దకు దీసికొనిరానియమించి యాతనికి బౌద్ధధర్మముల నుపదేశించెను. బ్రాహ్మణుడు సంతసించి తత్క్షణమే బౌద్ధదీక్షగైకొని ధన్యుడయ్యెను.

+ ఇది మహాచక్రవర్తుల మృతదేహములకు గావింపబడు మర్యాద. కుశనగరాధీశ్వరులు బుద్ధుని దేహమున కగ్నిసంస్కారము గావించుటకై తమ రాజసౌధమున గిరీటధారణ వైభవములకు గట్టింపబడిన దివ్య మందిరము నొసగి యద్దాని నత్యంత శోభాయమానముగ నలంకరించిరి. పిమ్మట నాతని పవిత్రశరీరమును కాంచన నిర్మితమగు నొక యనంతశయనమున నుంచిరి.

× ఈ గాథయొద్దియో స్పష్టముగ దెలియరాకున్నది. వజ్రపాణి యింద్రుని బిరుదనామము. ఇచ్చటి సందర్భమునుబట్టి యింద్రుడు శస్త్రపరిత్యాగియై బౌద్ధమతరక్షణకై బయలువెడలెనని యూహింపవలసియున్నది.

యస్తిశకలముల నెనిమిది భాగములుగ * విభాగించుకొనిన పుడమియు నిచ్చటనే గాననగును. ఈ తావులన్నియు స్తూప సందోహములతోడను, బౌద్ధమత శ్రేణులతోడను నలరారు చున్నవి.

అచ్చటచ్చట నివసించు సన్యాసికుటుంబములు దక్క యీనగరమందైనను జనులు విశేషసంఖ్యాకులు గానరారు. కపిలవస్తునగరమువలె నిదియు జనశూన్యమైయున్నది.

ఇచ్చటి కాగ్నేయముగ పండ్రెండు యోజనములదూర మున, తామును బుద్ధునివెంట స్వర్గధామమున కరుదెంతు మని లిచ్ఛలీ♦యోధగణ మాతని వెన్నాడిన ప్రదేశము గలదు. వలదని బుద్ధు డెంతచెప్పినను నా యోధాగ్రేసరులు తమ మూర్ఖత వీడి వెనుకకు మరలిపోరైరి. చేయునది లేక, శాక్యసింహు డంతట నొక మహాభీలమగు కందకమును నడుమ సృష్టించెను. ఆపరిఖాజలముల దాటి యా వీరులు ముందునకు సాగిపోజాలరైరి. బుద్ధుడు వారల యనురాగమున

---

* కుశ, పవ, వైశాలి మున్నగు అష్టరాజ్యనృపులు. ఈరాష్ట్రమును బాలించు నృపాలురును, అందందునివసించు బ్రాహ్మణులును, అస్తిచయము నంతయు దామె గొనిపోవలయునని ప్రతియొక్కరును నాసించి తమలో తాము తగవులాడుకొనజొచ్చిరి. కాని ద్రోణుడను బ్రాహ్మణుని హితవచన ములబాటించి యా శల్యాఖండముల నీ యెనమండుగురు నృపులును ఎనిమిది భాగములుగ బంచుకొనుట కిచ్ఛగించిరి.

♦ వైశాలీరాజ్యమున వసియించు యోధగణము. "లిచ్ఛలీ" యను యున్నతరాజవంశమున బుట్టిన నాయకవీరులు. వీరందరికంటె మున్ను గవీరె బౌద్ధమతమును స్వీకరించిరి.వీరికిబుద్ధునియందుగలయనురాగమునిరుపమానము

కెంతయు మెచ్చి, తన కక్షుపాలను వాత్సల్యచిహ్నముగ నా వీరనికాయమున కొసగి వారి సతీసుతులకడకు వారిని బంపివైచెను. పిదప నిచ్చోట నొక శిలాస్తంభము నిర్మింప బడినది. ఈ స్తంభోపరిభాగమున నీ విచిత్రవృత్తాంత మంతయు లిఖింపబడియున్నది.

---

# ఇరువదియైదవ ప్రకరణము

## వైశాలి - "శస్త్రపరివర్జిత స్తూపము."

కుశనగరమునువీడి మనపథికులు తిన్నగ బయనమై పోయి యచ్చటకు బదియోజనముల దూరముననున్న వైశాలీ నగరమును సమీపించిరి. ఇదియె వైశాలీరాజ్యమునకు రాజధాని. ఈపురమున కుత్తరభాగమున నొక వనవాటిక గలదు. శాక్యసింహునికి జిరకాల మావాసభూమియై తన రారిన రెండంతరముల విహారమును, ఆనందుని యర్ధశరీరముపై నిర్మింపబడిన యొక యున్నతస్తూపమును నిచ్చటనే గలవు. ఈ వైశాలీపట్టణమధ్యభాగమున "అంబపాళి"* యనువారాంగనచే

---

* ఈమె వైశాలీ నగరమున వసియించు నొక వేశ్య. ఈమెకు "ఆమరపాళి" యనియు "ఆమ్రదరిక" యనియు నామాంతరములుగలవు. బౌద్ధపౌరాణిక గ్రంథములయం దీమెనామము పెక్కుమారులు గానబడును. ఈమె పలుసార్లు యమలోకమును జవిచూచెను. నూరువేలమారులు బిచ్చకురాలుగను పదివేలసారులు కులటగను భూమండలమున జన్మించినది. కాశ్యప

బుద్ధుని గౌరవార్థమై కట్టింపబడినస్తూపము గలదు. ఈ పురమునకు దక్షిణదిగ్భాగమున నొక యరక్రోసుదూరమున రాచబాటకు బశ్చిమముగ బుద్ధుని యావాసమునకై యీమె దానముగనొసగిన యొకయారామముకూడ గలదు. తన నిర్యాణకాలము సమీపించినంతనే శాక్యసింహుడు తన శిష్యగణములతో పశ్చిమద్వారమును దాటి యీపురమును వీడిపోవుచు తటాలున వెనుకకు దిరిగి దక్షిణపార్శ్వమున గనుల పండువై విలసిల్లుచున్న వైశాలీనగరమును దిలకించి "నేనీ భూలోకమున దర్శించు ప్రదేశములలో నిదియె కడసారిప్రదేశము. నే నీలోకమున నిర్వర్తింపవలసిన కడసారి కృత్యముల నిందే నిర్వర్తించితి"నని తన శిష్యులతో బల్కెను. తరువాత కొంతకాలమున కచ్చోట నొకస్తూపము నిర్మింపబడినది.

ఈపట్టణమునకు బశ్చిమోత్తరముగ నొక యరమైలు దూరమున "శస్త్రపరివర్జితస్తూప''మన నామమున బరగుస్తూప మొకటిగలదు. దీని కానామ మెట్లుగల్గెనో వర్ణింపుచు బౌద్ధపురాణగ్రంథములలొనొక యైతిహ్యముగలదు. పూర్వముగంగానదీతటమున విశాలమగు రాజ్యమొకటి విలసిల్లుచుండెడిది. ఆ రాజ్యము నేలునృపవరునియుంపుడుకత్తె గర్భవతియై యొకనాడు

బుద్ధుని కాలమున సుగుణశీలయై వర్తిలుటచే నీమె దేవియై జన్మించి తుదకు వైశాలీనగరమున నొక యామ్రపాదపముక్రిందనుద్భవిల్లెను. కానియీజన్మమునగూడ మరలనామె దుష్పథగామియైవర్తిలి బింబిసారునివలన నొక పుత్రుని గాంచెను. బుద్ధుడామెపై జాలిగొని యామెకు హితముగరపి బౌద్ధధర్మముల నుపదేశించెను. అంతటనుండియు నీమె తన దురాచారముల విడనాడి పవిత్రజీవినియై భిక్షుణియై తుదకు నర్హత్వము నొందెను.

వికారాకృతిగలిగిన యొక మాంసపు ఖండమును గనెను. నృపుని రాణి యసూయాగ్రస్తయై "ఇట్టిమాంసపుశకల ముద్భవించు టెంతయు రాజ్యమునకరిష్ఠదాయక" మనినుడువుచు నాపలలము నొక పెట్టెలో వైచి యామంజూషమును గంగానదీప్రవాహమున జారవిడచెను. భాగ్యవశమున నా పేటిక విలాసార్థమై యాచెంగట నేమసలుచుండిన యొకానొక రాజవరేణ్యుని కంటబడెను నదీ జలముల మునుగుచు దేలుచు గొట్టుకొనివచ్చు నా పేటికను గాంచి యాత డాశ్చర్యనిమగ్నుడై, యందేమికలదో చూడ గుతూహలుడై తన పరిచారకులచే నామందసము నొడ్డునకు దీయించిదానినితనసౌధమునకుగొనిపోయిదాని తెరచిచూచెను. రాజునివ్వెరపడెను. సర్వాంగసౌష్ఠవముగలిగి ముద్దులుగుల్కెడు బాలసహస్ర మాపెట్టెయందు గాన్పించెను. అందులకు నృపాలుడు స్వాంతమున మిగుల సంతసింపుచు, నాపసిపాపల తన యింటనే యుంచుకొని కన్నకుమారులవలె, నతిగారాబమున బెంచుకొనజొచ్చెను. బాల్యముననే నీరాచబిడ్డలు పరాక్రమ శాలురని పేరువడసి తమ శౌర్యపటిమను శత్రురాజులకు జవిజూపుచు అజేయులై పరిఢవిల్లదొడగిరి. పరిసర రాజ్యముల బెక్కింటిపై దాడిసల్పి వాని నవలీల జయింపజొచ్చిరి. ఎట్టకేలకు నిజజనకుని రాజ్యమును గూడ జయింపదలచి తద్రాజ్యముపై దాడివెడలిరి. రాజాసమాచారము విని భయకంపితుడై రాజ్యరక్షణోపాయమును గానక పరితపింపసాగెను. ఆ బాలయోధులతో రణమొనర్చి గెలుపొందుట యసంభవమని యాతడు వేయివిధముల చింతింపసాగెను.

ఈత డిట్లు శత్రుసైన్యముల జూచి తత్తరపాటొందుట గని పెట్టి యానృపాలునియొంపుడుకత్తె యాతనిచెంతకేగి "రాజ వరేణ్యా! ఇట్లు విచారపరీతులై, దీర్ఘాలోచన సేయుచుండుటకు గారణమేమి" యని ప్రశ్నించెను. రాజు, "అంగనామణీ! యేమని చెప్పుదు! శత్రురాజులు మనపై దాడివెడలిరి. సైన్య ములు మన రాజ్యమును సమీపించుచున్నవి. మనము వారల జయించుట కలలోనివార్త. ఆరాజ్యాధీశ్వరునకు అనన్యబాహు విక్రములును, సమరశూరులును నగుపుత్రు లొక్కసహస్రము గలరు. మనరాజ్యము నీశత్రుసైన్యములబారినుండి దప్పింప దెరవుగానక విలపించుచుంటిని. నేడు పరాజయము నిక్కము. ఇదియె నా వ్యాకులతకు గారణము" అని వాపోవసాగెను. అంతయు విని యాయువతి "రాజోత్తమా! వెరవకుడు. అరి సైన్యములవలన మనకెట్టి భయమును వాటిల్లకుండ నొక యుపాయము జెప్పెద. అట్లుచేయుడు. అరిసంతతులు నిమిష మాత్రమున మనకు వశులయ్యెదరు. తూర్పుదెసనున్న పుర ప్రాకారమున కుపరిభాగమున నొకశిలావేదికను నిర్మించి, శత్రుసైన్యములు మన పట్టణమును జుట్టుముట్టినంతనే నన్నా పీఠమున నధిరోహింపజేయుడు. రిపుసైన్యముల రెప్పపాటున వెనుకకు మరలింతును." అని వెరవుజెప్పి రాజేశ్వరుని భయము వాపెను. కొంతకాలమునకు రిపుసమూహములు కోలాహలము గావింపుచు పురమును సమీపించినవి. కాని వారలకు పురాధీశ్వరుని రణప్రయత్నము లెవ్వియు గన్పింప వయ్యెను. ఒక్కయెడ ప్రాకారకుడ్యముపై నధివసించియున్న

యొక్క యతివ తక్క యుద్ధభటు లెవ్వరును వారి కంటికి గానబడ రైరి. "ఈయబలయా మనల రణమున మా ర్కొనునది" యని యాబాలవీరు లచ్చెరువందుచుండ, నింతలో నావనిత మెలుగెత్తి, "బాలయోధులారా! యిటురండు. మీర లెల్లరును నాయనుంగుబిడ్డలు. నాతోడ ననిసేయ దలంచితిరా? ఇట్టి క్రూరకర్మమునుగావింప నేల సాహసింతు?" రని కేకవెట్టెను. క్షత్రియకుమారు లామె పలుకులు విని క్రుద్ధులై "ఓయబలా! నీవెవ్వతెవు? మేము నీకు తనయుల మెట్లైతిమి" అనిగద్దించిరి. "నానుడు లన్నృతములుగావు. మీకు సంశయము గలదేని మీవదనములపై కెత్తి యాననముల దెరువుడు" అని పల్కుచు నామె తనకరద్వయముచే దనకుచపాళి నంట నామెచుగ్ధములు సహస్రధారలై యారసపుత్రవీరుల వదన గహ్వరముల వర్షించెను. అంతట నాసమరవీరులు నివ్వెర పాటొంది సందియము వాసి యామెను దమ ప్రియజననిగా నెఱిగి హస్తమున దాల్చిన రణోపకరణముల నేలబడవైచి యామెకు ప్రణమిల్లి సమరమును విరమించిరి. పిమ్మట నీ యుభయరాజ్యములకును సంధియైనది. ఉభయరాజ్యాధీశ్వరులు సర్హాతులై చిరస్మరణీయులైరి. వీరిజ్ఞాపకార్థమై కట్టింప బడిన స్తూపములు నేటికిని కాననగును. ఇది పూర్వయుగము నాటి వృత్తాంతము. ఆయుగ మంతరించి నవ్యయుగారంభమై నంతనే శాక్యసింహుడవతరించెను. ఈతడువిరాగియైబుద్ధత్వము నొందినవెనుక నొకనాడు తనశిష్యులతో నీప్రాంతమున సంచ రించుచు నీప్రదేశమును జూపి "పూర్వయుగమున శస్త్రసన్యా

సముగావింపబడిన దిచ్చోటనే" యనిచెప్పెను. ఈతీరున నచ్చటి జనులీవృత్తాంతము నెరిగి యిచ్చోట నొకస్తూపమునునిర్మించిరి. ఇందువలననే యీ స్తూపమునకు "విసర్జనాస్త్రస్తూప" మను నామధేయము (శస్త్రవిసర్జన మొనర్చినతావున గట్టబడిన దగుటచే) గలిగినది. ఈ వీరసహస్రమే భద్రకల్పమున + నవతరించిన బుద్ధసహస్రము.

శాక్యసింహు డానందునికి దన నిర్యాణాగమనవృత్తాంతమును దెలిపిన దీశస్త్రసన్యాసస్తూపసమీపప్రాంతమున నడచు చుండగనే. ఆనాడు గౌతము డానందుని బ్రక్కకుబిలిచి "ఆనందా! నేనింక మూడుమాసములలో నీతనువు త్యజింపబోవు చుంటిని సుమా" యని చెప్పెను. పిశాచలోకాధిపతియగు మారుని* ప్రభావమునకు గట్టువడి యానందు డాతరుణమున

---

+ తాపసు లవతరించిన కల్పము. సహస్రబుద్ధులును భూవలయమున నుద్భవించున దీకల్పముననే. అందువలననేయీ యుగమునకీనామము కల్గినది. ప్రకృతము నడచుచున్నది భద్రకల్పమే. ఈయుగమున నల్వురు బుద్ధులింతకుమున్నె యుదయించిరి. ఈ కల్పపరిమాణ మిరువదిమూడుకోట్ల యిరువది నాలుగులక్షల హాయనములు. ఈ కల్పమారంభమై యిప్పటికి పది కోట్ల నూరువేల సంవత్సరములైనది.

* ఈతడు బౌద్ధపురాణగాథలందు వర్ణింపబడిన మృత్యుదేవత. సుగుణశీలములకు ప్రబలవైరి. కామక్రోధమోహమదమాత్సర్యము లీతనిబంటులు. "కామధాతు" పర్వతాగ్రముననుండు "పరనిర్మితవశవర్తినీ" స్వర్గమీతని యావాసము. ఈతడు వికృతాకారములదాల్చి తాపసుల తపోనిష్టల బాడు చేయుచుండును. వారలకు తపోభంగ మొనర్చ రండని సర్వాంగసుందరులగు నారీమణులగూడ వారిచెంతకంపుచుండును. ఈతడు గజవాహనారూఢుడనియు, శతబాహుడనియు బౌద్ధగ్రంథములందు వర్ణింపబడెను.

నిర్జీవప్రతిమవలె చైతన్యవిహీనుడై పోవుటచే "నింక గొంత కాలము భూవలయమున నుండు" మని బుద్ధుని వేడుకొనుట కైన నాతనికి నోరు రాదయ్యెను.

ఈప్రదేశమునకు తూర్పుదెసగా నొక యరమైలు దూరమున నింకొక స్తూపముగలదు. ఇది ద్వితీయ బౌద్ధమత మహాసభ * గావింపబడిన స్థలమున గట్టబడిన స్తూపము. మున్నొకమారు (గౌతముడు నిర్వాణము నొందిన యొక శతాబ్దమునకు) బౌద్ధభిక్షువులకొక మీమాంస గలిగినది. వైశాలీ

---

*ఈసభ బౌద్ధమతచారిత్రమున మిగుల ప్రాముఖ్యమైనది. శాక్యసింహుడు నిర్వాణము నొందినకొలదికాలమునకు క్రీ.పూ. 410 వ సంవత్సర ప్రాంతమున, రాజగృహపట్టణమున కాశ్యపుని యాజమాన్యమున ప్రథమబౌద్ధమతమహాసభ జరిగెను. ద్వితీయమహాసభావృత్తాంతము ఫాహియా నిచ్చట వర్ణించియున్నాడు. ఇది వైశాలీనగరమున క్రీ.పూ. 300 సంవత్సర ప్రాంతమున సమావేశమయ్యెను. ఈ రెండు సభలును శిక్షణనియమముల బరిశీలించుటకే కూడినవి. శిక్షణనియమము లత్యంతకాఠిన్యముగ నుండుటచే నాచరణయోగ్యములు గాకున్నవనికొందరు భిక్షువులు వానిని మార్ప నెంచిరి. అట్టి భిక్షువుల ప్రయత్నములు శాస్త్రసమ్మతములాయని నిర్ణయించుటకై, యీ సభలు సమకూర్పబడెను. ఈ సభల సమక్షమున నాభిక్షువుల జతనములు శాస్త్రవిరుద్ధములని ఖండింపబడినది. నియమములు మరల యథాస్థితినినిలుపబడెను. ద్వితీయమహాసభాసంధానకర్త, ఆనందుని ప్రియశిష్యుడగు "యేదశపుత్రుడు." ఈత డప్పటికి మిక్కిలివృద్ధుడై యుండవలెను.

నగరమున నివసించు శ్రమణకులు గొందరు శిక్షణనియమ ములనతిక్రమించి శాక్యసింహుని వచనానుసరణి, నట్లు ప్రవర్తిల్లితిమని తమ యాచరణ విధానమును సమర్థించుకొన జొచ్చిరి. అంతట వీరియాచరణ, నియమబద్ధమా యను విష యమును బరిష్కరించుటకై ఏడువందలబౌద్ధసన్యాసు లీక్షేత్ర మున సమావేశమై వినయ పీఠిక గ్రంథముల బరిశీలింపదొడ గిరి. పిమ్మట నీస్థానమున నొక స్తూపము నిర్మింపబడినది. అది నేటికిని గలదు.



# ఇరువదియారవ ప్రకరణము

## ఆనందుని యద్భుత మరణము

పిమ్మట మనపాంథులీచోటువీడి వైశాలీనగరమునకు నాలుగు యోజనముల దూరముననున్న పంచవేణీసంగమ తీరమును♦ దర్శించిరి. ఆనందుడు తన దేహమును వైశాలీనగరమున జాలింపనెంచి మగధరాజ్యమునుండి పయనమై పోవుచుండ తద్రాజ్యనృపతియగు నజాతశత్రుడు * అమరులవలన నావార్త నెఱిగి పరుగుపరుగున తన దివ్యస్యందనమెక్కి సైనికబలముల వెంటగొని యతని వెన్నాడుచు నీసంగమస్థానమును జేరెను. ఇంతలో వైశాలీనగరమును బాలించు లిచ్ఛవీవంశనృపాలురు ఆనందుడు తమనగరి కేతెంచుచుండెనను సంతోషవార్తవిని ససంభ్రమమున కోలాహలమొనర్చుచు మహావైభవముతో నాతని కెదురేగిరి. ఉభయ రాజ్య నృపులు నీ నదీతటమున తారసిల్లిరి. ఆనందునకు మహాసందిగ్ధతరుణమే తెంచినది. ముందునకు సాగిపోయిన అజాతశత్రుడాగ్ర

♦ ఈప్రదేశ మేదియో యిప్పటికిని గుర్తింపబడలేదు. ఇది పాటలీపుత్రమున కనతిదూరమున నుండియుండవలెను.

* మగధ రాజ్యాధీశ్వరుడు. బింబిసారనృపాలుకిని తనయుడు. బౌద్ధమతదీక్ష బుచ్చుకొనిన నృపసత్తములలో ప్రథముడు. రాజ్యతృష్ణాపరుడై యాతడు తనజనకుని దుదముట్టించి సింహాసన మధిష్ఠించెను. తొలుత శాక్యసింహునియెడ వైరుధ్యమును దేవదత్తునియెడ స్నేహమును బాటించెను. బౌద్ధమతమును స్వీకరించిన పిమ్మట గౌతమునకు భృత్యుడై దానశీలుడై పేరు మ్రోగెను.

హించును. వెనుకకు మరలివచ్చిన లిచ్ఛవీనృపులు కినుకఁ దాల్తురు. అందుచే ఆనందుని కేమియుఁదోఁచక యాచెంతనే ప్రవహించుచున్న నదీతోయముల బ్రవేశించి యా తరంగిణీమధ్యమున నగ్నిసమాధి♦ఁజొచ్చి దివ్యపథమున కేఁగెను. అతఁడు తన దేహమును రెండుతునియలుఁజేసి యుత్తరతీరమున నొకఖండమును దక్షిణపుటొడ్డున నొకశకలమును విడచెను. మగధవైశాలీ రాజ్యనృపు లీ యర్ధభాగముల దమరాజ్యములకుఁ గొనిపోయి వానిపై స్తూపముల గట్టించిరి.



♦ ఇచ్చట నగ్ని సమాధియననేమొ స్పష్టముగఁ దెలియవచ్చుటలేదు. అగ్నికీలలకు దేహమునాహుతియొనర్చి కైవల్యముఁజేరుటయని యర్థమైయుండ నోపు నదీజలముల నడుమ నగ్నిసమాధి నెట్లుఁజేరనో యూహింపరాకున్నది. ఆనందుఁడట్లు అనలసమాధిఁజొచ్చి పిమ్మట నగ్నిదగ్ధమైన తనదేహశిథిలములను రెండుభాగములుగఁ జేసి యొకభాగము నుత్తరతీరమునను తక్కటిభాగమును దక్షిణపు టొడ్డునను విడచెనని మనయాత్రికునిభావమై యుండనోపు.

# ఇరువదియేడవ ప్రకరణము

## పాటలీపుత్రము.

ఇచ్చోట నుండి మనపాంథులు పంచవేణీసంగమమును దాటి దక్షిణముగ మరలి, యచ్చటికొక యోజనము దూరమున నున్న పాటలీపుత్రమును దర్శించిరి. పాటలీపుత్రము మగధరాజ్యమునకు రాజధాని. అశోకసార్వభౌముడు రాజ్యమేలినచోటు. ఈపురమధ్యమున విలసిల్లు రాజభవనము పిశాచనిర్మితము. అశోకమహీపాలుడు పిశాచముల రావించి వారలచే నీదివ్యసౌధమును గట్టించెను. పిశాచగణ మత్యంత భారమగు గండశిలలదెచ్చి యొకదానిపైనొకటి బేర్చి యున్నతములగు కుడ్యముల నిర్మించి యీ సౌధమును గూర్చెను. ఇది అత్యంత రమణీయముగ నున్నది. అందు మనుజమాత్రుల కలవిగాని శిల్పచిత్రములు ప్రదర్శింపబడియున్నవి. ఈ కట్టడము చాల పురాతననిర్మితమయ్యును దానిసొంపావంతయు దరుగలేదు. నేటికిని సొబగు లీనుచున్నది.

అశోకచక్రవర్తి కొక సోదరుడు కలడు. ఈతడు విరాగియై యర్హత్త్వమునొంది ఏకాంతమున గృధ్రకూటపర్వతోపరిభాగమున నివసించుచుండెను. ♦

---

♦ పూర్వ మీపర్వతమున దపమాచరించుకొనుచున్న యానందుని యేకాగ్రతకు భంగము కల్పించుటకై మారుడు గృధ్రరూపమునుదాల్చి యీనగాగ్రమున వ్రాలుటచే దీని కీ నామము గల్గెనని బౌద్ధపురాణగాథలందు వర్ణింపబడినది. ఇది రాజగృహ పట్టణసమీపమున నున్నది. ఈ పర్వతరాజము పెక్కు గుహావళులచే నలరారుచు ననేక ఋషిసత్తముల కావాససీమయై విరాజిల్లుచుండునని చెప్పబడినది.

అశోకు డీతనియెడ మిగుల ననురాగపూరితుడై, యాతనికడకు బోయి "సోదరా! నీకెట్టి కొరతయు గలగకుండ నీవుగోరు వస్తుచయమునెల్ల సమకూర్తును. పాటలీపుత్రమునకు జని నా సౌధమున వసియింపుము. నేను మిగుల సంతసింతును. ఈ రాతినేలల నుండనేల?"యని తనతమ్ముని బలుతెరగుల బ్రతిమాలుకొనెను. కాని ప్రశాంతములై జనశూన్యములై యేకాంతములగు పర్వతసీమలనుండ నభిలషించు నీ సాధు పుంగవుడు జనసంకీర్ణమగు రాచనగరికి బోవ సమ్మతింపలేదు. అంతట నృపాలుడు "వలయునెడ నా నగరిమధ్యముననే నీకొక నిర్మానుష్యమగు పర్వతమును నిర్మింతును. దయగొని నా యాహ్వాన మంగీకరింపు"మని మరల నాతని బ్రార్థించెను. ఆతని పలుకులవిని యా రాచతపసి విభ్రాంతుడై "యీతడు పురమధ్యమున పర్వతమెట్లు నిర్మింపగలడు! అయిన నీతని సామర్థ్యమును బరిశీలించెదగాక"యని తలచి యాతడు వల్లె యనెను. అశోకు డంతట సంతోషమున నగరుజేరి యొక గొప్ప విందునకు గావలయు సామగ్రినంతయు నమర్చి తన భూత గణములనెల్ల బిలువనంపి "భూతములారా! రేపు మీ కెల్లరకును విందుజేయదలచితిని. మిమ్మెల నందర నాసీనుల జేయుటకు నాసౌధమున నుచితములగు పీఠములు గానరావు. మీయాసనముల మీరలే తెచ్చుకొం"డని యానతిచ్చెను. తేని యాజ్ఞాను సారము మరునాడు భూతములన్నియు నాలుగయిదు బారల చతురముగల్గిన గండశిలల తమవెంటగొని విందు గుడువవచ్చినవి. విందులైనపిమ్మట నృపు డాశిలల నన్నియు నొకదానిపై

నొకటి పేర్చి యొకపర్వతమును నిర్మించి దాని యధోభాగమున ముప్పది యడుగుల పొడవు నిరువదియడుగుల వెడల్పును పదియడుగుల యున్నతియు గల్గిన యొక విశాలమందిరమును గట్టుడని మరల నా భూతముల నాజ్ఞాపించెను. నిముసమాత్రమున నా భూతములు నృపుడు చెప్పినట్టు శైలమును నిర్మించి వెడలిపోయినవి.

పూర్వ మీ నగరమున "రాధస్వామి"* యను బ్రాహ్మణుడొకడు నివసించుచుండెడివాడు. ఈ విప్రుడు మహాయానశాఖకు జెందినవాడు. చాల తెలిసినవాడు. విద్యా సంపన్నుడు. మహాజ్ఞాని. సుగుణరాశి. దీర్ఘదర్శి. ఈరాజ్యమేలు నృపాలు డీతని గురుతుల్యునిగ భావించి యమిత మర్యాదల నొసగి పూజించుచుండును. క్షేమముల నరయుటకై నితని కడకు బోయినపుడెల్ల మహీధవు డీ బ్రాహ్మణుని సరస గూర్చుండ సాహసింపడు. వాత్సల్యమున రాజీతని కరమును స్పర్శించెనేని వెంటనే యీ విప్రు డుదకముతో దనహస్తమును గడిగికొనును. ఈతని కేబదేండ్ల ప్రాయముండును. ఈ రాజ్యమునగల జనులెల్లరును ఈ విప్రవర్యునికి జోహారు లొనర్తురు. ఈ ద్విజశ్రేష్ఠుని మూలముననే యీ ప్రాంతమున బౌద్ధమతము చాల వ్యాప్తినొందినది. ఈతనిజూచి మతాంతరులు బౌద్ధభిక్షువుల బీడింప వెరతురు.

అశోకసార్వభౌమునిచే నిర్మింపబడిన స్తూపమునకు దాపున విశాలమై యత్యంతరమణీయమగు సంఘారామ మొకటి

* ఈతనికి "రైవతు"డను నామాంతరము కలదు.

గలదు. ఇది మహాయానులనివాసార్థమై కట్టింపబడినబౌద్ధ మఠము. దీనిచెంతనేయొక హీనయానమఠముగూడ గలదు. ఈ రెంటియందును నివసించెడు బౌద్ధసన్యాసు లారేడువందలకు పైగా నుందురు. అందరును వినయశీలురు. గంభీరవర్తనులు. వీరినిజూచిన యానందము తరంగితమగును. ఇచ్చటి శిక్షణ నియమములు, విద్యాపోషణమునకై ప్రతిష్ఠింపబడిన యిచ్చటి పాఠశాలలు ♦ అత్యంతదర్శనీయములు. ఉత్తమశ్రమణకులును విద్యాతురులును, వేదాంతరహస్యముల దెలిసికొనగోరు సన్యాసులును వివిధప్రాంతములనుండి యెడతెరపిలేక యీ హీనయానమఠమును దర్శించి పోవుచుందురు.

ఇచ్చటి మహాయానవిహారమున మంజుశ్రీ యను నొక బ్రాహ్మణోత్తముడు గలడు. ఈ రాజ్యమునగల శ్రమణకులును మహాయానభిక్షువులును నీపండితవర్యుని మిగుల బూజింతురు.

మధ్యభారతమునగల రాజ్యములలోని పట్టణములలో కెల్ల నీ మగధరాజ్యమునందలి పట్టణము లత్యంత విశాలమైనవి. అందు నివసించు ప్రజాళి మిగుల ధనాఢ్యులు. కారుణ్యార్ద్రయులు. ధర్మనిరతులు. దానశీలురు. ఈ ప్రాంతవాసులు ప్రతి వత్సరమును వైశాఖమాస అష్టమీదివసమున విగ్రహ మహోత్సవములు సల్పెదరు. ఆనాడైదంతరములరథము నొకదాని నాయత్తమొనర్చి దానిని నేత్రపర్వముగ నలంకరించి పురవీధులవెంట నత్యంతకోలాహలముతో నూరే

♦ బౌద్ధమఠములు విద్యావ్యాప్తికైకూడ జాల తోడ్పడుచుండెడివి.

గింతురు. ఇది యిరువదియడుగుల యున్నతిగల్గి యాకార మున నొక స్తూపమును బోలియుండును. మనోహరములగు చిత్తరువులచే నలరారుచు, చీనాంశుకమువలె నిగనిగలజిమ్ము నొక ధవళకాశ్మీరాంబరమును ఈ రథోపరిభాగమున బర చెదరు. సువర్ణరజితనిర్మితములై, మరకతమణిస్థగితములై కన్నుల మిరుమిట్లుగొల్పు ననిమిషవిగ్రహముల నీ రథాంత ర్భాగముననుంచి వాని శిరోతలమున చీనాంబరముల చాందినీ గట్టెదరు. రథమునకు నాలుగువైపులను నాలుగు ప్రతిమా స్థానములు గలవు. అందు బుద్ధ బోధిసత్త్వుల విగ్రహములు ప్రదర్శింపబడినవి. బుద్ధు డాసీనుడై యుండినట్లును బోధిసత్త్వు డాతనికి కైవారములు సల్పుచున్నట్లును. ఈ మూర్తులు రమ ణీయముగ జిత్రింపబడినవి. రథపార్శ్వములందు విరివిగ పతాక ములు గట్టబడినవి. ఇట్టి రథము లీరాజ్యమున పలుప్రాంత ములనుండి బయలుదేరును. ఆ నా డీరాష్ట్రమున మొత్తమున నిరువది స్యందనములు బయల్వెడలును. అన్నియు నన్ని యాకృతులుగ నుండును. ఒకదానిబోలి యొకటి యుండదు. ఆ నా డీ రాజ్యమంతయు కోలాహలముగనుండును. ఆయాపరిసర ముల వసియించు బౌద్ధభిక్షువులును, తక్కటి ప్రజాసంతతు లును, నాటి రథోత్సవములను నవలోకించుట కాసమీప ప్రాంతములకు బయనమైపోయెదరు. ఉత్సవములు జరుగు ప్రదేశములన్నియు ఆనాడు జనసంకీర్ణములై క్రిక్కిఱిసిపోవును. రథోత్సవసమయమున గానకళావిశారదు లొకవంక గీత ముల బాడుచుందురు. వీణామృదంగాదిరవము లొకమూల

చెలగుచుండును. ఒక్కయెడ భక్తిపరులు సుగంధపుష్పమాలి కల రథారూఢుడై యున్న బుద్ధభగవానుని కర్పించుటకై త్రొక్కులాడుచుందురు. రాత్రివేళ రథప్రదేశ మంతయు దీపపుకాంతులచే గనులపండువ సేయుచుండును. ఆయా పుర ములనివసించు బ్రాహ్మణులు రథోత్సవముల నవలోకింప రండని బౌద్ధభిక్షువుల బిలిచెదరు. భిక్షువులు బారులుగట్టి రథభూమికి నడచిపోయి, యుత్సవములు సమాప్తియగువరకు నందే యుండెదరు ఇట్టి రథోత్సవము లార్యావర్తమున నెల్ల తావులందును జరుగుచుండును.

ఈ ప్రాంతమందలి ప్రతిపట్టణమునను, పురప్రముఖు లచే నిర్మింపబడిన ఔషధాలయములుగలవు. రోగపీడితుల కిచ్చట నౌషధము లుచితముగ నివ్వబడును. అచ్చటగల నిరుపేదలకును, దీనులకును, వ్యాధిగ్రస్తులకును, వికలాంగు లకును, సతీవిహీనులకు నివి శరణ్యములు. వారి కిచ్చట సర్వ సౌకర్యములు నొనగూర్చబడును. రోగముల బరిశీలించి వారికి వైద్యు లౌషధచికిత్స జేయుచుందురు. రోగుల కిందే యన్న పానీయములుగూడ నొసగబడును. చికిత్సనంది స్వస్థులై నపిదప వారలు తమతమ యావాసములకు వెడలిపోవుచుందురు.

అశోకసార్వభౌముడు పురాతననిర్మితములగు సప్త స్తూపములను బడగొట్టించి వాని స్థానమున బ్రతిష్ఠించిన స్తూప సహస్రమున ప్రథమనిర్మితమగు స్తూపరాజ మీ పాటలీపుత్ర పట్టణ సమీపముననే యీ పురమునకు దక్షిణ పార్శ్వమున నొక యరమైలుదూరమున నున్నది. దీనిముంగిటనే బుద్ధునిపద

చిహ్నమొకటి గలదు. అచ్చట నొక విహారము నిర్మింపబడి నది. ఈ విహారమునకు దక్షిణభాగమున బదునైదడుగుల కైవారముగల్గి ముప్పదియడుగుల యున్నతిగల్గిన బ్రహ్మాండ మగు శిలాస్తంభ మొకటి గలదు. దీని శిరోభాగమున నొక జాతి ఫలకముపై నిట్లు లిఖియింపబడియున్నది: "అశోకసార్వ భౌము డీ జంబూద్వీపమునెల్ల బౌద్ధభిక్షువులకు ధారవోసి అశేష ధనరాసుల వారికొసగి మరల దాని బ్రతిగ్రహించెను."*
ఇట్లాతడు ముమ్మారు ధారవోసెను.

పై నుడివిన స్తూపమున కుత్తరముగ నాల్గయిదువందల బారల దూరమున అశోకచక్రవర్తిచే నిర్మింపబడిన 'నిలి' ♦ నగరము గలదు. ఈ పురమునగూడ నొక శిలాస్తంభము నిర్మింపబడియున్నది. ఇది ముప్పదియడుగుల నిడివిగలిగి మేఘమండలము నొరయుచున్నది. దీని యగ్రభాగమున నొక సింహవిగ్రహము జతింపబడియున్నది. 'నిలి' నగర నిర్మాణవృత్తాంతమును సవిస్తరముగ వర్ణించు శిలాలేఖన మొకటి యీ స్తంభమున గాననగును. అందీ నగరనిర్మాణ మునకు గారణములును, అది నిర్మాణమైన తిథి, వార, సంవ త్సరములును వివరింపబడియున్నవి.

---

* ఫాహియాను డీ శిలాలేఖనవృత్తాంత మింక కొంతవిపులముగ వ్రాసియుండినచో అశోకు డీ పృథ్వీతలమున కెంతధరవెట్టెనో తెలిసి యుండెడిది.

♦ ఈనగర మెచ్చట విలసిల్లునో తెలియవచ్చుటలేదు. ఇది పాటలీ పుత్రనగర సంరక్షణార్థమై సైన్యముల నిల్పుటకై సరిహద్దు ప్రాంతమున నశోకసార్వభౌముని చే నిర్మింపబడిన చిన్నపట్టణమై యుండును.

# ఇరువది యెనిమిదవ ప్రకరణము

## రా జ గృ హ ము.

పాటలీపుత్రమునుండి బయలుదేరి మనపాంథు లాగ్నేయ దిశాభిముఖులై తొమ్మిది యోజనములు ప్రయాణ మొనర్చి కతిపయదినముల కొకానొక క్షుద్రశైలమును ♦ సమీపించిరి. ఈ పర్వతాగ్రమున దక్షిణాభిముఖముగనుండు నొక శిలాగహ్వరము గలదు. అమరవిభునిచే నిందలోకమునుండి కొనిరాబడిన యనిమిషగాయకుడు "పంచశిఖుడు" విపంచీస్వనముల మీటుచు వీణాగాన మొనర్చుచుండ శాక్యసింహు డానందసాగరమున దేలియాడుచు గూర్చుండిన దిచ్చోటనే. ఈతరుణముననే శకుడు నలువదిరెండు మహావిషయముల గూర్చి బుద్ధుని బ్రశ్నించెను. శాక్యసింహు డీ ప్రశ్నలన్ని

---

♦ యువానుచ్వాంగు దీనినే "ఇంద్రసీల గుహ" యని పేర్కొని యున్నాడు. ఇది గయాక్షేత్రమునకు ముప్పదియారు మైళ్ళ దూరమున "పంచానన" నదీతటమున "గిర్యకు" గ్రామసమీపముననున్న పర్వతరాజమని గుర్తింపబడినది. ఈ గిరి శిఖరములు నదీజలములపై వ్రాలి యా పంచానన నదీకన్యను ముద్దాడ బోవుచున్నవో యనునట్లు భ్రమగొల్పుచున్నవి. వీనిలో నున్నత శృంగమునే ఫాహియాను డిచ్చట వర్ణించి యున్నాడు. ఈ శృంగోపరిభాగమున బెక్కు మందిరశిథిలములు గాన్పించుచున్నవి. పూర్వ మిచ్చట నొక సుందరవిహార ముండియుండవలెను.

టికిని దనవ్రేలితో నాచెంతనున్న గండశిలపై నుత్తరువులు* వ్రాసెను. ఈవ్రాసినయానవాళ్లీప్రదేశమున నింకనుగాన్పించుచుండును. ఇచ్చోటనిప్పుడొక సంఘారామముగట్టబడియున్నది.

ఈ ప్రదేశమునకు నైర్రృతి భాగమున నొక్క యోజనముదూరమున "నలందా"+యను పట్టణమొకటి గలదు. ఇది సారిపుత్రుని జన్మస్థానము. తుదకాత డిచ్చోటికే తిరిగి వచ్చి నిర్యాణము నొందెను. ఆతని దేహా మగ్నిసంస్కారముగావింపబడినచోట నేడొక స్తూపము నిర్మింపబడియున్నది.

నలందానుండి పశ్చిమముగ నొక్క యోజన మరిగినచో, మగధరాజ్యనృపులకు రాజధానియగు రాజగృహ ♦ పట్టణము గాననగును. ఇది నవీన రాజగృహము. దీని నజాతశత్రుడు నిర్మించెను. ఇందు బౌద్ధమతములు

---

* ఇవి "శక్రప్రశ్నసూత్ర" మున "డిక్" సంగమున వివరింపబడియున్నవి.

+ వర్తమానబర్గాంగు పట్టణము. ఇటీవల నిచ్చట నొక బౌద్ధమతము నిర్మింపబడినది. హర్షవర్ధనుని రాజ్యకాలమున భారతభూమిని దర్శింపవచ్చిన యువాన్ చ్వాంగ్ ఈపట్టణమున నైదేండ్లు నివసించెను.

♦ "రాజభవనములచే విలసిల్లు" నగరము. మగధరాజ్య నృపులకు రాజధాని. ఇది గృధ్రకూటపర్వతముచెంత నున్నది. బౌద్ధమతమున కిది ప్రధానదుర్గము. శాక్యసింహుడు నిర్యాణమొందిన యొక్క వత్సరమున కచట నొక బౌద్ధమహాసభ గావింపబడెను. ఇదియె "ప్రథమ బౌద్ధమహాసభ"యని లోకవిఖ్యాతి గాంచినది. బీహారునకు నైరుతిభాగమున బదునారు మైళ్ళ దూరముననున్న "రాజఘరు" గ్రామసమీపమున నీ పట్టణశిథిలము లిప్పటికిని గాననగును. జైనులకిది మహాపుణ్యక్షేత్రము. ఇచ్చటి కనుదినమును వందలకొలది యాత్రికులు వచ్చుచు బోవుచుందురు.

రెండుగలవు. ఈ పురి పశ్చిమద్వారమున కనతిదూరమున మహోన్నత మగు స్తూపమొకటిగలదు. ఇదియె బుద్ధుని శల్యభాగములపై నజాతుడు కట్టించిన దివ్యస్తూపము. దక్షిణ పురద్వారమునకు గొంచెము దక్షిణముగ, సుమారొక్కయర మైలుదూరమున నొకకొండలోయ గలదు. ఈ లోయదారిని బడి కొంతదూర మేగినచో పంచగిరులచే నావరింపబడి వలయాకారముగానుండు విశాలరమణీయ ప్రదేశ మొండు గానవచ్చును. ఇది బింబిసారనృపాలుని రాజధానియగు ప్రాచీన రాజగృహనగర మున్నతావు. చుట్టునుండెడు పర్వతావళులు, ఈ ప్రాచీన నగరమునకు బెట్టని గోడలై పరిఢవిల్లినవి. ఈ పట్టణము ప్రాక్పశ్చిమముగ నైదుమీలును, ఉత్తర దక్షిణములుగ నేడు మీలును పరిమాణముగల్గి విరాజిల్లినది. సారిపుత్ర మౌద్గల్యాయనులు తొలిసారి "యుపసేనుని"* తారసిల్లిన దిచ్చోటనే. నిర్గ్రంధుడగు ♦ "శ్రీగుప్త" డగ్గి

---

* తొలుత శాక్యసింహునివలన బౌద్ధదీక్ష గైకొనిన ప్రఖ్యాత శిష్య పంచకములోనొకడు. ఈతనికి "అశ్వజిత్తు"డను నామధేయముగూడగలదు. అశ్వజిత్తనునది సైనికుల కొసగబడు బిరుదనామమువలె గాన్పించుచున్నది. (అశ్వశిక్షకుడు లేక అశ్వపాలకుడు).

♦ ఈతడొక యవధూత సన్యాసి. అష్టతీర్థకులలో (బౌద్ధమత వైరులగు బ్రాహ్మణులు) ప్రాధాన్యుడు. జ్ఞాతివంశమున బుట్టినవాడు. అందుచేతనే యీతడు "నిర్గ్రంధజ్ఞాతి"యని కూడ బిలువబడు చుండువాడు. ఈత డాహార వస్త్రాదుల విసర్జించెను. నిరాహారవ్రతదీక్షచే నింద్రియముల జయింపనగునని యీతని యాశయము. ఈతనికి పెక్కుమంది యనుచరులు గలరు. వీరందరును జైనమతావలంబుల మూలపురుషులు.

కుండమును గావించి, యన్నమున విషముగలిపి, బుద్ధుని తనతోడ భుజింపరమ్మని పిలిచినతావును, బుద్ధునకు హాని దలచి యజాతశత్రు డొక నల్లని యుత్తుంగమత్తగజరాజమును కల్లు ద్రావించి, యాతని మీది కంపిన *ప్రదేశమును ఈ పట్టణమున నేగలవు. ఈనగరి కీశాన్యభాగమున నుండు యంబపాళీవనమున రాజబాట యర్థచంద్రాకృతిగ వంపు దిరిగిన యొకానొక రమ్యప్రదేశమున జీవకు ♦ డొక సుందర విహారమును నిర్మించి శాక్యసింహుని నాతని శిష్యగణము×ల తో నచ్చటి కాహ్వానించి కానుక లర్పించెను. ఈ ప్రదేశము లన్నియు నేటికిని గాననగును. కానిపట్టణమంతయు నేడు కాల వాహినిలో గలిసిపోయినది. పాడువడి నిర్మానుష్యమై భీతి గొల్పుచున్నది.

---

* దేవదత్తుని ప్రేరణముచే నీనృపాలు డిట్టి దారుణమున కొడి గట్టెను. కాని పాప మిప్పుడయినను వీరి మనోరథ మీడేరినదికాదు. అక్రందమును బుద్ధుని సమీపించిన తోడనే సాధుశీలయై వినమ్రియయి యాతని మ్రోల మోకరించి జోహారు లొనర్చి వెడలిపోయెను.

♦ అంబపాళికి బింబిసారనృపాలునివలన గలిగిన తనయుడు. ఈతడు వైద్యశాస్త్ర ప్రవీణుడని మిగుల ప్రఖ్యాతిగాంచెను.

× ఆతరుణమున బుద్ధునికడ పండ్రెండువందల యేబదిమంది శిష్యు లుండిరని ప్రతీతి.

# ఇరువదితొమ్మిదవ ప్రకరణము

## గృధ్రకూటశైలము.

పిమ్మట మనపాంధులు ప్రాచీనరాజగృహ పట్టణసమీపముననున్న పర్వతకనుమ జొచ్చి పెక్కు పర్వతశ్రేణులగడచి యెట్టకేలకు పదునైదుమీల యున్నతిగల్గిన యొకానొక మహీధ్రమును సమీపించిరి. ఇదియే గృధ్రకూటమహానగమని ప్రఖ్యాతిగాంచిన శైలరాజము. ఈ పర్వతశృంగమున కొక్క యరమైలు క్రిందుగ బుద్ధభగవానుడు తపమాచరించిన శిలాగహ్వరము గలదు. దీని కొక్కింత వాయవ్యభాగమున మరియొక పర్వతగుహ కానబడును. ఆనందుడిచ్చట ధ్యానతత్పరుడై యుండ నొకనాడు మన్మథుడు గృధ్రరూపమునుదాల్చి యీ కందరమున కెదుట వ్రాలి యాతని వెరపింపజొచ్చెను. బుద్ధుడంతట తనదివ్యమహిమవలన నచ్చట రాతిని బీటవారజేసి తన హస్తము నా నెరియలో జొప్పించి యానందుని భుజము దట్టి "వెరవకు"మని యాతని భయము వాపెను. ఆ పులుగు యడుగుజాడలును, ఆ శిలారంధ్రమును నేటికిని గాన్పించును. ఈ కారణముననే యీ పర్వతమునకు "గృధ్రకందర పర్వత"మను నామధేయము గల్గినది.

ఈ గుహాముంగిట బుద్ధచతుష్టయము కూర్చుండిన తావులుగలవు. అర్హతులు తపమొనర్చిన గుహలుగూడ నీ [illegible]

బుద్ధుడు తన శిలాగహ్వారముముంగిట ధ్యాననిమగ్నుడై యిటునటు దిరుగుచు బచారుచేయుచుండ, నీ పర్వతమున కుత్తరపువైపునన్న రాలగుట్టల నడుమనుండి దేవదత్తు డాతనిపై నొక పెద్ద ఱాతిబండను విసరెను. అదృష్టవశమున నదితప్పి బుద్ధునిపాదములపై బడెను. ఈ గండశిల* నేటికిని యిచ్చట గానవగును.

ము న్నీప్రదేశమున శాక్యసింహుడు బౌద్ధధర్మముల నుపదేశించుటకై కట్టబడిన విశాలమందిర మంతయు నేడు శిధిలమై యంతర్హితమైపోయినది. ఇటుకఱాలతో నిర్మింపబడిన కుడ్యములుమాత్ర మచ్చటచ్చట గాన్పించుచున్నవి. తక్కటి భవనమంతయు రూపుమాసినది.

ఈ గృధ్రకూటశైల మచ్చటగల పర్వతశ్రేణులలోని కెల్ల నత్యున్నతమైనది. దీనిశిఖరము మరకతమణుల గరగిపోసినట్లు పచ్చని పచ్చిక గప్పబడి, యాకసమున కెగయుచు ప్రకృతిసౌందర్యమున కావాసభూమియై కనులపండువ జేయుచుండును. మనఫాహియాను, నవీనరాజగృహపట్టణమున పుష్పమాలికలు తైలము మున్నగు పూజాద్రవ్యముల సేకరించి మార్గమును జూపగల యా ప్రాంతవాసులగు బౌద్ధభిక్షువుల నిరువుర వెంటగొని, గృధ్రకూటపర్వతశిఖరము నధిరోహించి యాగిరిశృంగమునగల పావనక్షేత్రముల సేవింపదొడగెను. ఆ శృంగమును జూచినంతనే మనపాంథుని కనివార్య మగు

* ఈశిల పదునాలుగడుగుల యెత్తును, ముప్పదియడుగుల కైవారమును గల్గిన యొక మహాశిలయని యూనిచ్వాంగు వర్ణించియున్నాడు.

విచారము గల్గినది. పైకి తరగలై పొరలివచ్చు యశ్రు ధారల నాపుకొనుచు నాతడు "మున్ను బుద్ధభగవానుడు సురాంగమసూత్రముల నిచ్చటనే బోధించెను. నేనీ పాపిష్ఠి కాలమున జన్మించుటచే నా మహాభాగుని గన్నులారగాంచు భాగ్యము నాకు లేకపోయినది ఆతడేగిన పదచిహ్నములను, ఆతడు నివసించిన పవిత్రక్షేత్రములనుమాత్ర మీక్షింప వలసెను" అని తలపోయుచు శాక్యసింహుని శిలాగహ్వర ప్రాంగణమున గూర్చుండి సురాంగమసూత్రముల పఠింప జొచ్చెను. అట్లు మన ఫాహియాను డారేయియంతయు నా పర్వతాగ్రముననే గడపి, తెల్లవారినంతనే రాజగృహనగర మునకు మరలిపోయెను.

———

# ముప్పదియవ ప్రకరణము

## శతపర్ణశిలాగహ్వారము. ఒకానొక బౌద్ధ భిక్షువుని ప్రాణత్యాగము.

పిమ్మట మన పాంథులీ ప్రాచీన రాజగృహ పట్టణమును వీడి తన్నగరమున కుత్తరభాగమున మున్నూర్రు బారల దూరమున నున్న "కరండ" వేణువనమును ♦ పోయి వీక్షించిరి. అందొక పురాతన నిర్మితమగు విహారము కలదు. ఈ ప్రాంతమున వసియించు భిక్షువులే యీ విహారమునుదుడిచి నీరముల జల్లుచుందురు. దీనికుత్తరమున రెండుమూడు లీల దూరమున మృతశరీరముల బారవేయు * శ్మశానవాటిక కలదు.

---

♦ ఇది బింబిసార నృపాలునిచే, శాక్యసింహునకు కానుకగ నొసగబడిన యారామము. ఆనృపవరుడే ఇందొక విహారమును గూడ నిర్మించెను. ఒక్కనాడు బింబిసారు డీప్రాంతమున నిద్రించుచుండ క్రూరసర్ప మొకటి యాతని గరువబోయెను. ఆచెంతనే సంచరించుచుండిన యొక కరండమృగమది చూచి కిచకిచధ్వను లొనర్చి యాతని మేల్కొల్పి యాతని ప్రాణముల గాపాడినది. అందుచేతనే ఈ వనవాటికకు "కరండవన" మను నామధేయము గల్గినది.

* మన ఫాహియాను డిచ్చటి అగ్నిసంస్కారవిధిని దూలనాడు చున్నాడు. సమాధిసంస్కారణమొక్కటి దక్క యన్యములగు విధానము లెవ్వియు శవసంస్కారణమున కర్హములు కావని యీతని యభిప్రాయము.

ఇచ్చట నుండి పర్వత శ్రేణులనంటి, పశ్చిమముగ మూడువందల బారలదూర మేగినచో కొండలనడుమ నొకానొక పర్వతకందరము గాన్పించును. ఇదియె "పిప్పల"♦ బిలమని ప్రసిద్ధినొందిన పర్వతగుహ. బుద్ధుడిచ్చటనే యనుదినమును మజ్జన భోజనము లొనర్చినపిదప తప మాచరించుకొనువాడు.

ఇంకను గొంచెము పశ్చిమముగ నొక యరక్రోసు దూర మేగినచో మఱియొకగుహ గానవగును. ఇదియె 'శతపర్ణ *గహ్వారము". బౌద్ధమత చారిత్రమున మిగుల ప్రఖ్యాతి వడసిన గుహారాజము. శాక్యసింహుడు నిర్వాణపదము జేరినపిమ్మట నైదువందల యర్హతులుగూడి సూత్రముల బరిశీలించినదిచ్చోటనే. అప్పు డీప్రదేశమున నొక మహాసభ గావింపబడెను. నాటిసభాస్థలిని అందముగ నలంకరింపబడిన మూడున్నతాసనము లమర్పబడినవి. వామభాగమున నుంచబడిన పీఠముపై సారిపుత్రు డాసీను డయ్యెను. దక్షిణపార్శ్వ

♦ ఈ బిల మొకయశ్వత్థపాదపము క్రిందనుండియుండుటచే దీనికీనామము గల్గియుండవచ్చును. ఫాహియానుడిచ్చట నీవృక్షమును బేర్కొనియుండలేదు. మనపాంథుడు దర్శించినకాలము నాటి కీ మహీరుహము జీర్ణమైయుండనోపు.

* బౌద్ధచారిత్రమున బ్రఖ్యాతిగన్నచోటు. ఈసభాస్థానమునకై అజాతశత్రుడే యీగుహను ప్రత్యేకముగ నిర్మించెను. ఇచ్చటనుదహరింపబడిన సందర్భములబట్టి చూచిన సూత్రములిదివరకే వ్రాయబడినట్లు స్ఫురించుచున్నది.

మున నమర్పబడినయాసనమును మహామౌద్గల్యాయను డలంక రించెను. సభాధ్యక్షుడగు కాశ్యపుడు మధ్యపీఠముపై నధివ సించెను.

ఒక్కరుదక్క తక్కిన యర్హతు లందరును విచ్చేసిరి. ఆనందుడు లోనికిరాజాలక మండిరద్వారముకడనే నిలచిపో యెను. *ఇప్పుడిచ్చోట నొకస్తూపము నిర్మింపబడియున్నది.

ఈ పర్వత శ్రేణి కిరుగడల నెక్కడ జూచినను అసం ఖ్యాకములగు గుహలు గాన్పించును. ఇవి యన్నియు నర్హ తుల యావాసములు. వారు తపమాచరించిన పుణ్యావాటికలు.

ప్రాచీన రాజగృహ పట్టణపు టుత్తర సరిహద్దులదాటి ప్రాగ్దిశగా నొక్కయర్ధమైలుదూర మరిగిన యెడల దేవదత్తుని పర్వతావాసము గానబడును. దీని కొక్కింతదూరమున నలు చదరముగ నుండు నల్లని రాతిబండయొకటి కానవచ్చును. దీని చరిత్రము మిగులజోద్యము. మున్నొకమారు బౌద్ధభిక్షు వొక్కడు దీనిపై నెక్కి యిటునిటు బచారుచేయుచు నీతీరున దల పోయుచు పాగెను. "ఈ కాయ మస్థిరము. క్షణభంగురము. మీదు మిక్కిలి దుఃఖభాజనము. మాత్సర్యపూరితము. ఇసుమంతయైన నిది పవిత్రమగు పదార్థముగాదు. ఈ శరీరము నాకు కడు భారముగ దోచుచున్నది. ఇది నన్నొక పిశాచమువలె

* సభాస్థలికి రావలదని యీతడవరోధింపబడెనో లేక యీతడే లోనికిబోవనిచ్చగింపక సభామండపద్వారముకడనే నిలచిపోయెనో తెలియ రాకున్నది. అవరోధింపబడినట్లే గోచరించుచున్నది. సభాస్థలికి బోవుటకీత డిచ్చగింప కున్నచో ద్వారముకడ నేల నిలచియుండును?

బాధించుచున్నది. ఇంక నే నీ దేహమును భరింపజాలను" అని వితర్కించుకొనుచు నా సన్యాసి, యొక దీర్ఘమగు ఛురికను, హస్తమున గీలించి కంఠమును దరుగుకొనబోయి యింతలో నేదియో యాతని మదికి స్ఫురింప నెత్తిన కరవాలమును క్రిందికివాల్చి, "ఆహా! నేనెట్టి పాపకృత్యము నొనర్పబూనితిని? బుద్ధభగవాను డాత్మహత్యానిషేధమనిగదా శాసించియున్నాడు", అని కొంతవడిచింతించి "అయినను నే గావింపబోవుదానిలో దోషమేమిగలదు? అజ్ఞాన, కామ, క్రోధములను చోరత్రయమును వధించుచుంటిని" అనిమరల సమర్థించుకొని హృదయపరివేదన మాపుకొని మరియొకమారు ఖడ్గమును బైకెత్తి కంఠముపయి నునిచి మహాసాహసముతో కుత్తుకను గోసికొనసాగెను. ఆ యసిధార కాతని గళసీమ యందలి రక్తనాళములు తునిగినంతనే యాభిక్షువు స్రోతపాణు డయ్యెను. కుత్తుక సగము తెగినతోడనే "యనాగామిను ♦" డయ్యెను. అతని కంఠము సంపూర్ణముగ దెగి నేలపై డుల్లినంతనే యాసన్యాసి యర్హాతుడై కైవల్యమునొందెను.

---

♦ బుద్ధత్వము నొందుటకు నాలుగు సోపానములుగలవు. అం దనాగామిని పథము తృతీయసోపానము. అనాగామినులు జన్మరహితులు, మరల వారికి మనుష్యజన్మ లేదు. దేవతలైయొక్కసారి స్వర్గమున జన్మించి యటుపిమ్మట నర్హాతులై నిర్వాణపదము జేరెదరు.

124

# ముప్పది యొకటవ ప్రకరణము

## గయాక్షేత్రము.

ఇచ్చటనుండి మన యాత్రికులు పశ్చిమముగ మరలి తిన్నగ గయాక్షేత్రము♦నకు బయనమై పోయిరి. గయాపట్టణ మంతయు నిప్పుడు శిథిలమై నామమాత్రావశిష్టమై యున్నది. ఈనగరమునకు దక్షిణభాగమున నాలుగుక్రోసుల దూరమున శాక్యసింహు డారుదీర్ఘవత్సరము లన్నపానీయముల నెరుగక తదేకదీక్షతో ఘోరతప మాచరించిన పవిత్రవాటిక గలదు. ఈ ప్రదేశ మొకమహదరణ్య మధ్యమున నున్నది.

ఇచ్చోటకు బశ్చిమముగ నొక యరక్రోసు దూరమున నొక జలాశయముగలదు. మున్నొకసారి శాక్యసింహు డీతటా కమును జొచ్చి స్నాన మొనర్చుచుండ నాతని కాపద సంఘటిల్లినది. నీటిలోబడి యాతడు మునిగిపోవుటకు సిద్ధమయ్యెను. ఆతరుణమున ననిమిషు డొక్క డాకమలాకరముపై వ్రాలి యున్న మహీరుహశాఖ నొక్కదానిని వంచి యాతని కందిచ్చెను. దానినూతగాగొని బుద్ధు డొడ్డుజేరెను. *ప్రమాదము దప్పినది.

---

♦ మగధరాజ్యమున ప్రసిద్ధిగన్న యొకనగరరాజము. ఇప్పటి గయాక్షేత్రమునకు వాయవ్యదిశగా నుండునది. శాక్యసింహునకు జ్ఞానోదయమైన దిచ్చోటనే. బౌద్ధులకిది మహాపుణ్యక్షేత్రము. వేలకొలదియాత్రికు లీ ప్రదేశమును నేటికిని దర్శించి పోవుదురు.

* శాక్యసింహుడు నీటమునిగిపోవుచుండ ననిమిషు డొక్క డాతని ప్రాణములు గాపాడెనని ఫాహియా నిచ్చట సూచించుచున్నాడు.

ఈ సరోవరమున కనతిదూరమున "గ్రామిక"* బాలికలు కొందరు గౌతమబుద్ధునకు బరమాన్న మిడిన చోటు గలదు. ఈప్రదేశమునకుగొంచె ముత్తరముగ నొక పాదపము క్రింద బడియుండు రాతిబండపై నాసీనుడై శాక్యసింహుడా పాయసమును గ్రోలెను. ఈ మహీరుహమును ఈ గండశిలయు నేటికిని ఇచ్చోట గానన గును. ఈపాషాణఫలకము ఆరడుగులచతురమును రెండడుగుల యున్నతియు గల్గి స్నిగ్ధమై నిగనిగల గ్రక్కుచున్నది.

మధ్యభారతమున నాతపశీతలము లత్యంత తీక్షణములై దుర్భరములుగాక మృదులములై హాయి గొల్పుచుండుటచే నిచ్చటి వృక్షజాలములు సహస్రవర్షజీవులై వర్ధిల్లును. కొన్ని మహీరుహములు పదివేల హాయనములు గూడ జీవించును.

ఇచ్చటి కీశాన్యభాగముగ నొకక్రోసు దూరమున పర్వతబిలమొకటి గాన్పించును. మున్నొకమారు, బుద్ధుడుబోధిసత్త్వుడై యుండినకాలమున నీగుహలోని కేగి పశ్చిమాభిముఖుడై కూర్చుండి తనలో తానిట్లుచింతింపసాగెను. "నిక్కముగ నాకు బుద్ధత్వము సిద్ధించునేని యది యొక యద్భుతసంభవము వలన నే డిచ్చట బుజువు గావలయు" నని పలుకునంతలో నొక శరీరచ్ఛాయ మూడడుగుల పరిమాణము గల్గినది కాంతిపుంజముల వెదజల్లుచు నాగుహా కుడ్యముపై

* సంసారముల పరిత్యజించినవారు.

పరిదర్శితమై వినీలాకాశమున గన్పట్టు తొలకరితీవవలె మెరయ జొచ్చెను.

ఈ శరీరచ్ఛాయ నేటికిని అత్యంత తేజోవంతమై యీ గుహాంతర్భాగమున కుడ్యముపై గాన్పించుచుండును. ఆతరుణమున భూనభోంతరాళములుఃకంపించినవి. అంతటనాకసమునుండి "బోధిసత్వమా! నీవు బుద్ధత్వము నొందుతా విదికాదు. మున్నెవ్వరును నిచ్చోట బుద్ధత్వము నొందలేదు. ముందేరును బొందజాలరు. నీకు జ్ఞానోదయమగు ప్రదేశ మిచ్చటికి నైరృతి దిశగా నొక యర్ధయోజనము దూరమున అల్లదె యా ఖర్జూర వృక్ష సమీపమున నున్నది. అచ్చటికి బొమ్ము" అను అశరీర వాక్కులు వినవచ్చినవి. ఈ శబ్దములతోడనే దేవతలు నింగినుండి భూవలయమునకు దిగి మృదుమధురస్వరములతో గాన మొనర్చుచు నాప్రదేశమునకు దారిజూపసాగిరి. బోధిసత్త్వుడును వారివెనువెంటనే నడువదొడగెను. ఆతృణపాదప మింకను కనుచూపుమేరదూరముననుండగనె యానిర్జరులు పిడికెడుకుశలవానిహస్తముననుంచి యదృశ్యులైరి. పిమ్మట పచ్చని విహంగశ్రేణి వానికెదురై బారులుగట్టి యాతనిచుట్టును ముమ్మారు బ్రదక్షిణ మొనర్చి చివ్వున నెగిరిపోయినవి. ఇట్లా బోధిసత్త్వుడు ఖర్జూరపాదపమును సమీపించి, యమరు లొసగిన దర్భపోచల నాచెట్టు మొదటనుంచి తూర్పుదిక్కు మొగంబై యామహీ

---

* ఫాహియాను దీనిని "పత్రిపాదప" మని పేర్కొనియున్నాడు. దానిపర్ణము లెన్నడును వాడి రాలిపోకుండుటచే నీవృక్షమున కీనామము గలిగినది.

రుహముక్రింద నాసీనుడయ్యెను. పిశాచనృపుడగు మారుడు బుద్ధునకు తపోభంగ మొనర్ప రండని కుసుమకోమలగాత్రు లగు ముగ్వుర మగువల వానిచెంత కంపి తానును తనభటసందోహముతో వారివెంట బయలుదేరెను. వారినిజూచి బోధిసత్వుడు తన చరణాంగుళులతో పుడమిని స్పర్శించెను. తృటిలో యమకింకరులుపరుగవారిరి. ఆ నెలజవ్వనులు వృద్ధాంగన లైరి.

ఆరువత్సరము లట్లు శాక్యసింహుడు కఠినతప మొనర్చిన యీ పావనక్షేత్రమునను, తక్కిన తావులందును స్తూపములు నిర్మింపబడియున్నవి. విగ్రహములు ప్రతిష్ఠింపబడినవి.

శాక్యసింహుడు జ్ఞానపరిపూర్ణుడై నపిదప నేడహోరాత్రములు బోధిద్రుమమును ధ్యానించి విముక్తి♦ సౌఖ్యమును బడసినచోటను; ఖర్జూరతరువుక్రింద నీత డేడుదినములిటునటు దిరుగుచు బచారుజేసిన తావునను; నిర్జరులు సప్తమణివిరాజితమగు నొక సుందరమందిరమును సృజియించి యందు బుద్ధున కేడురోజులు పూజలొనర్చిన ప్రదేశమునను; సర్పరేడగు "మహాముచిలిండడు"*సూర్యకిరణములు బుద్ధునిపై ప్రసరింపకుండ దన శరీరము నాతనిచుట్టును జుట్టి తన విశాల

---

♦ సంసారబంధములనుండి.

* శాక్యసింహునకు జ్ఞానోదయమైన ప్రదేశమునకు దాపుననున్న జలాశయమున నివసించు నొక నాగరేడు, ఈ కమలాకరతీరమున గౌతముడు ధ్యానసమాధిలో మునిగియుండ నీ పాపరేడాతని కొండ తగులకుండ గాపాడెనని జాతకకథలలో వర్ణింపబడియున్నది.

ఫణము నాతని శిరోతలమున విప్పి యేడుదినము లాతని కఖండ సేవ లొనర్చిన స్థలమునందును; బుద్ధుడు ప్రాగ్దిశాభిముఖుడై యున్న న్యగ్రోధపాదపచ్ఛాయ నొకరాతిశిలపై నాసీనుడై యుండ బౌద్ధమతసార మెరిగింపుమని బ్రహ్మదేవు డాతని బ్రార్థించినచోటను*; నలువు రనిమిషనాథు లమరలోకమునుండి మరకత శిలానిర్మితములగు కక్షపాలలదెచ్చి బుద్ధునకొసగిన ♦ పుణ్యక్షేత్రమందును; వణిజులు గౌతమునకు మధుపిష్టమును దెచ్చిపెట్టినప్రాంతమునను; కాశ్యపసోదరులకును+ వారల సహస్రశిష్యగణమునకును శాక్యసింహుడు బౌద్ధ ధర్మముల నుపదేశించిన పవిత్రవాటికయందును స్తూపములు గట్టబడియున్నవి.

శాక్యసింహునకు జ్ఞానోదయమైన ప్రదేశమున మూడు బౌద్ధమఠములు గలవు. వీనన్నిటిలోన భిక్షువులు గలరు. ఈ పరిసరముల నివసించి ప్రజాళి వీరికి వలయు వస్తుసంబారముల నెల్లసమకూర్చి పంపుచుందురు. సన్యాసవిధులను వీర లత్యంత భక్తిశ్రద్ధలతో నిర్వర్తించెదరు. శ్రమణకు లాసీను లగునప్పుడును ఆసనముల డిగ్గి లేచునపుడును, సభాప్రవేశ మొనర్చు తరు

---

* లోకమున బౌద్ధధర్మముల నుపదేశింప మొదలుపెట్టుమని బ్రహ్మదేవు డీతని ప్రార్థించెను. ఈ వృత్తాంతము నిదానజాతకకథలోనిది.

♦ ఈ చిత్రకథ పండ్రెండవ ప్రకరణమున జెప్పబడినది.

+ ఈతడు పదునారవ ప్రకరణమున బేర్కొ-నబడిన మహా కాశ్యపుడుగాడు. ఈతడు నదీకాశ్యపుడు. వీనికి "ఉరువిల్వ, గయు" అను నిరువురు సోదరులు గలరు. వీరు బుద్ధుని ప్రధాన శిష్యగణములోనివారు.

ణమునను అనుసరింపవలసిన నియమములు, పూర్వకాలమున బుద్ధుడు సజీవుడై యుండునపు డెట్లు పాటింపబడెనో నేటికిని నట్లే యిచ్చోట బాటింపబడుచున్నవి. అప్పటికిని ఇప్పటికిని కొంచమైనను వ్యత్యాసము గాన్పింపదు. గౌతముడు జన్మించిన తావునను, ఆతనికి జ్ఞానోదయమైన ప్రదేశమునను తొలుత నాతడు బౌద్ధ ధర్మములను నుపదేశింప మొదలిడిన చోటను, ఆతడీ స్థూలదేహమును విడచి కైవల్యము నొందిన ప్రాంతమునను, నాలుగు మహా స్తూపములు నిర్మింపబడవలయునని తొలుదొల్తనే నిర్ణయింపబడెను. ఈప్రదేశము లివియివి యని శాక్యసింహుడు నిర్వాణపథము జేరిన నాటగోలె నేటిదనుక నాయాప్రాంతముల నివసించు ప్రజాళిచే గుర్తింపబడుచు వచ్చినవి.

130

# ముప్పదిరెండవ ప్రకరణము

## అశోకనరకము.

పూర్వజన్మమున అశోకనృపుడు పసిపాపడై యొక నాడు వీధిలో నాడుకొనుచుండ కాశ్యపబుద్ధుడు భిక్షాటన మొనర్చుకొనుచు నాదారిని బోవుచుండెను. నృపకుమారు డాపరివ్రాజకుని జూచి పరిహాసమున బిడికెడుమంటిని దీసి యాతనియొడిలో బోసి పకపకనవ్వుచు నచ్చటనుండి పరుగెత్తుకొనిపోయెను. మందస్మితుడై కాశ్యపు డామంటిని గ్రహించి "బాలకా! ఉత్తరజన్మమున నీవొక మహాచక్రవర్తివై జంబూద్వీపమెల్ల నేకచ్ఛత్రాధిపతిగ నేలెదవుగాక" యని దీవించి వెడలిపోయెను.

మరుసటిజన్మమున నాత డనినట్లె అశోకుడార్యావర్తమునకెల్ల సార్వభౌముడై అఖండవైభవముగ రాజ్యపాలన మొనర్చుచు, నొకమారు తనపరిపాలన మేతీరున నడచుచుండెనో చూడగోరి అమాత్యసేవకాగణపరివృతుడై తన రాజ్యమెల్ల దిరుగుచుండెను. ఇట్లు సంచరించుచుండ నాత డొకచోట వలయాకారముగ వంపుదిరిగి, యినుపగోడలవలె బలిష్ఠములై, అత్యున్నతములై మింటికెగయు రెండు పర్వతశ్రేణుల మధ్య పరిరక్షితమైయున్న యమలోకమును* దవ్వులనుండి వీక్షించి, రిచ్చవడి "అమాత్యులారా! అల్లదె యాకాన్పించు

* ఈయమరాజ్యము జంబూద్వీపమునకు దక్షిణదిగ్భాగమున చక్రవాళపర్వతముల కావలివైపున నున్నదని బౌద్ధవాఙ్మయమున వర్ణింపబడినది.

కొండలనడుమ నేమిగలదు?" అని తనమంత్రుల నడిగెను. అందుకు మంత్రులు సవినయముగ "ప్రభూ! అదియె పిశాచతేడగు యమునిరాజ్యము. పాపకర్ములందు శిక్షింపబడెద" రని విన్నవింప అశోకనృపాలు డాశ్చర్యమగ్నుడై "ఆహా! పిశాచనృపుడే ప్రాణుల దండింప నరకమును సృజింపజాలియుండ, ఈ నిఖిలభూవలయమునగల మానవాళికెల్ల జక్రవర్తినగు నేనేల దుష్టశిక్షణార్థమై యొక నరకమును నిర్మింపజాల" నని వితర్కించి తన పరివారము నవలోకించి "సచివులారా! ఈ నరకమునుబోలు నరకమును సృజియించి పాపుల నందుదండింప గలవా రెవ్వరైన మనరాజ్యమునగలరా?" యని ప్రశ్నించెను.

"మహాప్రభూ! మహాపాతకిగాని యిట్టి కార్యమును నిర్వర్తింపజాలడు" అని వారలు ప్రత్యుత్తర మిచ్చిరి.

అది విని అశోకసార్వభౌము డట్టికలుపాత్ము డెవ్వడైన గలడేని వెదకి తెండని తన చారులను తక్షణమె నలుముఖముల బంపెను. రాజసేవకులు పెక్కుప్రాంతముల దిరిగి యెట్టకేలకు ఒకానొక సరోవరతీరమున నొక వికృతాకారుని గాంచిరి. ఆవింతమనుజునిశరీర మతిదీర్ఘమై అత్యంతబలీయమై యుండెను. ఆతని వదనము మసిపాతవలె నల్లనై భయోత్పాతము గొల్పుచుండెను. శిరోజములు పసిమివర్ణముగల్గి వికారముగ నుండెను. కన్నులు మార్జాలనయనములవలె ఆకుపచ్చవన్నె గల్గి చూపరులగుండె లవియజేయుచుండెను. ఈత డా తటాకమున తనపాదముల గాలములభంగి నుపయోగించుచు చేపల

బట్టుచుండెను. ఈలబాడుచు, మృగవిహంగముల మెల్లన దరికి జేరబిలిచి అవి దరిజేరినంతనే నిర్దయుడై బాణవృష్టిచే వాని బరిమార్చి యొక్కటైన తప్పిపోకుండ వానినెల్ల వధించుచుండెను. యమలోక నిర్మాణాదికృత్యములకు వీడు తగినవాడని సంతసించి రాజభటులు వాని తమ జేనిపాలికి గొనిపోయిరి. అశోకనృపాలు డావికృతాకారుని జూచి సంతోషస్వాంతుడై, "ఓయీ! నీవొక నరకమును సృజింపవలయును. అందుకే నిన్నిచ్చటకు రప్పించితిని. నీ వతిశీఘ్రముగ బోయి యూరిబైట నొక విశాలప్రదేశము నేరికొనుము. చుట్టును దాని కత్యున్నతములగు ప్రాకారముల నిర్మింపుము. అందు పలువిధములగు తరులతాదుల బాతింపుము. స్నాన మాచరించుటకు నిర్మలజలపూరితములగు సరోవరముల త్రవ్వింపుము. ఇంక ననేకవిధముల దాని నెంతయు శోభాయమానముగ జేసి చూపరుల సమ్మోహితులజేయున ట్లొనర్పుము. ప్రాకారమున నొక్కచోట బలిష్ఠమగు ద్వారము గట్టింపుము. ఈబహిర్ద్వారమును దాటి యెవ్వడేని లోనికడుగువెట్టినచో తత్క్షణమె వాని పట్టె బంధించి తగినశిక్ష విధింపుము. లోనికరిగినవాని నెవ్వాని బయటకు బోనియ్యకుము. ఎంతటివానినైన నూరక విడువకు. నేనైన గానిమ్ము, నీయావరణమును దాటి వచ్చితినేని తప్పక దండింపుము. నిన్నీనరకమున కధిపతిగా నియమించితిని. పొమ్ము" అని యాకురూపున కాజ్ఞనొసగి పంపివైచెను.

ఆవికృతాకారుడు అశోకుడుచెప్పిన ట్లొక యమరాజ్యమును సృష్టియొనర్చి అందడుగిడినవారినెల్ల దయావిహీనుడై

దండింపసాగెను. ఇట్లుండ నొకనాడు బౌద్ధపరివ్రాజకు డొకడు భిక్షాటనమొనర్చుకొనుచు నామార్గమున బోవుచు మెరుగక "యీప్రదేశ మేదియో మనోహరమై దర్శనపాత్ర ముగ గాన్పించుచున్నదే." యని యూహించుకొనుచు ద్వార మునుదాటియీనరకరాజ్యమున బ్రవేశించెను. తోడనే ద్వార పాలకు లాతనిబట్టి బంధించి యమదండనకు బాల్పడజేయసాగి రి. మార్జాలమునోట జిక్కిన మూషికమువలె నా భిక్షువు భయకంపితుడై, "యమకింకరులారా! దయగొని యొకింత యూగుడు. మజ్జనభోజన మొనర్చువరకు నాకు గడువొసంగుడు. అటుపిమ్మట మీాయిచ్చవచ్చినరీతిని గావింపవచ్చును" అని వారల వేడుకొనెను. ఇంతలో మరియొక బాటసారియు విధి వశ మున నాత్రోవనే పోవుచు నందేమిగలదో చూడ కుతూహ లుడై యాభిక్షుకునివలెనే యాతురతతో లోనికరిగెను. సత్వర మున యమభటులు ఏపాపమెరుగని యాపాంధునిబట్టి యినుప గోటిలో బడవైచి యానిర్భాగ్యుని వదనగహ్వారమునుండి రుధిరము వరదలై ప్రవహించువరకును రోకండ్లతో కుమ్మిరి. బౌద్ధసన్యాసి యా ఘోరదృశ్యమును దిలకించి "ఆహా! కాయ మెంత యస్థిరము! బుద్బుదసన్నిభముగదా!" యని విలపిం చెను. తక్షణమే యాబౌద్ధశ్రమణకు డర్హాతు డయ్యెను.

బాటసారిని మర్దించినపిదప నా యమరాజ్యభటులు పద పద మనిసన్యాసిని బట్టుకొనిపోయి సలసలమరుగుచున్న యొక నీటి భాండమున బడవైచిరి. కాని చిత్రము! బౌద్ధభిక్షు నావంతయు చలింపడాయెను. ఆతని వదనసీమను చిరునవ్వ

తాండవించుచుండెను. తక్షణమే అగ్ని చల్లారినది. ఆబానలో మరిగిమరిగి యావిరులు గ్రక్కుచున్న జలరాసి చల్లబడి శీత లోదక మయ్యెను. తృటిలో నాకడవమధ్యమున నొకకమల ముద్భవ మైనది. సన్యాసి యాసరసీరుహాముపై నాసీనుడై భాండోదకమున దేలుచుండెను.

ఈ యద్భుతసంఘటనమును గాంచి యమభటులు స్తంభి తులై పరుగుపరుగున అశోకనృపాలు పాలి కరిగి యా వృత్తాంత మంతయు జెప్పి "సార్వభౌమా! దయసేయవలయు. యమలో కమున వింతలు పుట్టె" నని కలవరపడజొచ్చిరి. అశోకుడు యమరాజ్యమునకు బోవవెలచి "కింకరులారా! నే నానరక లోకమును త్రొక్కజాలను. తొలుత నే గావించిన శాసనముల నేనే ప్రతిఘటించుట పాడిగా"దనెను. నృపోత్తమా! ఇది యల్పవిషయమని తలంపవలదు. ఇది నియమముల లెక్కింప వలసిన తరుణముగాదు. సత్వరమున దయసేయవలయు" నని యమభటులు వేగిరపడసాగిరి. అశోకు డెట్టకేలకు వల్లె యని యాభటులవెంట నరకరాజ్యమునకు పయనమైపోయి యాయద్భుతదృశ్యమును గాంచి వెరగంది నిశ్చలప్రతిమవలె జూచుచుండ భాండసలిలముల నుత్పన్నమైన రాజీవప్రసూన ముననాసీనుడైయున్న భిక్షువాతనిజూచి చిరునగవునవ్వి "రాజా! భయమొందకు"మని యాతని వెరపుదీర్చి యాతనికి బౌద్ధధర్మ ముల నుపదేశించి అశోకసార్వభౌముని నరక బాధనుండి తప్పించెను. అశోకభూమీశుడు తానొనర్చిన యపరాధమునకు పశ్చాత్తప్తుడై తక్షణమే యానరకరాజ్యమును నిర్మూలము

జేయు డని తన సేవకుల కాన తిచ్చెను. నాటనుండియు నీ పృథ్వీపాలుడు బౌద్ధమతావలంబుడై త్రిరత్నముల పూజించుచు అష్టమార్గముల నాచరించుచు ననుదినమును బోధిద్రుమము కడకుబోయి తానొనర్చిన కలుషములకు బరితాపమొందుచు కాలము గడుపజొచ్చెను.

అశోకుని మనోగతమున గల్గిన యద్భుతపరివర్తనమును జూచి యాతని మనోహారిణి చింతాకులయై తన ప్రియవల్లభు డనుదినమును ఎచ్చటికిబోయి పొద్దులుబుచ్చుచుండునని పరిచారకుల నడిగెను. వారు, "తల్లీ! ఇచ్చటి కనతిదూరమున నొక బోధివృక్షము గలదు. సార్వభౌము డనుదినమును అచ్చటికె జనుచుండు"నని చెప్పిరి. రాజపత్నియావృత్తాంతము విని అసూయాగ్రస్తయై నృపు డావృక్షముచెంతలేని సమయమును గనిపెట్టి యా మహీరుహామును నిర్మూలన మొనర్చిరండని తన యంతఃపుర సేవకుల కాన తిచ్చెను. మహారాజ్ఞి యానతి శిరమునదాల్చి సేవకులు బోధివృక్షమును నరకివైచిరి.

కొంత సేపటికి సార్వభౌము డెప్పటియట్ల పిప్పలివృక్షము కడకేగి చూచుసరికి యాతరుశిఖరము ఖండింపబడి నేల పొర్లాడుచుండెను. అశోకుడు మితిలేని శోకమున మునిగి పోయెను. "ఆ! ఎంతపని జరిగినది" అని కెవ్వున యరచి నేలబడి మూర్ఛిల్లెను. చెంతనున్న సేవకులు శీతలోపచారములొనర్చిరి. కొంత వడికి సేదదేరి యశ్రువుల రాల్చుచు నానృపవరుడు తెగిన మొండెముచుట్టును ఇసుకరాలతో నొకపడియగట్టించి,

నూరుబానల గోక్షీరముల దెప్పించి యందు బోయించెను. పిమ్మట నావృక్షమున కెదురుగ వినమితమస్తకుడై సాష్టాంగ మొనర్చి, "ఈతరురాజము జీవింపకున్న నే నిచ్చోటనుండి లేవనోప" నని ప్రతిన వట్టెను. నృపాలుని నోటనుండి యా పల్కులు నిర్గమించినంతనే యామోడు పల్లవింపదొడగెను. క్షణమాత్రమున నలుముఖముల శాఖలు విస్తరించినవి. ఇట్టి పాదపము నేటికిని పెరుగుచునేయున్నది. ఈ మహీరుహ మిప్పుడు నూరడుగుల యెత్తునకు బెరిగి మహోన్నతవృక్షమై తనరారుచున్నది.

---

# ముప్పదిమూడవ ప్రకరణము

## గురుపాద శైలము.

మన తెరువరు లిచ్చోటనుండి దక్షిణదెసగా మరలి యొక యరక్రోసుదూర మరిగి 'గురుపాద'* పర్వతమును దర్శించిరి. ఈపర్వతగర్భమున నిప్పటికిని మహాకాశ్యపుని దేహముగలదు. ఈతడీపర్వతాగ్రమున నొక నెఱియగావించి యీ శైలగర్భమున బ్రవేశించెను. ఆతడొనర్చిన రంధ్రము నేటికిని గాననగును. ఈసారంగ మిప్పు డొక మనుజుడైన దూర శక్యముగానంత చిన్నదిగ నున్నది. ఇంతటి క్షుద్రబిలమున నాకాశ్యపుని దేహ మెట్లిమిడెనో యాశ్చర్యము. ఆ సారంగమునుజొచ్చి కడుదూరము క్రిందికి బోయినచో శైలగర్భమున నెచ్చటనో యొకగుహ కాన్పించును. ఇచ్చటనే మహాకాశ్యపుని కళేబరము పరిరక్షితమై యున్నది.

ఈపర్వతశృంగమున కాశ్యపుడొనర్చినసారంగద్వారము కడ నావిరాగి హస్తప్రక్షాళన గావించుకొనునప్పు డుపయోగించినకర్దమము గలదు. ఈపరిసరప్రాంతముల నివసించు జనులు తమ శిరోభాగమున నెచ్చటనైన బాధగల్గెనేని యీ కర్దమమును గొనిపోయి యాప్రదేశమున లేపనముగ బూ

---

* "కుక్కుటపాద పర్వత"మనిగూడ దీనికి నామాంతరముగలదు. కుక్కుటపాదమునుబోలి యీశైలమునకు మూడుశృంగములుండుటచే నీ పర్వతమున కీనామముగలిగినది. ఈశైలము గయాక్షేత్రమున కాగ్నేయభాగముగ నేడుమైళ్ళదూరమున నున్నది. కాశ్యపబుద్ధుని వాసస్థాన మిదియె. ఈ శైలగర్భమున కాశ్యపునిదేహము నేటికిని గలదని బౌద్ధుల విశ్వాసము.

యుదురు. తృటికాలమున బాధ నివారణ యగును. ఇప్పటి కిని యీ శైలోపరిభాగమున అర్హతులు నివసించుచుందురు. ప్రతివత్సరమును ఈపర్వతమునకు దాపుననున్న రాజ్యముల నుండి అసంఖ్యాకులగు బౌద్ధయాత్రికు లరుదెంచి యీ గిరి రాజమును దర్శించి కాశ్యపుని సేవించి పోవుచుందురు. హృదయమాలిన్య మెరుగని నిష్కళంక బౌద్ధమతావలంబులకు నిశాసమయములందు అర్హతులు ప్రత్యక్షమై వారలతో సంభాషించి వారలమనముల నెలకొనియున్న సందియముల దీర్చి యదృశ్యు లగుచుందురు.

ఈ పర్వతోపరిభాగమున ముండ్లపొదలుదట్టముగ బెరిగి యున్నవి. సింహ, శార్దూల వృకాది వన్యమృగసంకీర్ణమై యీ శైలము భీతావహ మగుటచే నిం దొంటరిగ ప్రయాణ మొనర్చుట మిగుల ప్రమాదకరము.

---

# ముప్పదినాల్గవ ప్రకరణము

## వా ర ణా సి.

గురుపాదశైలమును వీక్షించి మన ఫాహియాను గంగా నదీతీరమునంటి వెనుకకు మరలజొచ్చెను. ఇట్లు మరలి పశ్చిమాభిముఖుడై యాతడు పదియోజనములదూర మరిగి "అరణ్యసీమ" యను నామమున బరగు నొక విహారమును గాంచెను. ఇది బుద్ధుడు కొంతకాలము నివసించిన పుణ్యస్థలి. ప్రస్తుతము పెక్కు బౌద్ధసన్యాసుల కావాసభూమియై తనరారుచున్నది.

పిమ్మట పశ్చిమముగనే యింకను గొంతదూర మేగి మన బాటసారి "వారణాసి"♦ని గాంచెను. వారణాసి 'కాశీ' రాజ్యమున విలసిల్లు గొప్ప నగరము. ఈపట్టణమువ కీశాన్య భాగమున నొక క్రోసుదూరమున "కురంగారామ" మను వనవాటిక యొకటిగలదు. అం దత్యంతసుందర మగు విహార మొండు నిర్మింపబడియున్నది. పూర్వ మీావన భూమియం దొక ఋషిసత్తముడు నివసించువాడు. ఈపరిసరారణ్య ప్రాంతమున సంచరించుహరిణములు గుంపులు గుంపులై వచ్చి ప్రతిరేయియు ఆమునివర్యుని యాశ్రమమున విశ్రమించి పోవుచుండెడివి. అందువలననే యీావనసీమకు 'ఋషికురంగారామ' మను నామధేయముగలినది. జగత్కల్యాణ

---

♦ "వరుణ", "అసి" నదులమధ్య విలసిల్లు పట్టణముగాన వారణాసి యయ్యెను.

డగు శాక్యసింహునకు జ్ఞానోదయమగు తరుణ మాసన్నమై నంతనే నభోంతరాళమునుండి "శుద్ధోదనమహీపాలుని తన యుడు భార్యాసుతుల విడనాడి సర్వసుఖముల పరిత్యజించి వైరాగ్యపథమున చరించుచున్నాడు. ఇక నేడుదినములలో నీతడు బుద్ధుడగును" అను శబ్దము లీప్రాంతముననే వినవచ్చి నవి. ఈయారామవాసియగు మునివర్యు డీవచనముల నాల కించి జీవముల బాసెను. శాక్యసింహునకు జ్ఞానోదయమైన పిదప నీప్రాంతమున నివసించు జను లీ వనవాటికయం దొక విహారము నిర్మించిరి.

కౌండిన్యు * నకును ఆతని నల్వురు మిత్రులకును బౌద్ధమత దీక్షయొసంగవలె నని యొకనాడు శాక్యసింహునకు తలపు గల్గెను. వా రీతని సంకల్పమును గనిపెట్టి వారిలో వా రిట్లు సంభాషించుకొన జొచ్చిరి. "గౌతమశ్రమణకు డారు దీర్ఘవత్సరములు శరీరసౌఖ్యముల నొల్లక దేహమును శుష్కింప జేసి ఒక్క జనపపల్కును, ఒక్క బియ్యపుగింజను మాత్రము భుజించుచు ఘోరతపోనిష్ఠల మున్గి తేలినను జ్ఞానపథము నరయజాలడయ్యెను. ఇప్పుడు తపశ్చర్యలన్నియు చాలించి,

* మగధరాజ వంశమున బుట్టినవాడు. శాక్యసింహుని మేనమామ. శాక్యసింహు డీతనికి "అజ్ఞాతు" డనుబిరుదు నామ మొసగెను. అందువలన నీతడు బౌద్ధవాఙ్మయమున "అజ్ఞాతకౌండిన్యు"డని పేర్కొనబడుచుండును. ఈతడును ఈతని నల్వురుమిత్రులును శాక్యసింహుని వైరాగ్యమునకు వెర గందుచు నాతనికి పరిచర్య లొనర్చుటకై యతని వెంట "ఉరువిల్వ" యొడారికి పయనమై పోయిరి.

ఏకాంత వాసమును విడనాడి మానవప్రపంచమున సంచరించుచు నీత డిప్పుడు జ్ఞానపరిపూర్ణు డెట్లు గానేర్చును? నే డీతడు మన దెసకు వచ్చెనేని మన మీతని పల్కరింపక తొలగి పోవుదము."

ఈ యారామ పరిసరములందు పెక్కు స్తూపములు గలవు. బుద్ధు డరుదేరినంతనే కౌండిన్యుడు మున్నగు వారలు తమయాసనముల డిగ్గి యాతని కభివందన మాచరించిన తావు లందును, అచ్చటి కుత్తరముగ నరువదిబారలదూరమున శాక్య సింహుడు ప్రాగ్దిశాభిముఖుడై వారికి బౌద్ధధర్మముల నుప దేశించిన చోటులందును, బుద్ధుడు మైత్రేయాగమన వృత్తాం తమును దెల్పినప్రదేశమునను, "ఇలాపత్ర" ♦ యనునాగుడు, "నే నీ తుచ్ఛశరీరమును వీడి మానవజన్మమును బొందు టెన్న" డని బుద్ధుని బ్రశ్నించిన స్థానమునను స్తూపములు నిర్మింపబడియున్నవి. ఇంతియగాక నీ వనభూమియందు రెండు సంఘారామములుకూడ గలవు. ఈ రెంటియందును శ్రమణ కులు పెక్కండ్రు నివసించుచున్నారు.

కురంగవనవిహారమునకు వాయువ్యభాగమున పదమూడు యోజనముల దూరమున "కౌశాంబీ" * యను రాజ్యమొకటి

---

♦ ఈ నాగుని గూర్చిన వృత్తాంతము మన కంతగా తెలియదు.

* ఈ రాజ్య మెచ్చట విలసిల్లినదో సరిగ తెలియవచ్చుటలేదు. ప్రస్తుత "కురా"కు సమీపముననున్న కుసియా యని కొందరును, ప్రయాగ క్షేత్రమున కుత్తరముగ యమునానదీ తటముననున్న "కోశా"మే యీ కౌశాంబీరాజ్యమని కొందరును తలంచుచున్నారు.

కలదు. "గోక్షీరవన"+మను నామమున బరగు ప్రసిద్ధ విహార మిందే గలదు. బుద్ధుడు కొన్నినాళ్లీవిహారమున నివసించెను. ఈప్రదేశమున గూడ చాలమంది బౌద్ధభిక్షువులు గలరు. వీ రందరును హీనయానశాఖకు జెందినవారు.

గోక్షీరవనమున కెనిమిదియోజనముల దూరమున బుద్ధభగవానుడు "అలవాక" యను భూతమునకు కైవల్య* మొసగినతావు గలదు. ఇచ్చోట నొక బౌద్ధమఠముగూడ నిర్మింపబడియున్నది. ఇందు కొలదిమందిసన్యాసులుమాత్రమే నివసించుచున్నారు. ఈ సమీపప్రాంతమున బుద్ధుడు విహరించినప్రదేశములం దెల్లెడలను స్తూపములు నెలకొల్పబడి యున్నవి.

Tholapathy Suryanarayana murty Rajahmundry

+ గోక్షీరుడను వా డొక వైశ్యశ్రేష్ఠుడు. ఇచ్చట బేర్కొనబడిన యుపవనమును అందలి విహారమును ఈతడే బుద్ధునకు దానమిచ్చెను.

* ఈ కథ "అలవాక సూత్రము" నందు వర్ణింపబడియున్నది.

A. SubbaRao



# ముప్పదియైదవ ప్రకరణము

## దక్షిణాపథము—కపోత విహారము.

కౌశాంబీరాజ్యమునకు దక్షిణముగ నిన్నూరు యోజనముల దూరమున "దక్షిణాపథ"మను దేశముగలదు. ఇచ్చట కాశ్యపబుద్ధుని గౌరవార్థమై గట్టింపబడిన గిరివిహార మొకటి కలదు. ఇది యొకమహత్తరమగు పర్వతమునుండి తొలువబడిన ఐదంతస్తుల దివ్య భవనము. ఈ హార్మ్యము నందలి ప్రథమయంతరము గజాకృతిగ నిర్మింపబడి ఐదువందల గదులతో నలరారుచున్నది. ద్వితీయ యంతరము సింహామును బోలి నన్నూరుగదులు గల్గియున్నది. మూడవయంతస్తు అశ్వాకృతిగనుండి మూడువందల గదులుగ విభజింపబడినది. నాల్గవది వృషభాకారముగ గట్టబడినది. ఇందు రెండువందల గదులు మాత్రమే గలవు. కడపటి యంతర మచ్చముగ పారావత విహంగమును బురిడించుచుండును. ఇది యన్నిటిలోన చిన్నది. ఇందు నూరుగదు లున్నవి. ఈ భవనశిరోభాగమున నొక జలధార సర్వదా స్రవించుచుండును. ఈ ప్రస్రవణోదకము సెలయేటి ధారలవోలె గదుల ముంగిట ప్రవహించుచు కొన్ని తావులయం దర్ధచంద్రాకృతిగను, కొన్నిచోట్ల వలయాకారముగను మెలికలు దిరుగుచు నన్నియంతస్తులను జుట్టి యాకాశతరంగిణివలె క్రిందికి దిగిపోవుచున్నది. గదులకు వెలుతురు నిచ్చుటకై కుడ్యములయందు రంధ్రములు గావింపబడి

యున్నవి. ఇవియె గవాక్షములభంగి నుపకరించుచు విహార మందిరములకాంతివంతముగ జేయుచున్నవి. ఒకయంతరమునుండి యొక యంతరమునకు బోవుట కీభవనమునకు నాలుగు మూల లను నాలుగు సోపానపంక్తు లమర్చబడినవి. ఇందువలననే యీ విహారమునకు "పారావత" విహారమను పేరుగల్గినది. ఇందెప్పు డును అర్హ్వాతులు నివసించుచుందురు. కపోతవిహార సమీప ప్రాంతమంతయు జనశూన్యమగు రాతిప్రదేశము. ఇచ్చట సస్యములు ఫలింపవు. ఈవిహారమునకు కడుదూరమునగాని జనసంకీర్ణమగు పల్లె లెవ్వియు గానబడవు. అందందు నివసించు జనుల మతభావములు విరుద్ధముగ నుండును. వారు, బౌద్ధధర్మ ముల నెఱుగని మూఢులు. బ్రాహ్మణమతముమున్నగువిమత ధర్మములైన నీదక్షిణాపథమున ప్రాబల్యము నొందినట్లు గన్పింపదు. రెక్కలపై నెగిరివచ్చి యీవిహారమును దర్శించి పోవు పురుషుల నెందరినో యీ ప్రాంతవాసు లనుదినమును జూచుచుందురు. ఒక్కమారు దూరదేశములనుండి యాత్రార్థము పాదచారులై యీప్రాంతమున కరుదెంచిన పాంథుల గాంచి యీ విహారసమీపమున నివసించుజను లీవిధమున ప్రశ్నించిరి. "ఆర్యా! మీరిట్లు పుడమిపై నడచి వచ్చుచుంటి రేల? ఇచ్చటి కరుదేరు యాత్రికు లెల్లరు విహంగములభాతి గగనపథమున నెగిరివచ్చెదరే!" అందుల కాయాత్రికులు, "మాకింకను పక్షము లేర్పడలేదు. అందువలననే పాదచారుల మై పోవుచుంటిమి" అని ప్రత్యుత్తర మొసగి వెడలిపోయిరి.

దక్షిణాపథ మంతయు జొరశక్యముగాని పర్వత ప్రదేశము. ఇచ్చట బాటల సౌకర్యము లంతగా లేకపోవుటచే నీ ప్రాంతమున ప్రయాణ మొనర్చుట మిగులకష్టము. దుర్గమారణ్యభూములలో ప్రయాణముసల్పి తెరిగిన పాంథులైన నీ పర్వతసీమల నొంటరిగ బ్రయాణముజేయ సాహసింపరు. ఈ ప్రాంతమును దర్శింప నభిలషించు తెరువరులు మున్నుగా తమ యభిమతము నీ దక్షిణాపథమునేలు రాజేశ్వరున కెరుక పరుపవలయు. అంతట నీతడు తనచారుల నాపథికుల వెంట నంపి మార్గమధ్యమున వారల కెట్టిహానియు సంభవింపకుండ నంచెలపై వారిని గమ్యస్థానమును జేర్చును.

మన ఫాహియాను దక్షిణాపథమును దర్శింపలేదు. ఐన నీ విశేషముల నా ప్రాంతవాసులవలన నెరిగి ఇచ్చట వర్ణించి యున్నాడు.

---

A. SubbaRao.

146

# ముప్పదియారవ ప్రకరణము

## పాటలీపుత్రము.

కాశీక్షేత్రమునుండి మనపాంథులు ప్రాగ్దిశగా మరలి మరల పాటలీపుత్రమునకు బోయిరి. వినయసూత్రగ్రంథముల వెదకి కొనిపోవుటకే ఫాహియాను ఆర్యావర్తమునకు బయలు దేరెను. కాని ఉత్తరభారతమం దెచ్చటను లిఖింపబడిన సూత్రగ్రంథములు లేకపోయినవి. పెక్కు పురుషాంతరములనుండి నేటిదనుక కంఠస్థమై వాగ్రూపమున విలసిల్లుటయె గాని యీ సూత్రము లుత్తరఖండమున నెచ్చటను గ్రంథస్థము గాలేదు. అందుచేతనే మన ఫాహియాను, ఉత్తరదేశమంతయు తిరిగితిరిగి తుదకు మధ్యభారతమునకుగూడ రావలసి వచ్చినది.

ఇచ్చట నదృష్టవశమున నొక మహాయానవిహారమున వినయసూత్రప్రతి యొకటి యాతనికి లభించినది. ఇం దుదహరింపబడిన సూత్రములు శాక్యసింహుని నిర్వాణమునకు పూర్వమునుండియు బౌద్ధభిక్షువులచే నాచరింపబడుచు ప్రథమ బౌద్ధమహాసభయం దంగీకరింపబడినవి. ఈప్రతియొక్క మాతృక పెక్కుశతాబ్దములనుండి సువర్ణవనవిహారమున* బరిరక్షి

* ఫాహియాను దర్శించిన కాలమునాటికి సూత్రగ్రంథము జీర్ణమై యదృశ్యమై యుండనోపు. లేనియెడల యితఁడీగ్రంథమును జేకొని యుండును.

తమై యున్నది. దీనికి పదునెనిమిది ప్రతులు లిఖింపబడినవి. ఈప్రతు లన్నిటికిని వ్యాఖ్యానములుగూడ వ్రాయబడినవి. ప్రధానవిషయములయం దీప్రతులలో విభేదములు గన్పింపవు. అచ్చటచ్చట కొన్ని తావులందు తారతమ్యము♦ లున్నను నవి యంతగా పాటింపతగినవికావు. మన ఫాహియానునకు లభించి నది సంపూర్ణప్రతి. అందు వ్యాఖ్యలుగూడ గలవు.

ఇంతియగాక మనపథికున కిచ్చట "సర్వాస్తివాద" శాఖీయుల* సూత్రగ్రంథముగూడ యొకటి లభించినది. ఈసూత్రము లేడువేల గాథ ♦ లలో (శ్లోకములు) వ్రాయబడినవి. చీనా సామ్రాజ్యమునందలి శ్రమణకులచే ననుకరింపబడుసూత్రము లివియే. ఇవియు పెక్కుశతాబ్దము లిచ్చట కంఠస్థమై వరలినవి. మరియు నీ సంఘారామమున, "సంయుక్తాభిధర్మహృదయ" శాస్త్రమును (ఏడువేల శ్లోకములు గలది), రెండువేల శ్లోకములలోనున్న యొన్ను *సూత్రగ్రంథమును, "వైపుల్యపరినిర్వాణ" సూత్రములలోని యొక ప్రకరణమును

♦ ఈవిభేదము లెట్లుగలైనో యూహింప శక్యము గాకున్నది.

* వైభాషిక మహాశాఖలోని యొక యుపశాఖ. దృష్టికి గోచరించు సర్వభూతములును నిత్యమని వీరివాదన.

♦ బౌద్ధవాఙ్మయమున "గాథ" యన శ్లోకమనియర్థము. ఈ గాథలకు సాధారణముగ రెండేసి భేదములుండును. వీనికి ఛందోనియమములు గూడ గలవు.

* ఈ సూత్రము లేవియో తెలియవచ్చుట లేదు.

మహాసాంఘిక ♦ అభిధర్మ సూత్రములనుగూడ మనయాత్రికునకు లభించినవి.

ఫాహియానుని యన్వేషణము ఫలించుటచే నాతడు సంస్కృతభాషనభ్యసించుచు సంస్కృతగ్రంథములపఠించుచు వినయసూత్రములకు ప్రతులవ్రాయుచు మూడువత్సరములిచ్చటనే (పాటలీపుత్రమున) గడపెను.

ఇంతలో నాతనిమిత్రుడగు "టోచింగు" ఉత్తరభారతఖండమంతయు గ్రిమ్మరి పాటలీపుత్రముననున్న ఫాహియానుని గలిసికొనెను. టోచింగు మధ్యభారతమున నివసించు శ్రమణకుల యాచారనడవడుల గాంచియు, వారల విమలవర్తనముల వీక్షించియు నివ్వెరపడి తన మాతృదేశమగు చీనాసామ్రాజ్యమునందలి సోదరశ్రమణకు లిట్టి శిక్షణనియమముల పాటింపకుండుట సంతాపకరమని తలపోయుచు నిట్లు చింతింపసాగెను: "నేను బుద్ధత్వము * నొందువరకు నన్యదేశములలో జనింపకుందునుగాక!" అని కృతనిశ్చయుడై

---

♦ "మహాసాంఘిక" యన "బౌద్ధమహాజనసభయందు తర్కింపబడిన" యని యర్థము.

* బుద్ధత్వమునొందుటయే శ్రమణకుల వాంఛితము. ఇది పెక్కుజన్మములెత్తినగాని సిద్ధింపదని బౌద్ధులసిద్ధాంతము. భారతవర్షమున నివసించుటవలన బుద్ధత్వము శీఘ్రకాలముననే లభించునని టోచింగు యాత్రికుని విశ్వాసము.

టోచింగు సిన్ను రాజ్యమునకు దిరిగిపోవక యార్యావర్తముననే యుండిపోయెను. అచ్చటనే తుదకు మృతినొందెను. కాని ఫాహియాను సూత్రగ్రంథముల సిన్ను రాజ్యమునకు గొనిపోవుటకే యరుదెంచె గావున నాతడిందుండనొల్లక తక్షణమే చీనా రాజ్యమునకు తిరిగి పయనమయ్యెను.



# ముప్పదియేడవ ప్రకరణము

## చంపా, తామ్రలిప్తి రాష్ట్రములు.

ఫాహియాను భారతఖండమునువీడి సింహళమునకు బోవును.

పాటలీపుత్రమునువీడి మన పాంథుడు ప్రాగ్దిశాభిముఖుడై గంగాతీరమునంటి పదునెనిమిది యోజనము లరిగి చంపా♦ రాజ్యమును జేరెను. ఇది గంగాతరంగిణికి దక్షిణతీరమున విస్తరిల్లిన యొక విశాలరాజ్యము. ఇందు బుద్ధుని విహార మొకటి గలదు. ఇచ్చట శాక్యసింహుడు ధ్యాననిమగ్నుడై తన విహార సమీపమున పచారుజేసిన తావునను, బుద్ధచతుష్టయము కూర్చుండి భాషించిన పవిత్రవాటికయందును స్తూపములు నిర్మింపబడినవి. ఈ స్తూపపరిసరములందు పెక్కు శ్రమణకులు నివసించుచుందురు.

ఇచ్చటనుండి మరల పయనమై మన బాటసారి తూర్పుదెసగా నేబదియోజనములేగి తామ్రలిప్తి* రాజ్యమును గాంచెను. దీని రాజధాని యొక గొప్ప రేవుపట్టణము.

---

♦ "బాగిలీ" పురమునకు మూడుమైళ్ళదూరమున నున్న నవీన చంపానగరసామీప్యముననే యీ రాజ్యము విలసిల్లెను.

* హుగ్లీనదీ ముఖద్వారమున నున్న ప్రస్తుత "టామ్లూకు" పట్టణ పరిసరములందే యీరాజ్యము విస్తరిల్లినది. ఈ టామ్లూకే ప్రాచీనతామ్రలిప్తి. పూర్వకాలమున ఈనగరము చీనాసింహళరాజ్యములతో అపారమగు వాణిజ్యము నడిపి ప్రఖ్యాతిగాంచిన రేవుపట్టణము.

ఈ రాజ్యమున ఇరువదినాల్గు బౌద్ధమఠములు గలవు. అన్నిటిలోన శ్రమణకులు గలరు. బౌద్ధమత మీ రాజ్యమున మిగుల వ్యాప్తిగాంచినది. సూత్రములకు ప్రతులువ్రాయుచు అచ్చటి విగ్రహములకు చిత్తరువులు గీయుచు మనయాత్రికు డిచ్చోట రెండు హాయనము లుండెను.

పిమ్మట నీత డొక పెద్దవర్తకపు టోడనెక్కి సముద్ర జలముల దేలుచు ఆగ్నేయదిశగ బోవసాగెను. శీతకాల మప్పుడే ప్రారంభమైనది. గాలి యనుకూలముగ వీచు చుండెను. పదునాల్గురోజు లట్లు దివారాత్రములు సముద్ర యాన మొనర్చిమన ఫాహియానుసింహళ• ద్వీపమును జేరుకొనెను. తామ్రలిప్తినగరమునకు సింహళరాజ్య మేడువందల యోజన ముల దూరమున్నదని తద్ద్వీపవాసులు జెప్పెదరు.

ఈ రాజ్య మేబదియోజనముల వెడల్పును ముప్పది యోజనముల పొడవును గల్గిన యొకమహాద్వీపమున విలసిల్లు చున్నది. ఈ దీవి కిరుకెలకులందును దూరదూరముగ చెదరి యున్న నూరు చిన్నద్వీపములుగలవు వీనన్నిటిలోన నమూల్య మగు రత్నములు ముత్తియములు పుష్కలముగ దొర కును. ఇం దొక ద్వీపమున, స్వచ్ఛమై కాంతివంతములగు

---

• "సింహళ" యను నది భారతఖండనివాసియగు ఒకానొక వర్త కుని నామము. ఈసింహళుడే యీ ద్వీపమును కనుగొనెనని ప్రతీతి. ఈతని జనకుని పేరు సింహుడు. అందుచేతనే యీద్వీపమునకు సింహళద్వీపమనియు సింహద్వీపమనియు పేరుగల్గెను.

మణిపూసలు లభించును. సింహళేశ్వరుని సేవకానీక మేవేళ నీద్వీపమును కావలిగాయుచుండును. ముత్తియముల దీయువారలు తాము ప్రోవుచేయు ముత్తియములలో పదింటికి మూడు ముత్తియముల నృపున కొసగవలయును.



# ముప్పదియెనిమిదవ ప్రకరణము

## సింహాళము.

తొలుత నీసింహాళద్వీప మంతయు నిర్జనారణ్య భూమియై నాగులకును భూతములకును నిలయమై భీతి గొల్పుచుండెడిది. ఈ భూతములతోడనే వణిజులు పూర్వకాలమున వర్తక వ్యాపారముల నెరపు చుండువారు. వాణిజ్యము జరుగునపు డీభూతము లదృశ్యము లగుచుండెడివి. వానికడనుండు నమూల్య వస్తుచయములపై చీట్ల వ్రేలగట్టి యాపత్రములపై వస్తువుల మూల్యముల లిఖించి వాని నాపణప్రదేశమున ప్రదర్శించి పోవుచుండెడివి. వర్తకు లామూల్యముల నొసగి యా సంబారముల గొనిపోవుచుండిరి. ఇట్లు వణిక్సంఘముల రాకపోకలచే నీ ద్వీప సౌభాగ్య సౌందర్యములు ప్రపంచమున వెల్లడియై అన్యదేశములనుండి పెక్కుజనసంతతుల నాకర్షించెను. ఇట్లే ఈద్వీపమంతయు జనసంకీర్ణ మైనది.

ఇచ్చట శీతోష్ణస్థితు లత్యంతమనోహరములై హాయి గొల్పుచుండును. గ్రీష్మహేమంతఋతువుల కిచ్చట తారతమ్యమే కన్పింపదు. సర్వకాలములయందును ఇచ్చట సస్యములు ఫలించును. తరులతాదులు ఫలపుష్పముల నొసగును. ఇచ్చటి జనులు తమ యిచ్చవచ్చినప్పుడెల్ల సేద్యము జేయుచుందురు. కృషికి ఈ ద్వీపమున ఋతునిర్ణయము లేదు.

ఈ రాజ్యమున నివసించు క్రూరనాగుల వికృతాకార ములఁ బోఁగొట్టి వారికి మనుష్యరూపముల ప్రసాదించి బౌద్ధ ధర్మముల నుపదేశించుటకై మున్నొకసారి శాక్యసింహుఁడీసింహళద్వీపమును దర్శించెను. ♦ అప్పు డాతఁ డీద్వీపపురాజధాని కుత్తరభాగముననున్న ప్రదేశమున నొక్క యడుగును, అచ్చటికి బదునైదు యోజనముల దూరముననున్న "సమస్త కూటపర్వతాగ్రమున"* నొక్కయడుగును వైచెను. ఆతని యడుగుజాడ లింకను ఈ ప్రదేశములందు గాన్పించును. రాచనగరు కుత్తరమున బుద్ధుఁడు తన పాద ముంచిన తావున సింహళరాజ్యవిభుఁ డొక పెద్దస్తూపమును గట్టించెను. ఇది నన్నూరడుగుల యున్నతిగల్గి సువర్ణవిరాజితమై మణిస్థగితమై యొప్పారుచున్నది. దీనిచెంతనే యీరాజ్యనృపుఁ డొక విహార

♦ శాక్యసింహుఁడు సింహళద్వీపమునకేగెనా యనుయంశమింకను సంశయాస్పదముగనె యున్నది. ఐనఫాహియాను దర్శించినకాలమునాటికె (అనగా నైదవ శతాబ్దారంభమునాటికె) యిచ్చట బౌద్ధమతము వ్యాపించి యుండెనని ఫాహియాను వ్రాతలవలన స్పష్టమగుచున్నది. అశోక సార్వభౌముఁడు క్రీ. పూ. 250 సంవత్సరప్రాంతమున తన తనయుఁడగు మహీంద్రు నంపి యీద్వీపమున బౌద్ధమతము వ్యాప్తిజేయించెనని చరిత్ర పరిశోధనల వలనదేలుచున్నది. అప్పుడు "టిస్స"నృపుఁడు సింహళద్వీపము నేలుచుండెను.

* ఇప్పుడు "ఆడమ్సు పర్వత శృంగ"మని వ్యవహరింపఁబడుచున్నది. దీనికి సంస్కృతమున "సమస్త కూట"మనిపేరు. దీనియగ్రభాగమున నైదడుగుల మూడుమ్మూప్పాతికంగుళముల పొడవును రెండున్నర యడుగుల వెడల్పును గలిగిన యొకపల్లముగలదు. దీనినే హిందువులు శివునిపాదమనియు మహమ్మదీయు లాడమ్సుపదాబ్జమనియు, బౌద్ధులు బుద్ధునిపదచిహ్నమనియు భావింతురు.

మును గూడ నిర్మించెను. దీనికే "అభయగిరి*" విహారమని పేరు. ఇప్పు డీమఠమున నైదువందల బౌద్ధసన్యాసులు గలరు. ఇందు "బుద్ధమండప" మనునామమున బరగు సుందరమంటప మొకటిగలదు. ఇది బంగరు నగిషీలతోడను మణిద్యుతుల తోడను కన్నుల మిరుమిట్లు గొల్పుచుండును. ఈమంటపమున మరకతమణులతో చెక్కబడిన బుద్ధవిగ్రహ మొకటి గలదు. ఈ మూర్తి యిరువది యడుగుల పొడవుగల్గి రత్నఖచితమై రమణీయముగ నున్నది. దీనివదనసౌష్టవము చూపరులహృదయ సీమలందు ప్రశాంతభావముల స్ఫురింప జేయుచు గంభీరముగ నున్నది. ఈ ప్రతిమ దక్షిణహస్తమున నొక యమూల్య మౌక్తికము గలదు.

ఫాహియాను తనమాతృదేశమును వీడి పెక్కువత్సరము లయ్యెను. ఈత డేకాకియై యెన్నడునుజూచియెరుగని దూర దేశముల దిరుగుచుండెను. తన్నివాసులు తన కపరిచితులు. తా గాంచుదృశ్యములు నూతనములు. పసితనమునుండియు తా నెరిగిన నదీ శృంగములు మహీరుహశ్రేణు లెవ్వియు కంటికి గాన బడవు. తనతో ప్రయాణ మొనర్చిన సోదర యాత్రికులు

---

* భయము వాపుశైలమని యర్థము. 'అభయగిరి'యను స్తూప మొకటి నేటికిని సింహళమున గలదు. ఈద్వీపమున గల స్తూపములన్నిటిలో నిదిమిగుల పెద్దది. ఇది క్రీ. పూ. 90 సంవత్సరమున పాటలీపుత్ర మహాసభానంతరము, బుద్ధుడు కైవల్యమునొందిన మూడువందల ముప్పది వత్స రములకు "వటగామిని" నృపాలునిచే నిర్మింపబడిన దని తెలియుచున్నది. ఈతని రాజ్యకాలముననే పిటకత్రయము గ్రంథస్థము గావింపబడినది.

తన్ను బాసిరి. కొందరు మృత్యువువాత బడిరి. మఱికొందరు వేరుమార్గముల బట్టిపోయిరి. తానుఛాయామాత్రసహచరుడై పరదేశమున దిరుగ వలసెను. వీని నన్నిటిని దలచుకొని మన ఫాహియాను విషాదపూరితు డయ్యెను. ఆతని హృదంతరాళమున విచారభావము లావరించినవి. ఆత డనిర్వాచ్యమగు మనోవేదన ననుభవింపసాగెను. ఒక్కనాడు మరకతవిగ్రహముచెంత నొక వణిజుడు తెల్లని చీనాంశుకనిర్మితమగు నొక తాలవృంతము నామూర్తికి సమర్పించుచుండెను. మనపాంథు డాతనిజూచి చకితు డయ్యెను. ఆతని ముఖలక్షణములు వీక్షించినంతనె యాతని కనుగవలనుండి యశ్రుజలములు జలజల రాలినవి.

పూర్వ మీద్వీప మేలిన నృపవరు డొకడు మధ్యభారతమునకు దన చారులనంపి బోధివృక్షశాఖ నొకదానిని దెప్పించి బుద్ధమంటప సామీప్యమున బాతించెను. ఈకొమ్మ వేరుదొడగి రెండు వందల యడుగుల యెత్తునకు బెరిగి మహావృక్ష మయ్యెను.* కొంతకాలమున కీమహీ

♦ ఈవీవన నొసంగినవర్తకుడు చీనాదేశమునుండి యరుదెంచిన యొక పధికుడని తోచుచున్నది. ఆతనిజూచినంతనే యంతర్గర్భితమైయున్న యాతని హృదయ తాప మొక్కసారిగ పెల్లుబికెను. నేత్రయుగ్మమునుండి బాష్పధారలు గురిసెను.

* సింహళద్వీపమున విలసిల్లు ప్రఖ్యాతబోధిద్రుమవృత్తాంతము నిచ్చట మనఫాహియాను సవిస్తరముగ వర్ణించియున్నాడు. ఈపాదపమిప్పటికిని సింహళమున గలదు. బౌద్ధధర్మముల బోధించుటకై అశోకతనయుడగు మహేంద్రుడు సింహళమునకు బోయెనని వేరొకచోట జెప్పియుంటిమి.

156 (b)



సింహళద్వీపమందలి ప్రఖ్యాతబోధిద్రుమము. ప్రపంచములోనికెల్ల నత్యంత ప్రాచీనమగు వృక్షరాజము.

(156)

రుహ మాగ్నేయదిశగా నొరగిపోవుటచే సింహళరాజ్య నృపు డది నేలబడిపోవునేమోయని భీతిల్లి యెనిమిదిజానలకై వారము గల్గిన యొక కాష్ఠమును దానికి ఊతగా బెట్టించెను. ఈ కట్ట వృక్షమునుతారసిల్లినచోట నాతరుపు చిగిరింపదొడగెను. ఒకయంకుర మాతరుకాండమును చీల్చుకొని క్రిందికి దిగి భూమిలో బ్రవేశించి వేరుల దొడిగినది.

ఈ యంకురపు కైవార మిప్పుడు నాలుగు జాన లుండును. ఈయూడ చీల్చుకొని పోవుటవలన నా కాష్ఠము పొడుగునను చీలి బ్రద్దలైనను కాష్ఠశకలము లాయంకురము నుండి తొలగిపోవక దాని నంటియే యున్నవి.

ఈ పాదపముక్రింద నిప్పు డొక విహారము నిర్మింపబడి

---

తనకు చేదోడుగానుండుటకై యీతడుతనచెలియలగు "సంఘమిత్ర"నుగూడ తనకడకు రావించుకొనెను. ఈమె బౌద్ధభిక్షుణియై బౌద్ధమతప్రచారమునందే తనజీవిత మంతయు ధారవోసిన మహాసాధ్వి. తపస్విని. ఈసన్యాసిని సింహళ ద్వీపమునకు బోవుచు బుద్ధగయాక్షేత్రమందలి బోధివృక్షశాఖను నొక దానిని దీసికొనిపోయి యచ్చట బాతించెను. ఇదిపెరిగి మహావృక్షమయ్యెను. ఇదియే యితిహాసప్రసిద్ధమై భూమండలములోని కెల్ల మిగులపురాతన వృక్ష మనిపేరువడసిన బోధిద్రుమము. దీనికంటెను పురాతనమగు వృక్ష మీప్రపంచమున లేదని చరిత్రపరిశోధకులు నిర్ణయించియున్నారు. ఇదిరెండు వేల హాయనములనుండి జీవించుచున్నది. సింహళనృపుడు తనచారుల గయా క్షేత్రమునకంపి, రావికొమ్మను దెప్పించెనని ఫాహియాను డీమహీరుహ జన్మవృత్తాంతమును వేరొకవిధమున వర్ణించియున్నాడు. ఈతడు మహేంద్ర సంఘమిత్రల కథనమును వినియుండలేదని యూహింపవలసివచ్చుచున్నది.

యున్నది. ఆసీనుడై యుండినట్లు చెక్కబడిన బుద్ధవిగ్రహ మొకటి యిచ్చోటగలదు. బౌద్ధయాత్రికు లెడ తెరపిలేక యీమూర్తి నెప్పుడును దర్శించి పోవుచుందురు.

సింహళద్వీపరాజధానియందింకొక విహారముకూడ గలదు. ఇది బుద్ధుని దంతమునకై కట్టబడినది. సప్తమణి విరాజితమై మనోహరముగ నున్నది.

సింహళప్రజల భక్తివిశ్వాసములు మనయాత్రికున కాశ్చర్యముగొల్పినవి. ఈరాజ్యవిభుడును మిగులభక్తిపరుడు. మతధర్మముల నాతడు కడుభక్తిశ్రద్ధలతో నిర్వర్తించును. రాజ్యస్థాపనమైననాటనుండియు నీద్వీపమున పోరాటములు శూన్యములైనవి. విప్లవములు జనింపలేదు. అనావృష్టిదోష మావహిల్లినదిలేదు. క్షామదేవత పొడగానరాకుండెను. ప్రజలెట్టి కష్టమునెరుగక హాయిజెందిరి.

ఈద్వీపమందలి శ్రమణకుల ధనాగారమున మణులు, రత్నములు, మౌక్తికములు కుప్పలు బడియున్నవి. ఒక్కమారు సింహళరాజ్యమును బాలించునృపాలు డొక్కడీభాండారమును దర్శించుట సంభవించినది. ఆమణిరాసుల జూచి యాతని కన్నులు గుబ్బెను. వాని గొనిపోవలెనను దురాశ యాతనిహృదయమునజనించినది. కానిమూడుదినములైనగతింపకమున్నె యాతని మనస్సువిరిగిపోయెను. ఆతడుపశ్చాత్తప్తుడై శ్రమణకులకడ కేగి శిరమును నేలపై గొట్టుకొని తాను దుర్భావప్రేరితుడై నందుల కెంతయు పరితాపము నొందుచు "శ్రమణకులారా! రాజ్యాధిపునైన నీబొక్కసమున నడుగువెట్టనీయకుడు. సన్యాసి దీక్ష

గైకొని నలువది దీర్ఘ వత్సరములు తిరిపె మెత్తికొనుచు దేశాటన మొనర్చిన విరాగులుదక్క నన్యు లెవ్వరును దీని ప్రవేశింపరాదని కఠినముగ శాసింపుడు" అని విలపించెను.

సింహళనగరమున వైశ్యకుటుంబము లెన్ని యోగలవు. వారిగృహములు రాజసౌధములవలె వైభవోపేతము లై రమణీయముగ నున్నవి. పురవీధులన్నియు చదునై విశాలములై మలినవిహీనములై ప్రశాంతములుగ నున్నవి. నాలుగువీధులును గలసిన మొగదల ప్రదేశములందు పెద్ద పెద్ద సభామంటపములు నిర్మింపబడినవి. ప్రతిమాసమునను అష్టమి, చతుర్దశి, పూర్ణిమ దినములం దీమంటపములలో సభలు గావింపబడి బౌద్ధధర్మములుపదేశింపబడును. ఆదినములలో నీసభామందిరములన్నియు జనులతో గిటకిట లాడుచుండును. మతోపదేశముల నాలకించుటకై పురజనులు పలుప్రాంతములనుండి యీసభాస్థలములకు గుంపులు గుంపులుగ తరలి పోయెదరు.

సింహళద్వీపమున నరువదివేల బౌద్ధసన్యాసులు గలరని ప్రతీతి. వీరికి భోజనముల పెట్టుటకు అన్న సత్రములు కట్టింపబడినవి. సింహళ నృపుడు తన రాజధాని నగరమున నైదారువేలబౌద్ధశ్రమణకుల కనుదినమును భోజనము లిడుటకై ధర్మశాలల నిర్మించెను. భిక్షువులు క్షుద్బాధాపీడితులై నవుడెల్ల నీధర్మశాలల కరిగి తమ కక్షపాలలనిండ నన్నమును గొని వచ్చి భుజించుచుందురు.

ఇచ్చట ప్రతియేడును "దంతమహోత్సవములు" జరుగును. ఈ యుత్సవములు జ్యేష్ఠ మాసాంతమున ప్రారంభ

మగును. ఉత్సవప్రారంభమునకు ముందుగ సింహళవిభు డొక మత్తేభమును రావించి నేత్రపర్వముగ దాని నలంకరించి రాచయుడుపుల దొడిగిన యొక మనుజుని దానిపై గూర్చుండ నియమించును. ఈ మనుజు డాదంతావళముపై నధివసించి భేరీ మ్రోగించుచు పెద్దకంఠస్వరముతో నిట్లుపన్యసించుచు నా గజమును పురవీధుల వెంబడి దోలుకొని పోవుచుండును. "బోధిసత్త్వుడు మూ డసంఖ్యేయకల్పములు * లోకకల్యాణమునకై భూమండలమున సంచరించెను. ధర్మసంస్థాపనకై తన జీవముల ధారవోసెను. రాజ్యవైభవముల బరిత్యజించెను. దారాసుతుల విడనాడెను శరీర సౌఖ్యముల తృణీకరించెను. తన నయనముల బెరికి సోదరమానవునకు కానుకగ నొసగెను. తన మేని కండలగోసి సాళువమునకు విసరి భయార్తయగు కపోతవిహంగమును రక్షించెను. తన శిరమును దరిగి యొకమనుజునికి దాన మిచ్చెను. ఆకలిగొన్న వ్యాఘ్రమునకు తన దేహము నాహారముగ నిడెను. ఈప్రపంచమునందలి జీవరాసుల క్షేమమునకై ఆత డిట్టిబాధల ననుభవించెను. బుద్ధ

---

* సృష్ట్యాది లయపర్యంతము వ్యాపించుకాలము కల్పమనబడును. అట్టి కల్పములు పెక్కు గలిసి యొక అసంఖ్యేయకల్ప మగును. అట్టి యసంఖ్యేయకల్పములు నాలుగు గూడిన యొకమహాకల్ప మగును. చీనాగణిత శాస్త్రజ్ఞు లసంఖ్యేయమన, 1,000,000,000,000,000,00 గల సంఖ్య యని నిర్ణయించి యున్నారు. త్రివిష్టప, సింహళ శాస్త్రజ్ఞులు అసంఖ్యేయ మన యొకటితరువాత తొంబది బిందువులు గల సంఖ్యయని నిర్వచించి యున్నారు.

డై అత డీ భూవలయమున నలువదియైదువత్సరములు జీవించి మానవాళికి బౌద్ధ ధర్మముల నుపదేశించెను. వేలకొలది ప్రజానీకమునకు బౌద్ధదీక్షయొసగెను. ఆత్మశాంతిలేక పరితపించెడుమానవులకు చిత్తశాంతి నొనగూర్చి కైవల్యపదమునకు దారిజూపెను. జీవకోటులకు తా నొనర్పవలసినదంతయు నొనర్చి యాత డీలోకమును వీడిపోయెను. అప్పటినుండియు (పదునాల్గు వందల తొంబదియేడు వత్సరములనుండి) పృథ్వీమండలమున ఆజగజ్జ్యోతి అస్తమించినది.జీవరాసు లన్నియు దుఃఖమున మున్గియున్నవి. "ఇంక పదిదినములలో బుద్ధునిదంతము బయటకు దీసికొనిరాబడి, అభయగిరివిహారమునకు గొనిపోబడును. కాన ప్రజ లందరును, సౌఖ్యముల బడయదలతురేని, పురవీథుల నూడ్చి సలిలముల జల్లుడు. గృహావళుల మనోహరముగ నలంకరింపుడు. కుసుమజాలములను కర్పూరాది పూజాద్రవ్యములను సమకూర్చి దంతమున కర్పింపుడు." ఇట్లు ప్రకటించుచు నా మనుజుడు పురవీథులన్ని దిరుగును.

పిమ్మట సింహళాధిపుడు, సామ, సుదాన, గజరాజ, హరిణ, అశ్వ మున్నగు బోధిసత్త్వుని యవతార ♦ విగ్రహ

---

♦ బోధిసత్త్వు డిట్టియవతారముల నైదువందల నెత్తెనని బౌద్ధ వాఙ్మయమున వర్ణింపబడినది

సామ—ఈ యవతార కథనము "సామజాతకమున" వర్ణింపబడినది. ఈ యవతారమున బోధిసత్త్వుడు సౌదామినీలతయై భూమండలమున మెరసెను.

సుదాన— బుద్ధావతారమునకు బూర్వపు యవతారమునం దీ వృత్తాంతము "వెస్సంతర" జాతకమున వర్ణింపబడినది. ఈ యవతార

ములను తననగరి ప్రధానవీధి కిరుకెలకులందును బ్రదర్శించును. ఈ చిత్తరువులు భావగర్భితములై జీవకళ లుట్టిపడున ట్లత్యంత మనోహరముగ జిత్రింపబడినవి. జీవములతో నున్నవా యని చూపరుల మనముల భ్రమింపజేయుచుండును.

అనంతరము బుద్ధునిదంత మీమార్గముననే అభయగిరి విహారమునకు గొనిపోవబడును. మార్గమధ్యమున ప్రతియింటి వాకిటను జను లీదంతమునకు నీరాంజనములిచ్చి కుసుమఫలాదు లొసగి జోహారు లొనర్తురు. ఇట్లీదంతము మహావైభవముతో గిరి విహారము జేరును. అచ్చట తొంబది యహర్నిశములు మహో త్సవములు గావింపబడును. వీని నవలోకించుటకై పలుప్రాంత ములనుండి వేలకొలది జనసంతతు లరుదెంచును. విహారపరి సరము లన్నియు జనసమూహములచే గిక్కిరిసిపోవును. ఉత్స వములు సమాప్తియైనపిమ్మట నీదంతము మరల పురమందలి విహారమునకు గొనిపోబడి యథాస్థానమున నుంచబడును. ఉపవాసదినములందీవిహారద్వారములు తెరువబడి యథావిధిగ నారాధనకృత్యములు నిర్వర్తింపబడుచుండును.

---

మున "సుదానుడై" యుద్భవిల్లి, బోధిసత్త్వుడు మహాత్యాగియై, దానశీలుడై పరిఢవిల్లెను. సుదానావతారమున బోధిసత్త్వుడొక్కమారిట్లు బల్కినట్లు సుదానకథయందు జెప్పబడినది:— "ఈ పృథ్వి, సుఖదుఃఖముల నెరుగని యచేతన పదార్థమయ్యు నాదానకర్మలచే యుద్భవిల్లిన మహాశక్తిచే నేడు సారులు చలించినది." "సామ", "వెస్సంతర" జాతక కథావర్ణనలు సాంచి స్తూపశిల్పచిత్రములలో గాననగును.

తక్కినయవతారవృత్తాంతములుగూడ జాతకకథలలో సవిస్తరముగ వర్ణింపబడియున్నవి.

అభయగిరివిహారమునకు ప్రాగ్దిశగా నలువదిలీలదూరమున నొకపుణ్యశైలము • గలదు. ఈ నగోపరిభాగమున "భద్రిక" యనబడు విహార మొండు గలదు. ఇందు రెండు వేలమంది బౌద్ధసన్యాసులు నివసించుచుందురు. వీరిలో ధర్మగుప్తు డను శ్రమణకు డొకడు గలడు. మిగుల మహిమాఢ్యుడని యిచ్చటి ప్రజలెల్ల రీతనికి నమస్కరింతురు. ఈతడు నలువదివత్సరము లేకాగ్రముగ నొక పర్వతగుహాయందు నివసించెను. ఈతడు తన కారుణ్యప్రభావముచే మూషిక భుజంగముల నొకచెంతనే నివసింపజేయగలైను. ఈదుష్టజంతువు లీతని గహ్వారమున తమ సహజవైరమును మరచి చెలిమిగల్గి మనుచుండును.



• ఇయ్యది "మహింటాల" యనబడు నొక పుణ్యనగము. బోధివృక్షమునకు తూర్పుదెసగా నెనిమిదిమైళ్ల దూరమున నున్నది.

# ముప్పది తొమ్మిదవ ప్రకరణము

ఒకానొక యర్హాతుని దహనసంస్కారము.

సింహళపురికి దక్షిణభాగమున నొక యరకోసుదూర మున "మహావిహార" మను పేరుగల్గిన విహార మొకటి గలదు. ఇచ్చట ప్రసిద్ధుడగుశ్రమణకుడొక్కడునివసించువాడు. ఈతడు మిగుల సాధుశీలుడు. పరిమలవర్తనుడు. మహాతపస్వి. ఈ సన్యాసి అర్హాతుడని ప్రజలు చెప్పుకొనజొచ్చిరి. ఈతని నిర్యాణకాలము సమీపించినంతనే సింహళరాజ్యనృపు డతని ప్రేతమున కెట్టి దహనసంస్కారవిధులు గావింపవలెనో నిర్ణయించుటకై భిక్షువుల నందరిని బిలువనంపి యొకసభ గావించెను. సభాసదులందరు నాశ్రమణకశ్రేష్ఠు డర్హాత్వము నొందెననియు అర్హాతుని ప్రేతమువలెనే యాతని దేహమును సంస్కరింపబడవలెననియు నిర్ణయించిరి. నృపాలుడును ఇతడు దివి కేగినంతనే విధివిధానముగ అర్హాతుని ప్రేతమున కొనరింపవలసినరీతిని యాతనిమృతశరీరమున కగ్ని సంస్కారము గావించెను.

"మహావిహారము" నకు తూర్పుభాగమున నృపాలుడు ముప్పదియడుగుల చతురమును ముప్పదియడుగుల యున్నతియు గల్గిన యొక పెద్దచితిని బేర్పించి దానియుపరిభాగమున చందన, కర్పూర, కర్పూరాది సుగంధకాష్ఠముల బరిపించెను.

ఈ చితి నధిరోహించుటకు నాల్గువైపులను నాలుగు సోపాన శ్రేణు లమర్పబడెను. అర్హ్యతుని మృతకళేబరమునకు దెల్లని కాశ్మీరవలువ జుట్టి దాని నొక శవవాహనమున నుంచి చితి కడకు గొనిపోయిరి. నృపాలుడును, శ్రమణకులునుపాదచారులై శవము వెంట చితిప్రదేశమునకు బోయిరి. ఆదహనసంస్కారము నవలోకించుటకై జనసంతతులు వేలకొలది యా చితిప్రదేశమున మూగిరి. శవవాహనము దహనభూమిని జేరినంతనే అచ్చట జేరియున్న జనసంతతులు దానిపై కుసుమవర్షము గురిపించిరి. కొందరు కర్పూరహారతు లిచ్చిరి. పిమ్మట శవవాహనమును చితిపై నెక్కించి చితికాష్ఠములపై తులసి తైలమునుజల్లి చితి కగ్నిముట్టించిరి. చితానలము రగుల్కొని భగభగమని మంటలెగయుచుండ, చూపరులనుండి హాహాకారములు జనించెను. కొందరు తమ కంఠసీమలనుండి వ్రేలెడు యుత్తరీయములదీసి చితిపై విసరిరి. కొందరు తమ హస్తములనుండెకు తాళవృంతముల, గొంద రాతపత్రముల నాయగ్నిహోత్రమున బడవైచిరి. దహనసంస్కారము పూర్తియైన పిమ్మట నాయర్హ్యతుని యస్థికల నేరి వాని నొక్కచోట నిక్షిప్తమొనర్చి యాప్రదేశమున నొక స్తూపమును గట్టించిరి. ఫాహియాను సింహళద్వీపమున కొక్కింత యాలస్యముగ బోవుటచే నాయర్హ్యతుని జీవములతో జూచుభాగ్య మతనికి లేకపోయినది. కాని యాతని దహనసంస్కారమునుమాత్ర మీక్షింపగల్గెను.

ఈ తరుణమున సింహళరాజ్యమును పాలించురాజు ♦ బౌద్ధ సన్న్యాసుల యావాసమునకై నూతనవిహార మొకటి కట్టింపనెంచి భిక్షువుల బిలువనంపి యొకమహాసభ గావించెను. సభకు విచ్చేసిన శ్రమణకులకు భోజనాదులొసగి యటుపిమ్మట బలిష్ఠములై, మిసమిసలాడు నొక వృషభములజతను దెప్పించి వానిశృంగములకు మణిస్థగితములగుభూషల దొడిగి యొక బంగరునాగలి కాయెద్దులనుబన్ని నృపాలుడు తానే నాగలికఱ్ఱును హస్తమునబట్టి యొక విశాలభూప్రదేశమునకు నాల్గువైపులను నాలుగుచాళ్లనుగీచియామధ్యభాగమునవిహారమునుగట్టించెను. ఆపరిసరములనుండు గ్రామములను, మాన్యములను, గృహములను భిక్షువులకు దానమొసగి వార లాచంద్రతారకముగ ననుభవింప లోహఫలకములపై దానశాసనముల వ్రాయించెను.

ఫాహియాను సింహళద్వీపముననుండగ, ఆర్యావర్తము నుండి అచ్చటి కొక బౌద్ధసన్న్యాసి యేతెంచెను. ఈత డొక సూత్రపండితుడు. అత్యున్నతమగు నొక శిలావేదికపై నిలువబడి సూత్రముల పఠించుచు నీశ్రమణకు డిట్లుపన్యసింప దొడగెను:—

♦ ఈ నృపుడు క్రీ.శ. 410 సంవత్సరమునుండి 432 వరకును సింహళద్వీపము నేలిన "మహానాన" యై యుండును. ఈతనికి పూర్వము సింహాసన మధిష్ఠించిన "ఉపతిస్స" (368-410) నృపాలుని రాజ్యకాలమున పిటకాత్రయము సింహళభాషలోని కనువదింపబడెను. మహానానుని పరిపాలనమున "బుద్ధఘోషుడు" భాష్యముల వ్రాసెను. ఈరాజు లిరువురును పెక్కువిహారముల గట్టించి కీర్తివడసిరి. వీరి చరిత్రము "మహావంశమున" సాకల్యముగ వర్ణింపబడినది.

"బుద్ధునికక్షపాల తొలుత వైశాలీరాజ్యమున నుండెడిది. ఇప్పుడది గాంధారమునను న్నది. ఇన్ని శతాబ్దములైన పిమ్మట (ఫాహియాను శ్రమణకుడు వివరించిన సంఖ్య మరచిపోయెను) నిది పశ్చిమ తుఖారమునకు బోవును. ఇన్ని శతాబ్దములు దాటిన వెనుక కుస్తానమున కేగెను అచ్చట కొన్ని శతాబ్దములుండి యటుపిమ్మట ఖరస్కర ♦ దేశమునకు వెడలును. ఖరస్కరమునుండి తిన్నగ చీనాకు పోవును. అటనుండి సింహళమున కరుగును. సింహళమునుండి మరల మధ్యభారతమున కేగి యచ్చోటనుండి కడకు తుషితస్వర్గము నధిరోహించి యదృశ్యమగును. తుషితస్వర్గమున కేగినంతనే, మైత్రేయ బోధిసత్త్వుడీకక్షపాలనుగాంచి "శాక్యసింహుని కక్షపాల యరుదెంచిన" దని సంతోషధ్వానము లొనర్చుచు, తక్కిన యమరుల బిలువనంపి వారితో గలిసి దీని కేడుదినములు స్వర్ణకుసుమములతో పూజ లొనర్చి కర్పూర నీరాజనము లిచ్చును. తదుపరి యా కక్షపాల మరల జంబూద్వీపమునకు మరలిపోవును. జంబూద్వీపవాసియగు నొకనాగులరే డీకక్షపాల కెదురేగి, దానిని తన సౌధమునకుగొనిపోవును. మైత్రేయునకు బుద్ధత్వము సిద్ధించుతరుణ మాసన్నమైనతోడనే యీ కక్షపాల, నాలుగు కక్షపాలలుగ విడిపోవును. పిమ్మట నివి నాలుగును తమ నిజనివాసమగు "అన్నపర్వత" * శృంగమునకు బోయి చేరును.

---

♦ ఈ రాజ్యము టీన్‌షణ్ పర్వత శ్రేణులకు సమీపమున, బోష్టన్ సరస్సున కుత్తరభాగమున నున్నది.

* మేరువుచుట్టును వలయాకారముగనుండు పర్వతశ్రేణులలో నొక శ్రేణి.

మైత్రేయుడు బుద్ధుడైనవెనుక నల్వురు నిర్జరవిభు లీకషపాలల మరల నొక్కటిగ జేయుదురు. భద్రికల్పమున నవతరింపబోవు సహస్ర బుద్ధులును దీనినే గైకొందురు. ఇది భూమండలమునుండి యదృశ్యమైనపుడు, బౌద్ధ మత మస్తమించును. అంతట నీ క్షోణితలమున నివసించు ప్రజాళికి పెక్కుసంకటములు గల్గును. మానవులజీవిత పరిమాణము హ్రస్వ మగును. జను లైదేండ్లకంటె నెక్కువ కాలము జీవింపరు. భూమండలమున ధాన్యక్షీరములకు గరవగును. ప్రజ లుదుర్ణయులై దౌష్ట్యములకు గడగెదరు. వారు స్పర్శించు తిరులతాదులు ఖడ్గములు మున్నగు మారణోపకరణములు గ మారిపోవును. జను లొకరిపై నొకరు గవిసి, దారుణముగ బాదుచుకొని హతు లగుదురు. పృథ్వియంతయు రుధిర పూరితమైపోవును. వీరిలో సుజనులగువారలు తమ యావాసముల వీడి పర్వత ప్రాంతములకు బారిపోయి, ప్రాణముల గాచుకొందురు. దుష్టజను లందరు నిశ్శేషమైనపిమ్మట, వీరు మరల తమ నివాసములకు మరలి పశ్చాత్తప్త హృదయులై తమలో తామిట్లు చింతిల్లెదరు. "పూర్వకాలమున జనులు చిరకాలజీవులై వర్ధిల్లిరి. మనమో, అల్పజీవులమై ఐదేండ్లకే మృతినొందుచు క్షయ మొందుచుంటిమి. దురాచారులమై వర్తిల్లుటచేతనే మన కీ దురవస్థ సంఘటిల్లినది. మన యాయు వల్పమైనది. ఇప్పుడైనను సత్పథమున చరించెదము గాక ! ధర్మనిరతులమై, సోదరమానవులయెడ ప్రేమాస్పదులమై మెలగితిమేని మన యాయుఃప్రమాణము ద్విగుణీకృత

మగుచు నెనుబది వేల హాయనములవరకును వృద్ధినొందును. మైత్రేయ బోధిసత్వుడు భూలోకమున నవతరించి బౌద్ధ ధర్మముల నుపదేశింప మొదలుపెట్టునపుడు శాక్యసింహునిచే నుపదేశమంది సంసారసౌఖ్యముల త్యజించి, సన్యాసదీక్ష గైకొనినవారికిని, త్రిశరణ్యముల స్వీకరించి, పంచనిషేధములను అష్టవర్జితములను నుపవసించుచు మణిత్రయమును పూజించు వారలకును తొలుదొల్త కైవల్యము నొసగును. పూర్వకర్మ ఫలితముగ నీజన్మమున బౌద్ధమతస్వీకారము లభించువారలకు పిదప ముక్తినొసగును."

ఈ మనుజుని వాక్యపుంజములు సూత్రభాగములోని వని దలచి మనఫాహియాను వానిని వ్రాయబోవుచుండ నాతడు "ఈవచనములు నావియెగాని యేసూత్ర మూలము లోనివిని గా"వని తెల్పుటచే మన పధికుడు తత్ప్రయత్నముల విరమించి యూరుకొనెను.

---

# నలువదియవ ప్రకరణము

సింహళతీరమున నోడనెక్కి ఫాహియాను చీనాకు బోవును.

ఫాహియాను సింహళద్వీపమున రెండువత్సరములు నివసించి మరికొన్ని బౌద్ధగ్రంథముల సముపార్జించెను. "మహేశ" ♦ శాఖీయులకు ప్రమాణగ్రంథమగు వినయ పీఠికయు దీర్ఘాగమసంయుక్తాగమ సూత్రములును, *సంయుక్త సాంఖ్యపీఠికయు ‡ మున్నగు నపూర్వ సంస్కృతగ్రంథము లాతనికి లభించినవి. ఇవి చీనాదేశమున నెచ్చటను గాన రానివి. ఇట్టి యమూల్య గ్రంథరాజముల వెంటగొని యాత డొక పెద్దవర్తకనౌక నెక్కి సింహళమునుండి చీనా సామ్రాజ్యమునకు బయనమయ్యెను. ఈయోడపై నిన్నూరు మంది బాటసారు లుండిరి. తుపానువీచి ప్రమాదముసంభవించు నెడల, పాంథులప్రాణరక్షణార్థ ముపయోగపడుటకై చిన్న నావయొకటి యీనౌకకు వ్రేలాడగట్టబడి యుండెను. గాలి

♦ మహేశశాఖ సర్వాస్తివాదశాఖలోని యొక యుపశాఖ.

※ హీనయానసూత్రములకు "ఆగమము" లని పేరు. ఇవి చతుర్విభాగములుగ విభజింపబడినవి. అందు ప్రథమ విభాగమునకు దీర్ఘాగమము లనియు, తృతీయవిభాగమునకు సంయుక్తాగమములనియు పేళ్లు. ప్రథమవిభాగమున సన్యాసులు పాటింపవలసిన శిక్షణనియమములు వివరింపబడినవి.

‡ ఈ పీఠిక బౌద్ధవాఙ్మయమున చతుర్థపీఠికగ బరిగణింపబడెను. కాని బౌద్ధవాఙ్మయమున నిప్పుడీగ్రంథ మెచ్చటను గానరాకున్నది. కాలవాహినిలో గలిసిపోయి యుండవలెను.

యనుకూలముగ వీచుచుండ ప్రాగ్దిశాభిముఖయై యోడ మెల్లగసింహళతీరమునుండి బయలుదేరి, మూడుదినముల వరకును సురక్షితముగ బ్రయాణమొనర్చినది. నాల్గవదినమున నాకసమున తుపానులక్షణములు గన్పించినవి. క్రమముగ సమీరములు ప్రచండమై భీకరమయ్యెను. ఈ ప్రళయ మారుతమునకాయోడ మద్యమునుద్రావి మత్తిల్లిన మనుజునివగిది నడిసముద్రమున నూగులాడజొచ్చినది. తీవ్రవాయుఘాతముల భరింపజాలక మరికొంతవడి కది పగిలి చిల్లివడెను. ఆరంధ్రమునుండి జొరజొరసముద్రజలములు లోనికి ప్రవహింపదొడగినవి. ఆ యోడలోని బాటసారులగుండె లవిసిపోయెను. ఓడలోనుండిన చావునిక్కమని భీతిజెంది వార లోడకు గట్టబడియున్ననావలో నెక్కి ప్రాణముల రక్షించుకొనుటకై త్రొక్కులాడజొచ్చిరి. కాని యదియు నసంభవ మయ్యెను. ఆచిన్ననావలో నిన్నూరుపాంథు లొడ్డుచేరు టెట్లు? అందరును యాత్రుదనాకలోని కురుకుటకు సిద్ధమగుచుండ, ప్రమాదము వాటిల్లు నని దిగులొంది యోడనావికులు సాహసించి నావకు గట్టబడియున్న త్రాళ్లను తెగనరికిరి. నావ తృటిలో నాభయంకరసముద్రమునబడి యదృశ్యమై పోయినది. పాంథులయాశలడుగంటినవి. నౌక నీటితో నిండిపోవుచుండెను. ఓడలో ప్రయాణముసల్పు వణిజు లందరును వెనుకముందు లారయక తమకడనుండు భారమగు సరకులనెత్తి సముద్రమున బడవేయసాగిరి. ఫాహియాను తన "కుండిక"ను (పాత్రను) మరికొన్ని వస్తువులను జలధిలో జారవిడిచెను. భారతవర్షమునుండి గొని

వచ్చుచున్న గ్రంథరాజములను, బౌద్ధవిగ్రహములను నావికు లెక్కడ నీటిలో బారవైచెదరో యని దిగులుపడుచు మన ఫాహియాను యవలోకితేశ్వరునిపై చిత్తము నిల్పి, "దయామయా! యీ యుపద్రవమును దప్పింప నీదియె భారము. బౌద్ధధర్మముల నరయుటకై కడుదూరము ప్రయాణముసల్పితిని. ఇప్పుడీనడిసముద్రమున జిక్కుపడితిని. నీ యద్భుతమహిమచే నన్నుమరల చీనాసామ్రాజ్యమున జేర్చి రక్షింపు" మని ధ్యానింపజొచ్చెను.

ఇట్టి తుపాను కడు భయంకరముగ పదమూడహోరాత్రములు వీచినది. ఎట్టకేలకు ఓడగొట్టుకొనిపోయి యొకద్వీపమునుజేరుకొన్నది. అంతటవాయువేగముతగ్గినది. తరంగముల యుద్ధృతము చల్లారెను. ప్రమాదముతప్పినది. ఓడయడుగునబడిన రంధ్రము గాన్పించెను. చిల్లికప్పివేయబడెను. ప్రయాణము మరలయథాస్థితిగ సాగెను. కాని యిప్పుడైననుఓడ సురక్షితముగ యొడ్డుచేరు నను నాశ లేకుండెను. ఒకగండము దప్పిన మఱియొకటియెదురగుచుండెను. ఆపరిసరసముద్రప్రాంతమంతయు నోడదొంగలకు స్థావరము. వారికంటబడిన నౌక దప్పించుకొనిపోవుట కల్ల. దరి గాన్పింపదు. కనుచూపుమేరదూరముననెటుజూచినను మహాజలరాశి. అపారపారావారమే గాన్పింపజొచ్చినది. ఓడ యేదిశకుబోవుచుండెనో తెలియకుండెను. దిక్కులు తెలిసికొనుట దుస్సాధ్యమయ్యెను. సూర్యచంద్రనక్షత్రగణములగతినిబట్టియే నావికు లోడను నడుప జొచ్చిరి. ఆకసము మేఘావృతమై చీకట్లుగ్రమ్మి నక్షత్రరాసులు గానరానపు

జోడ వాయుదేవుని హస్తమున బంతివలె యాతడు గొని పోయినచోటికెల్ల బోవుచు నడువజొచ్చినది. నిశాసమయముల ననిలకాంతుల బురుడించు తళుకుల గ్రక్కుచు బడుచు లేచుచుండు తరంగమాలికలు దప్ప వేరెవ్వియు గానబడ వయ్యెను. అప్పుడప్పుడు సముద్రజలములనివసించు క్రూరనక్ర మహాకచ్ఛపాది జీవరాసులు దృష్టిపథమున బడుచుండెను. దారియు తెన్నును గానక పవనఘాతములకు గురియగుచు, నామహాసముద్రమున జిక్కుకొనుట గాంచి యేమిగతియని పాంథులు దిగులుపడజొచ్చిరి. అచ్చటి సముద్ర మంతయు మహాయగాధ మగుటచే లంగరువైచి యోడ నాపుటకైనను సాధ్యపడకుండెను. నాలుగయిదుదినము లిట్లు గడచినవి. ఓడ ప్రభంజనుడు కొనిపోయినకెల్ల బోవుచు యాయంధకారమున బడి ప్రయాణ మొనర్చినది. ఐదవనాడు భాగ్యవశమునమబ్బులు విడిపోయినవి. అంబరవీధి ప్రశాంతమై తారకాగణములు గాన్పింపదొడగెను. దిక్కులు తెలియజొచ్చినవి. పాంథుల వోముములు వికసించినవి. నౌక సరియగుమార్గమునుబట్టినది. కాని యంతటితో కష్టములు గడచిపోవలేదు. సముద్రజలములలో మహాశిలలు మణగియుండును. వాని దాకెనేని యాయుపద్రవమును దప్పింప నేరికెని శక్యముగాదు. ఓడ వ్రయ్యలై వికావికలగును. పాంథుల కిక బ్రతు కెక్కడిది?

ఇట్లు చిత్తసంక్షోభమునకు గురియగుచు ఎప్పు డేప్రమాదము వాటిల్లునో యని ప్రాణము లరచేత నిడుకొని యా బాటసారులు తొంబదిదినములు ప్రయాణమొనర్చి యెట్టకేల

కు "యవ" ద్వీపమను నొక ద్వీపమును జేరిరి. ఇచ్చట బ్రాహ్మణమతము మున్నుగాగల దుర్మతములెమిగుల ప్రబలముగ నుండెను. బౌద్ధమతము కడు దైన్యస్థితియం దుండెను.

మన ఫాహియాను యవద్వీపమున నైదుమాసము లుండి పిమ్మట నొకవర్తకనౌక నెక్కి మరల బయలుదేరెను. ఈ యోడపై గూడ నిన్నూరుపాంథు లుండిరి. ఏబదిదినములకు సరిపోవు సంబారములు మాత్ర మీ "జలవాహిని" పై నుండెను. ఆషాఢబహుళ విదియా దినమున, గాలి యనుకూలముగ విసరుచుండ నోడ యీశాన్యదిశాభిముఖమై బయలు దేరినది.

వాంగ్‌ఛౌపట్టణము మన బాటసారుల గమ్యస్థానమగుటచే యోడ యీశాన్యదిశగా బోవుచుండెను. వారొక్క మాస మెట్టిప్రమాదము నెరుగక సురక్షితముగ ప్రయాణ మొనర్చిరి. అంతట కష్టములు మరల ప్రారంభమైనవి. ఒక్క నాటి రేయి రెండవ యామమున నాకస్మికముగ గగన భాగ మంతయు మేఘావృతమై భీకరమగు తుపాను వీవదొడగినది. హోరున వర్షము గురియజొచ్చినది. ఆయుత్పాతలక్షణములగాంచి బాటసారులప్రాణము లెగసి పోయినవి. ఫాహియాను 'రక్షింపు'మని యవలోకితేశ్వరుని ప్రార్థింపసాగెను. వాని యనుగ్రహమువలన నెట్టిహానియు దొరలకుండ యా రేయి గడచెను. ప్రభాతమైనతోడనే యా యోడలోని బ్రాహ్మణమతావలంబు లందరు నొక్కచోట సభదీర్చి యిట్లు వితర్కింపసాగిరి. "మన యోడలో నీబౌద్ధసన్యాసి యుండుట

వలననే మన కీ విపత్తు సంభవిల్లినది. మన మీాతని నీ ప్రాంతమునందు ద్వీపములలో నేదేని యొక ద్వీపమున దించిపోయితిమేని మన కీయాపద దప్పును. ఒక్క మానవునికొరకై యిందరి ప్రాణముల గోల్పోవుట మిగుల యవివేకము.” అదృష్టవశమున నాయోడపై ఫాహియానుని కొక మిత్రుడుండెను. ఆతడు వీరల దుష్ప్రయత్నముల కర్ణాకర్ణిగ విని వెరగుపడి యొక్కపరుగున వారికడకుజని “నిర్దయులారా! మీా రొనర్చు దురాలోచన నాకు దెలిసినది. మీా రీశ్రమణకుని నిందెచ్చటనైన విడచిపోయెద రేని, నన్నును నాతనితో దింపిపోవుడు, లేదేని నన్ను చంపివేయుడు. దయాశూన్యులై యాతనికి హాని దలతురేని, హన్ను సామ్రాజ్యమును జేరినవెనుక, ఆరాజ్యనృపునికడ కేగి మీాచెయ్దములు సర్వమును వానికెఱిగింతును. చీనాసామ్రాజ్యవిభుడును బౌద్ధమతావలంబుడే యని గుర్తెరుగుడు. భిక్షువులయెడ యాతని కమితమగు పూజ్యభావము. వారి కెట్టిహాని సంభవించినను ఆతడు సహింపడు” అని వారింప వణిజులు భయభ్రాంతులై అట్టి దారుణమున కొడిగట్ట సాహసింపరైరి.

తుపాను క్రమముగ ప్రచండమై భీకర మయ్యెను. గగనతలమంతయు కారుమబ్బులచే నావరింపబడెను. పెక్కుదినములవరకును దినకరుడు గాన్పింపడయ్యెను. నల్లడల చీకట్లు గ్రమ్మి మార్గము గానరాకుండెను. కర్ణధారి యోడను తప్పుత్రోవ బట్టించెను. ఇట్టితుపాను ప్రళయాభీలముగ డెబ్బదియహోరాత్రములు విసరెను. ఓడలోని సంబారములు హ్రస్వమైనవి. త్రాగుటకు ఉదకముగూడ కరవయ్యెను. శాక

పాకములకు సముద్రజలమునే ఉపయోగించుచు బాటసారులు మంచినీటిని అపురూపముగ వాడుకొనవలసివచ్చినది. కొంత కాలమున కదియు శూన్యమైనది. ఎంతకును దరి గాన్పింప కుండెను. ఆహారవిహీనులై పాంథు లా నడిసముద్రమున జీవముల బాయవలసినట్లుండెను. అంతట నావికు లందరును గలసి కర్తవ్య మాలోచింపసాగిరి. "మన మీసరికే వాంగ్‌ఛౌనగరమును చేరియుండవలసినది. ఈపట్టణమును జేరుట కేబదిదినములకంటె నెక్కువకాలము బట్టదు. గడువు దాటి పెక్కుదినములు గతించినవి. చూడ, యోడ మార్గము దప్పినట్లు దోచుచున్నది" అనినిర్ణయించి, యేదేని యొడ్డుజేరు కొనుట క్షేమకరమని దలచి ఓడను వాయవ్యదిశగా మర ల్చిరి. పండ్రెండు దినము లట్లు ప్రయాణమొనర్చి యెట్ట కేలకు, చన్గాంగు మండలపు సరిహద్దులలో 'లో' పర్వత ప్రాంతపరిసరములందు ఒడ్డుజేరిరి. అచ్చట వారికి సలిల మును, శాకాది తినుబండములును పుష్కలముగ లభించినవి. గండము దప్పినది.

ఎన్నియో కష్టముల బడి గండముల గడచి, భీకర సమీరములకుగురియై, ఆకస్మికముగ యొడ్డుజేరుట యీ పాంథుల కెంతయు సంతస మయ్యెను. ఆదేశలక్షణ ముల బరికించి తాము జేరుకొనినది చీనారాజ్య మనికూడ గుర్తించి వారలు ఆనందపరవశులైరి. కాని యాపరిసర మం తయు జనశూన్యమై మనుష్యసంచారమేకానరాని నిర్జనప్ర దేశ మగుటచే అది యేప్రాంతమైనదియు దెలిసికొనుట వారికి గష్టమయ్యెను. వాంగుఛౌ పట్టణ మింకను ముందే

యున్నదని కొందరును, దాటివచ్చితిమని కొందరును వాదులాడజొచ్చిరి. అడిగి తెలిసికొనుటకైన నా దాపున నెచ్చటను మనుష్యులయలుకుడు వినరా దయ్యెను. ఎవ్వరేని మనుజులు గాన్పించినయెడల అది యేప్రాంతమో అరసివచ్చెదమని యీపాంథులలో గొందరు సాహసు లొక నావ నెక్కి యాచెంతనే ప్రవహించుచున్న యుప్పుటేటిప్రవాహమునబడి పోయిరి. అట్లు కొంతదూర మేగుసరికి అదృష్టవశమున మృగయా వినోదార్థమై యా ప్రాంతమున దిరుగుచుండిన ఇరువురు మనుజులు దూరమున వారికంట బడిరి. అందులకెంతయు సంతసించుచు వారిని కేకవెట్టి యామృగయుల తమవెంట యోడకడకురమ్మని గొనివచ్చిరి. ఓడలోని బాటసారు లందరును చీనాభాష నెరుగని యన్యదేశీయు లగుటచే ఫాహియానుని బిలిచి యా నూతనపురుషులతో సంభాషింపుమనిరి. ఫాహియాను వారితో నిట్లు మాటలాడసాగెను.

ఫాహియాను—అయ్యా! మీ రెవ్వరు?

నూతనపురుషులు—మేము బుద్ధుని యనుచరులము.

ఫాహి—ఈపర్వతప్రాంతమున కేల వచ్చితిరి?

నూ. పు—(వెలవెలబోవుచు) + బుద్ధభగవానుని కర్పింప మధురఫలముల గొనిపోవుటకై వచ్చితిమి. నేఁ డాశ్వయుజపౌర్ణమి. పర్వదినము.

---

+ నిజముగ వీరు జీవహంతకులగు వేటగాండ్రు. వినోదమునకై మృగముల సంహరించుటకే యచ్చటకు వచ్చిరి. కాని తాము బుద్ధుని యనుచరులమని చెప్పినచో కాషాయాంబరధారియగు ఫాహియాను సంతసించునని అట్లు వచించిరి.

**ఫాహి**—ఇది యేప్రాంతము?

నూ-పు—ఈ కనుపడునవి 'చన్గాంగు' మండలపు సరిహద్దులు. ఈ ప్రదేశమంతయు సిన్నువంశజులచే పరిపాలింపబడు "చింగ్‌ఛా" రాజ్యములోని యంతర్భాగము.

అది విని ఆ యోడలోని వణిజులు గమ్యస్థానమును జేరుకొంటిమిగదా యని సంతోషస్వాంతులై దమ సరకుల నన్నిటిని ఒడ్డుజేర్చి చెన్గాంగు నగరమునకు బంపివైచిరి.

చెన్గాంగునగరాధీశ్వరుడగు 'లీయీ' బౌద్ధమతావలంబుడు, ధర్మనిరతుఁడు. దూరదేశముల కేగి బౌద్ధగ్రంథముల, విగ్రహముల వెంటగొని యెవ్వగో యొకశ్రమణకుడేతెంచెనను వార్త వినినతోడనే యాతడు పరివారసమేతుడై మన ఫాహియానున కెదురేగి యాతని దన రాజధానికి దోడ్కొని పోయెను. తక్కటి వణిజులు 'యాంగ్‌ఛా' పట్టణమునకు మరలి పోయిరి. చెన్గాంగుపట్టణమునుండి ఫాహియాను చింగ్‌ఛా మండలాధిపునిచే నాహ్వానింపబడి అతనినగరమునకరిగి వర్షఋతువుగతించువరకు నందే యుండెను. అచ్చటనుండి యాతడు తిన్నగ చెంగన్నగరమునకు బోవ నభిలషించెను. చెంగన్నగర మాతని నివాసము. ఆతడు దానిని విడిచి చాలకాల మైనది. అచ్చటి బాల్యమిత్రుల జూచి యేండ్లు గడచినవి. దాని నొక్కసారి చూచిపోవుదమని మన ఫాహియానున కాతురత గల్గెను. కాని యంతకంటెను అవశ్యముగ నిర్వర్తింప

వలసిన పవిత్రకార్య మింకను నిర్వర్తింపబడవలసియే యుండు టచే నతడు సత్వరముగ చీనాసామ్రాజ్యరాజధానియగు "నాన్కింగు" నగరమునకుబోయి అచ్చటి బౌద్ధసన్యాసులకు తాను గొనివచ్చిన సూత్రగ్రంథముల నొసగి ధన్యుడయ్యెను. ఆతని సంకల్ప మీడేరినది.

ఫాహియాను చెంగన్నగరమునుండి బయలుదేరి ఆరుదీర్ఘవత్సరములు ప్రయాణమొనర్చి మధ్యభారతమును జేరెను. అచ్చట బౌద్ధగ్రంథముల వెదకుచు, సంస్కృత భాష నభ్యసించుచు ఆరేండ్లు గడపెను. పిమ్మట అచ్చట నుండి పయనమై ఓడనెక్కి, మూడేండ్లకు నిజరాజ్యమును జేరుకొనెను. మార్గమున నాత డెన్నియో రాజ్యముల సందర్శించెను. గోబీయెడారిమొదలు పశ్చిమమున భారతవర్షము దనుక విలసిల్లిన దేశములందు నివసించు భిక్షుకసంఘముల సౌజన్యవర్తనమును వీక్షించినాడు. అందలిజనసంతతులలో బౌద్ధమతముగల్పించిన యద్భుత పరివర్తనమును జూచి యానందించినాడు. చీనారాజ్యమున గలసోదరశ్రమణులి ట్టి చోద్యముల నెన్నడును కనివిని యెఱుగరు. మార్గమున అమిత కష్టములబడి శ్రమలకోర్చి ఎట్టకేలకు ఫాహియాను చీనారాజ్యమునకు మరల దిరిగి వచ్చెను. సముద్రయానమున నాతని కెన్నియోఆపదలుసంఘటిల్లినవి. ఆమణిత్రయప్రభావము చేఅన్నియు గడచి యాతెడు సురక్షితముగ నిల్లుచేరగల్గెను. తక్కటి

శ్రమణకులు గూడ తా గాంచిన వింతల నాలకించి ఆనందించు టకై తన యాత్రావృత్తాంతము నాతడు వెదురుపలకల మీాదను చీనాంబరములపైనను వ్రాసెను.

స ం పూ ర్ణ ము.

---

181

# English-Telugu Dictionary.

**Technical & Scientific**

EDITED BY

Digavalli Venkata Siva Rao, B.A., B.L.

*530 Pages* *Price Rs. 2-8-0*

**Approved by the Text Book Committee Madras, for use in Libraries. Vide Fort St. George Gazette 16-4-35. Page 258.**

CONTAINS:

Telugu Synonyms, Meanings, Explanations and Definitions of English Words and Phrases relating to Politics, Economics & Law; Public Finance, Stock-Exchange, Business and Co-operation;

Mathematics, Physics & Chemistry, Biology, Botany Physiology, Zoology & Anatomy; Astronomy; Physiography and Geography; Hygiene & Medicine; Logic and Philosophy Etc., Etc.

With a Glossary of Hindustani words, Comparative Tables, Statistics, etc.

*Recognized as the standard authority and used in High Schools teaching Scientific Subjects in the vernacular and in Courts and Offices where translation is a daily necessity.*

**" A very useful publication "—Sir Vepa Ramesam.**

**" The first of its kind in Telugu and supplies a long felt want. Bears evidence of labour and research."—Sir Alladi.**

**" Is sure to prove indispensable for purposes of reference in all Public Libraries and in Government and other offices where translation from English to Telugu and *vice versa* has to be done... All honour is due to pioneers like Mr. Siva Rao "—The Hindu.**

**" Is sure to be extremely useful not only to students but also to public workers, writers, journalists and others " --Krishna Patrica.**

**" The author has done a valuable service to the Andhra Desa "—Bharathi.**

**" It is an ornament to the Telugu language "—Grihalakshmi.**

ఇంగ్లీషు — తెలుగు

# పారిభాషిక నిఘంటువు

## " వ్యవహారకోశము — శాస్త్రపరిభాష "

కలసిన సంపుటము

530 పుటలు. వెల రు 2-8-0 లు.

కర్త: దిగవల్లి వేంకట శివరావు, బి. ఏ, బి. యల్.

---

ఆధునిక రాజకీయార్థిక శాస్త్రవిజ్ఞానము, ప్రకృతిశాస్త్ర పరిశోధనలు, ప్రపంచ ప్రజాజీవనములను గూర్చిన నూతనభావములకు సాంకేతికములుగా వార్తాపత్రికలందు, గ్రంథములందు, సంభాషణలందు వినవచ్చు పదివేల ఇంగ్లీషు పారిభాషిక పదములకు తెలుగున పర్యాయపదములు, విపులార్థములు, నిర్వచనములు వ్యాఖ్యానములు గల విజ్ఞాన కోశము. కొన్నివందల హిందూస్థానీ పదములు, వానికి తెనుగు ఇంగ్లీషు పర్యాయ పదములు గలవు. ప్రపంచరాజ్య విస్తీర్ణము, జనసంఖ్య, చలామణియు దెలుపు పట్టికలును ఇంగ్లీషు దేశవాళీ తూనిక కొలతలు, మానములుగల అనుబంధములును గలవు. ప్రభుత్వమువారి తెనుగు తర్జుమా పరీక్షలకు బోవువారికి తెనుగు తర్జుమా యవసరముగల గ్రామ పంచాయితీ, మునిసిపల్, జిల్లాబోర్డు సహకారసంఘముల ఉద్యోగులకు వర్తకులకు భీమా ఏజంట్లకు, వైద్యులకు, గ్రంథకర్తలకు, ఉపాధ్యాయులకు ఎల్లప్పుడు చేత నుండవలసిన అమూల్య గ్రంథము.

" కోర్టులు, రాజకీయములు, శాస్త్రీయవిషయములకు సంబంధించిన అనేక పదములకు అర్థములు వ్రాయబడినవి. వ్యవహారస్థులకు, దేశసేవకులకు విద్యార్థులకు, వ్యాసరచయితలకు, దీనివలన గలుగు ప్రయోజనము లనంతములు. ఆంధ్రభాష కిది అమూల్యభూషణము. విద్యాధికు లనేకుల ప్రస్తుతు లందినది. పాఠ్యగ్రంథనిర్ణయ సభవారిచే గ్రంథాలయోపయోగనిమిత్త మంగీకరింపబడినది."

—గృహలక్ష్మి, మార్చి 1935.

విద్యార్థులకేగాక ప్రచారకులు, లేఖకులు, పత్రికాసంపాదకులు మొదలగువారికెల్ల జాల నుపయోగముగ నుండగలదు. —కృష్ణా పత్రిక.

వ్యవహారపరులేగాక కేవలము భాషాభిమానులును, దీనివలన గొప్ప ప్రయోజనములు పొందగలరు. —భారతి, భావ సం॥ ఆషాఢము,

దిగవల్లి వేంకట శివరావుచే రచియింపబడిన
ఇతర గ్రంథములు

# సహకారవస్త్ర నిలయోద్యమము

గ్రంథాలయములం దుంచుటకు మద్రాసు టెక్ట్సుబుక్కు కమిటీవారు ఆమోదించినారు ( ఫోర్టుసెంట్ జార్జి గెజెట్ 16-4-35, పుట 256 )

ఇది సహకారశాస్త్రసిద్ధాంతములును దేశీయ దేశాంతరసహకారోద్యమమును అందుకు సంబంధించిన రాజకీయార్థిక సమస్యలను విపులముగా చర్చించు ఉత్తమగ్రంథము. రాక్డేలుసహకారోద్యమచరిత్ర, సహకారోత్పత్తి, కృషి, పరిశ్రమ, వ్యాపారముల, ప్రజారోగ్యము విద్యనభివృద్ధిచేయగల సహకారపద్ధతులు, భారతదేశ ప్రజాజీవనము, పారిశ్రామికాభివృద్ధి గ్రామపునర్నిర్మాణములను గూర్చిన ప్రకరణములు నిందుగలవు. భారతదేశ ప్రజల ఆర్థిక స్థితిగతులను ప్రభుత్వాదాయ వ్యయపద్ధతులను ప్రపంచములోని ఇతరదేశములవానితో పోల్చిచూపు స్థితిగతి లెక్కలును మనదుస్థితిని తొలగించు మార్గములను సూచించు వ్యాఖ్యానములును గల 'భారతదేశ స్థితిగతులు' అను 68 పుటల అనుబంధముకూడ గలదు. ఇది కృష్ణాజిల్లా కో-అపరేటివ్ ఫెడరేషనుచే ప్రకటింపబడినది. 260 పుటలు

సాదాబైండు వెల రు 1—0—0 క్యాలికోబైండు వెల రు 1—4—0

# అధినివేశ స్వరాజ్యము

విజ్ఞానచంద్రికలోని 40 వ గ్రంథము.

బ్రిటీషుసామ్రాజ్య స్వరూపస్వభావములు, స్వరాజ్యప్రయోజనము, అధినివేశస్వరాజ్యచరిత్ర, అధినివేశస్వరాజ్యసమస్యలు, ఫెడరలు రాజ్యాంగవిధానము, ప్రజాప్రభుత్వ ప్రాతినిధ్యపద్ధతులు, కెనడా డొమినియను, ఆస్ట్రేలియా కామన్వెల్తు, ఐరిషు ఫ్రీస్టేటు ఆంగ్లరాజ్యాంగములనుగూర్చి ప్రత్యేకప్రకరణములలో చర్చించు ఉత్తమ రాజ్యాంగ

శాస్త్రగ్రంథము. నూతన ఇండియా రాజ్యాంగ చట్టములోని స్వాతంత్ర్యము లేని స్వపరిపాలనము, మినహాయింపులు, రక్షణలు, గవర్నరు, గవర్నరు జనరలుల నిరంకుశాధికారముల స్వభావము, చక్కగా గ్రహించుట కిది తోడ్పడగలదు. వివిధదేశ ప్రజల ఆర్థిక స్థితిగతులు ప్రభుత్వాదాయ వ్యయ పద్ధతులు పోల్చి జూపు స్థితిగతిలెక్కల జాబితాలు 36 కలవు. ఇది "అధినివేశ స్వరాజ్యము, ప్రపంచ రాజకీయములనుగూర్చిన ఉత్తమ గ్రంథ"మని హిందూపత్రిక ప్రశంసించినది. దీని పాశస్త్యమునుగూర్చి ఆంధ్రపత్రిక సంపాదకీయ వ్యాసమున ప్రచురించినది. 250 పుటలు. వెల రు. 0-12-0.

---

# దక్షిణాఫ్రికా

విజ్ఞానచంద్రికా గ్రంథమాలలోని 36 వ గ్రంథము.

దేశచరిత్ర, రాజ్యాంగచరిత్ర, భారతీయులబాధలు, గాంధిమహాత్ముని సత్యాగ్రహచరిత్రము నిందుగలవు.

అనేకపటములు. కాలికో బైండు—432 పుటలు. వెల రు 2-0-0

---

# భారతదేశ స్థితిగతులు

వివిధదేశప్రజల ఆర్థికపరిస్థితులు, ప్రభుత్వాదాయ వ్యయవిధానములు పోల్చిచూపు స్థితిగతిలెక్కలు - 72 పుటలు. వెల రు 0-2-0

---

**ఆంగ్ల రాజ్యాంగము** 30 పుటలు వెల రు 0-1-0

**అంకుల్‌టామ్ కథ** "అంకుల్‌టామ్‌కాబిన్" అను సుప్రసిద్ధ నవలకు తెలుగు. 34 పుటలు—వెల రు 0-1-0

---

వలయువారు:-దిగవల్లి వేంకటశివరావు బి.ఏ., బి. యల్., బెజవాడ.

## బౌద్ధమహాయుగమునుగూర్చిన అభిప్రాయములు

"మా మిత్రులు శ్రీయుత వేలూరి సత్యనారాయణగారు బౌద్ధమహాయుగ మను యితిహాసగ్రంధమును తేటతెనుగున నూతనఫక్కిని రచించి ఆంధ్రదేశమునకెంతయు అమూల్యమైన సేవజేసిరని చెప్పుటలో అతిశయోక్తి యెంతమాత్రము లేదు. శ్రీ సత్యనారాయణగారు తమ గ్రంధమందు అక్కడక్కడ అప్పటప్పటి భారతవర్ష పరిస్థితులను అప్పటప్పటి పరదేశచరిత్రలతో పోల్చి చూపి భారతవర్ష వైభవమును నూతనకాంతులతో చూపించిరి. ఈసందర్భములందు వారు వర్ణించిన వర్ణనలు బహు హృదయానందకరముగనుండి, వీనినిగూర్చి యింకను యెక్కువ పరిశోధనలు గావించిన యెడల యెట్టి నూతనాంశము లుట్టిపడునోయను ఆశ సత్యపిపాసులకు, రసజ్ఞులకు నోటివెంట నూటలూరించును. చివరిదియగు ఉపసంహారప్రకరణమందు వారురచించిన 80 పుటలును అక్షరములను రత్నములతో పొదిగిన ఫలకము లని చెప్పనొప్పును."

—ఆంధ్రపత్రిక 30-4-1928.

"విషయవివరణము దేశభక్తిని ఉద్దీపింప జేయునదిగను, చేర్పబడిన చిత్రములు నాటి భారతకీర్తిని ప్రస్ఫుటముచేయునవిగను ఉన్నవి. ప్రతియాంధ్రుడును తప్పక చదువతగిన ఉత్తమగ్రంధములయందు ఇది యొకటి. ఆంధ్రగ్రంథాలయములకు అలంకారప్రాయమగు గ్రంధము."

—ఆంధ్రభూమి, మే నెల 1936.

"క్రీ. పూ. 575 మొదలు క్రీ. శ. 650 సంవత్సరము వరకుగల భారతదేశచారిత్రము ఈగ్రంధమున వర్ణింపబడినది. కేవలము విద్యాలయ పరీక్షల కుపయుక్తములగు, సారములేని చరిత్రాంశములతో గ్రంధమును సమకూర్చక, మన ప్రాచీన నాగరికతను, పూర్వౌన్నత్యమును, రాజ్యాంగ వైభవమును, వాణిజ్యసంపదను, కళాకౌశల్యమును, రణప్రావీణ్యమును హృదయపటముల జిత్రించు రమణీయ వర్ణనములతోను, సముచిత వ్యాఖ్యానములతోను, ప్రాచీనాధునికయుగ సాదృశ్య వైదృశ్య నిరూపణముల తోడను ఈ గ్రంధమును జీవకళ లూరింపజేసిన గ్రంధకర్తగా రభివందనీయులు."

—ఆంధ్రప్రజ, 21-3-36.

"బౌద్ధమహాయుగము చదువుచు నేను పొందిన యానందమునకు మేరలేదు."

—మంగిపూడి వేంకటశర్మగారు.

"34వ కుసుమముగ 'బౌద్ధమహాయుగము' అను అమూల్య గ్రంథమును రచియించి మామండలి కొసగినందులకు సుప్రసిద్ధ దేశభక్తులగు శ్రీయుత వేలూరి సత్యనారాయణగారికి మేమెంతయు కృతజ్ఞులము."

—శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు,
కార్యదర్శి, విజ్ఞానచంద్రికామండలి.

"In this book the learned author traces in an easy flowing style, the history of Buddhist India to the death of Harsha. The book is an excellent specimen of picturesque history and the author's attempt to make history read like a novel is a laudable one. The book is in every way a great success and deserves a place in every library of this country."

—The Indian Express, 21—3—36.

"It is a Scholarly Work written in flowing and enchanting style and covering the period from 575 BC to 650 AD........ The work is a useful, interesting and instructive piece of his, which ought to find a place in every Library in Andhra Desa."

R. SUBBA RAO GARU, M.A., L.T.,
History Lecturer, Govt. Arts College, Cor. Member,
Ind. Hist. Records Commission etc. etc.

---

# ఆంగ్లచరిత్ర

(ద్వితీయఖండము)

## ట్యూడరు వంశావళి

ఇది సముద్రములరాణి యనిపించుకొని రవి యస్తమింపని నేటి బ్రిటిషు మహాసామ్రాజ్యమును నిర్మింపగల్గిన ఆంగ్లదేశ చరిత్రలోని ద్వితీయ ఖండము. ఆంగ్లదేశ చరిత్రయందలి తేజోవంతమగు ఆశ్వాసము. ట్యూడరుల రాజనీతి, రణకౌశలము, కార్యచతురత, వారి విచిత్ర నిరంకుశ పరిపాలనా వైఖరులు, క్రైస్తవ మతసంస్కరణ మహోద్యమ చిద్విలాసములు, పరమతవిద్వేష తుపాగ్నికీలలు, కేథలిక్కు ప్రాటెస్టంటుల వైరము, 'రుధిర క్రియ' చిత్రవధలు, ఎలిజబెత్తురాజ్ఞి మహోత్కృష్ట పరిపాలన, స్పెయిన్ ఇంగ్లండుదేశముల విచిత్ర కలహములు, "నీటి శునకములు" అని పేరు పడినవారి చర్యలు, సముద్ర చౌర్యములు, ఆంగ్లదీవుల సముద్రాధిపత్యము, నాటి సాంఘిక జీవనము, మత, రాజ్యాంగ, పరిశ్రామికవ్యవస్థలు, మున్నగు చరిత్రాంశములన్నియు పూసగుచ్చినట్లు వివరింపబడినవి. చదువుచుండిన రొమ్ములు జలదరించును. ప్రతియాంధ్రుడును చదువదగిన గ్రంథము. ఆంధ్ర యితిహాసవాఙ్మయమున నిట్టిగ్రంథ మింతవరకును లేదు. వెల రు. 1-4-0

## బౌద్ధాంధ్రము

'బౌద్ధయుగమునాటి' ఆంధ్రదేశచరిత్ర, నాటి ప్రపంచమున అగ్ర పీఠము నలంకరించిన ఆంధ్రప్రతిభ, మగధరాజ్యమునుగూడ జయింపగల్గిన ఆంధ్రుల శౌర్యపటిమ, వారి నౌకాకౌశలము, శిల్పకళాపరిపూర్ణత, జగ ద్విఖ్యాతమగు అమరావతి శ్రీపర్వతముల శిల్పరచనలు, భట్టిప్రోలు, అమరా వతి, చినగంజాము, గుడివాడ, మోటుపల్లి, రామతీర్థము, నాగార్జునకొండ మున్నగు బౌద్ధక్షేత్రముల ప్రాచీనవైభవము, శాతవాహన, పల్లవ, సాలంకా యనులు, ఇక్ష్వాకులు, బృహత్ఫలాయనులు, విష్ణుకండినులు మున్నగు ప్రాచీన ఆంధ్రరాజవంశముల, రాజ్యాంగములు లోనుగాగల చరిత్రవిష యములెన్నియో యిందు వివరింపబడినవి. ఆంధ్రసారస్వతమున అమూల్య గ్రంథము. వెల రు. 1—4—0.

188

# బౌద్ధమహాయుగము

కర్త:—శ్రీయుత వేలూరి సత్యనారాయణగారు, బి. ఏ, బి. యల్.

ఈ గ్రంథము విజ్ఞానచంద్రికా గ్రంథమాలలోని 35 వ కుసుమ
ఇది మద్రాసు టెక్స్టు బుక్కు కమిటీవారిచే గ్రంథాలయములం దుం
కామోదింపబడినది. హిందూదేశచరిత్రయందు గావింపఁబడిన నవీన పరి
వలుగలిగి క్రీస్తుపూర్వము 548 నుండి క్రీస్తు తరువాత 750 వరకు గల
ప్రాధిక సంవత్సరముల భారతదేశచరిత్ర. ఆకాలమునాటి రాజులపాలన
ప్రజల స్థితిగతులు, రాజకీయ, సాంఘిక, మత పరిస్థితులు కన్నులకు
నట్లు వర్ణించు రసవత్తర గ్రంథము. బుద్ధుని కాలనిర్ణయము, ఆది శంక
వారి కాలనిర్ణయములను గూర్చిన చర్చ లింకఁ గలవు.

వైదిక, బౌద్ధ, జైన, అద్వైతమతముల ఉదయాస్తమయము
చంద్రగుప్త, శ్రీహర్ష, శ్రీముఖ, శాతవాహయజ్ఞశ్రీ, శాతకర్ణి మొద
మహారాజుల ఉత్కృష్ట పరిపాలనలును, మౌర్య, ఆంధ్ర, గుప్త, కని
మాళవ, హర్ష మొదలగు సామ్రాజ్యముల వైభవములును, గ్రీకు,
యవన, ప్రహ్లాద, హూణాదిదండయాత్రలును, వానిని భారతీయు లెదుర్కొ
ప్రచండ సంరంభముల నడిపి దేశస్వాతంత్ర్యమును సంరక్షించిన యు
మును, భారతీయులు చైనా, జపాను, సుమిత్రా, జావా, ఈజిప్టు, రో
గ్రీసు మొదలగు దేశములకు ప్రబోధకులనుఁబంపి బౌద్ధ, వైదిక ధర్మ
లను హైందవ నాగరికతను వ్యాపింపజేసిన సాహసకథనమును, న
తక్షశిల, అమరావతి, కాశి, ఉజ్జయిని మున్నగు విశ్వవిద్యాలయ
వృత్తాంతములును, ఆకాలమున వర్ధిల్లిన కళలు, శిల్పము, సాహిత్య
ప్రకృతి శాస్త్రములు, నౌకానిర్మాణము, ఐశ్వర్యము, పరాక్రమము
ధర్మము మొదలగు విషయములును ఇందు రసవంతముగా వర్ణింపఁబడి
శైలి మృదుమధురము. అనేక చిత్రపటములు గలవు. 550 పుటలు.

వెల రు. 2-

---

వలయువారు,

గ్రంథకర్తకు, భీమవరం, పశ్చిమగోదావరిజిల్లా అని వ్రాయవ

